శ్రీః

శ్రీరామచన్ద్రాయ నమః

మహాకవి శ్రీపణ్డితరాజ జగన్నాథ విరచితా

# లక్ష్మీలహరీ
# సుధాలహరీ చ

అమృతధారావ్యాఖ్య : శ్రీ గరిమెళ్ళ సోమయాజులు శర్మ



ప్రకాశకులు

**శ్రీ రావి కృష్ణకుమారీ-మోహనరావు దంపతులు**

510, ప్రైడ్ బ్లాక్, ప్లాటినమ్ కౌంటీ, గోరంట్ల, గుంటూరు-522034

శ్రీః

మహాకవి శ్రీపణ్డితరాజ జగన్నాథవిరచితా

# లక్ష్మీలహరీ సుధాలహరీచ

అమృతధారావ్యాఖ్య

**గరిమెళ్ళ సోమయాజులు శర్మ**

*ప్రథమముద్రణ : ది. **23-06-2021***
*ప్రతులు : **1000***
*పేజీలు : **132***
*వెల రూ. : అమూల్యము*


గరిమెళ్ళ సోమయాజులు శర్మ,
**21-8-85**, గంగానమ్మగుడి యెదుల,
గవర్నమెంట్ ప్రెస్ దగ్గర,
ముత్యాలంపాడు, విజయవాడ-**520 011**
చరవాణి : **6302256361, 8500002982**

***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : **9573711454**

***Printed at -***
Karshak Art Printers,
HYDERABAD

శ్రీః
శ్రీరామచన్ద్రాయ నమః
మహాకవి శ్రీపణ్డితరాజ జగన్నాథవిరచితా

# లక్ష్మీలహరీ

1

**శ్లో॥ సమున్మీలన్నీలామ్బుజనికరనీరాజితరుచా-**
**మపాఙ్గానామ్ భఙ్గైరమృతలహరీశ్రేణిమసృణైః ।**
**హ్రియా హీనం దీనమ్ భృశముదరలీనం కరుణయా**
**హరిశ్యామా సా మామవతు జడసామాజికమపి ॥ ౧**

**అమృతధారావ్యాఖ్య**

కం॥ శ్రీమత్పుష్పగిరీశ
స్వామిపదాబ్జములు గొలిచి - పండితరాజ
శ్రీమల్లక్ష్మీలహరికి
శ్రీమదమృతధార యనఁగఁ జేసెద వ్యాఖ్యన్.

**అవతారిక :** శ్రీజగన్నాథపండితరాజ మహాకవి శ్రీకరుణాలహరిని నిర్మించి జగజ్జనకుఁడగు శ్రీవిష్ణుమూర్తిని స్తుతించిన పిమ్మట జగన్మాత యగు శ్రీమహాలక్ష్మిని స్తోత్రము చేయఁబూనిన వాఁడై లక్ష్మీలహరి యను భక్తికావ్యమును రచించుచు లక్ష్మీదేవి తనను, లోకములను రక్షింపవలెనని మంగళ మాచరించుచున్నాఁడు -

**ప్రతిపదార్థము :** సమ్ + ఉత్ + మీలత్ = సమున్మీలత్ = బాగుగా వికసించుచున్న; నీల + అంబుజ = నల్లకలువలయొక్క; నికర = సమూహముచే; నీరాజిత = నీరాజనము చేయఁబడిన - హారతి పట్టఁబడిన; రుచామ్ = కాంతులు గల; 'స్యుః ప్రభారుగ్రుచి-స్త్విడ్భాభాశ్ఛవిద్యుతిదీప్తయః' అని యమరము. అపాంగానామ్ = క్రీఁగంటిచూపుల యొక్క; భంగైః = కెరటములచే; 'అపాంగౌ నేత్రయోరంతౌ' - అని యమరము.

లక్ష్మీదేవియొక్క నల్లని కలువలవంటి కన్నులనుండి కటాక్షములు నీటి కెరటములవలె నొక దాని వెంబడి నొకటి దొంతరలుగా వచ్చుచున్నవని భావము. అమృతలహరీ = సుధాతరంగములయొక్క; 'పీయూషమమృతం సుధా' – అని యమరము. శ్రేణి = వరుసలవలె; మసృణైః = చిక్కనైనవి యగు కటాక్షములచే; 'చిక్కణమ్ మసృణం స్నిగ్ధమ్' అని యమరము. హ్రియా = సిగ్గుచే; హీనమ్ = హీనుఁడైన వానిని, సిగ్గులేని వానిని; దీనమ్ = ధనములేక దురవస్థను బొందిన వానిని; 'నిస్స్వస్తు దుర్విధో దీనో దరిద్రో దుర్గతోఽపి సః' – అని యమరము. భృశమ్ = మిక్కిలి; ఉదరలీనమ్ = కడుపులో లీనమైన వానిని, పొట్ట నింపుకొనుటయే ప్రవృత్తిగాఁ గలవానిని; మామ్ = నన్ను; జడసామాజికమ్ + అపి = జడుల సమాజమును గూడ; సా = ఆ; హరిశ్యామా = శ్రీవిష్ణుమూర్తి కాంతయైన లక్ష్మీదేవి; కరుణయా = దయతో; 'కారుణ్యం కరుణా ఘృణా కృపా దయానుకంపా స్యాత్' – అని యమరము. అవతు = రక్షించుఁ గాక! 'అవ రక్షణే' యని ధాతువు.

**తాత్పర్యము :** శ్రీమహాలక్ష్మీదేవి బాగుగా వికసించిన నల్లని కలువపూల సమూహముచే హారతి యీఁబడిన కాంతులు గలవి, యమృతతరంగముల పంక్తులవలెఁ జిక్కనైనవి యగు కరుణాకటాక్షవీక్షణములచే సిగ్గులేని వానిని, దుఃఖమునొందిన వానిని, ఉదరపోషణమే వృత్తిగాఁ గల కుక్షింభరి నగు నన్ను జాడ్యముతో నిండిన జనసమూహమును గూడ రక్షించుఁగాక!

**విశేషము :** శీతే సుఖోష్ణసర్వాఙ్గీ గ్రీష్మే యా సుఖశీతలా ।
తప్తకాఞ్చనవర్ణాభా సా స్త్రీ శ్యామేతి కథ్యతే ॥

శీతకాలములో సుఖమును గలిగించు వెచ్చని దేహము గలది, వేసవికాలములో సుఖమును గలిగించు చల్లని శరీరము గలది, పుటము పెట్టిన బంగారమువలె మిలమిల మెఱయు పచ్చని కాంతు లీను రంగు గలది యగు స్త్రీకి **'శ్యామ'** యని పేరు. దీని వలన లక్ష్మీదేవి నిత్యయౌవనవతి యని వ్యక్తమగుచున్నది.

ఇక్కడ 'మీల–నీల', 'పాంగ – భంగ' మొదలగు తావులలో నొకే హల్లావృత్త మగుటచే వృత్త్యనుప్రాసము. 'హీన – దీన – లీన' యనుచోట నంత్యానుప్రాసము.

నీలాంబుజములు కన్నులకు హారతి నిచ్చుచున్న వని యుపమానము కంటె నుపమేయమున కాధిక్యమును వర్ణించుటచే వ్యతిరేకాలంకారము.

**'ఉపమానాదుపమేయస్య గుణవిశేషవత్త్వేనోత్కర్షో వ్యతిరేకః'** – ఉపమానము కంటె నుపమేయమునకు గుణవిశేషము గల్గి యుండుటచే నుత్కర్షమును జెప్పినచో వ్యతిరేకాలంకార మని రసగంగాధరము.

అపాంగభంగము లమృతలహరీశ్రేణులవలె మసృణములని వర్ణించుటచే నుపమాలంకారము. స్తోత్రమునం దంతట కవికి లోకమాత యందుఁ గల భక్తి వ్యజ్యమాన మగుటచే భావధ్వని.

ఈ స్తోత్రకావ్యమునం దంతట **శిఖరిణీవృత్తము. 'రసైరుద్రైశ్ఛిన్నా యమనసభలా గః శిఖరిణీ'** అని వృత్తరత్నాకరము. శిఖరిణీవృత్తములోఁ బ్రతిపాదము నందు **'య–మ–న–స–భ–ల–గ'** యను గణము లుండును. శిఖరిణీవృత్తపాదములో 3–5–12 స్థానములందు ననుప్రాసమును వాడినచోఁ బద్యగమనమున కొక విధమగు సొగసు వచ్చును. 3, 4 పాదములలో 'హీనం–దీనం–లీనం' 'శ్యామా–సామా–సామా' యను శబ్దాలంకారముచే నడక కొక విధమైన లయ వచ్చినది.

## 2

**అవతారిక :** మఱల లక్ష్మీదేవి కడగంటిచూపులనే వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ సమున్మీలత్వన్తఃకరణకరుణోద్గారచతురః**
**కరిప్రాణత్రాణప్రణయిని! దృగన్తస్తవ మయి ।**
**యమాసాద్యోన్మాద్యద్ ద్విపనియుతగణ్డస్థలగల–**
**న్మదక్లిన్నద్వారో భవతి సుఖసారో నరపతిః ॥** ౨

**ప్రతిపదార్థము :** కరిప్రాణత్రాణప్రణయిని! ఇది లక్ష్మీదేవికి సంబోధనము. కరి = ఏనుఁగుయొక్క; ప్రాణ = ప్రాణములను; త్రాణ = రక్షించిన శ్రీమహావిష్ణువుయొక్క; ప్రణయిని = ప్రియురాలా! ఓ లక్ష్మీదేవీ! మొసలివాతకుఁ జిక్కి విలపించిన గజేంద్రుని శ్రీమహావిష్ణువు రక్షించిన గజేంద్రమోక్షకథ యిక్కడ యనుసంధించుకొనవలయును. యమ్ = దేనిని; ఆసాద్య = పొంది; ఉత్ + మాద్యత్ = ఉన్మాద్యత్ = ఎక్కువగా మదించిన; ద్విప = ఏనుఁగుల; నియుత = లక్షసంఖ్యగల; 'శతం సహస్రమయుతం నియుతమ్' అని యాదవప్రకాశయతి వైజయంతీకోశము. ఇక్కడ నియుతశబ్ద మనంత వాచకము. గణనాతీతములైన గజములయొక్క యని భావము. గండస్థల = చెక్కిళ్ళ ప్రదేశములనుండి; గలత్ = కాఱుచున్న; మద = మదజలముచే; క్లిన్న = తడిసిన;

ద్వారః = కోటగుమ్మములు గలవాఁడును; సుఖసారః = ఎక్కువ సుఖము గలవాఁడునుగా; నరపతిః = మహారాజు; భవతి = అగుచున్నాఁడో; సః = అట్టి; అంతఃకరణ = నీ మనస్సు లోని; కరుణా = దయను; ఉద్గార = త్రేన్చుటలో; చతురః = సమర్థమైన; తవ = నీ యొక్క; దృక్ + అంతః = చూపులయొక్క చివరిభాగము– కడగంటిచూపని భావము. మయి = నా యందు; సమ్ + ఉత్ + మీలతు = సమున్మీలతు = బాగుగా వికసించుఁ గాక! ఎక్కువగాఁ బడుఁ గాక! యని భావము.

**తాత్పర్యము :** గజేంద్రుని రక్షించిన విష్ణువునకుఁ బ్రేయసివైన లక్ష్మీదేవీ! నీ కటాక్షము నాపై నెక్కువగాఁ బ్రసరించుఁ గాక! ఆ చూపు నీ మనస్సులో నున్న దయను ద్రేన్చుచుండును. అనఁగా లక్ష్మీదేవి హృదయములోనున్న కృప యామె చూపుల యందే యుబుకుచుండును. ఏ చూపు పడుటవలన మహారాజు కూడ లెక్కింపలేనన్ని యేనుఁగులయొక్క చెక్కిళ్ళనుండి స్రవించుచున్న మదజలముచేఁ దడిసిన కోటగుమ్మము ముందు భాగముగలవాఁడై జీవితసారమైన యెక్కువ సుఖము ననుభవించుచున్నాఁడో యట్టి నీ కటాక్షము నాపై బాగుగాఁ బ్రసరింపవలెనని భావము.

ఇక్కడ – 'కరుణ–కరణ', 'ప్రాణ–త్రాణ', 'సాద్య–మాద్య', 'స్థల–గల' యను తావులలో నొకే హల్లావృత్త మగుటచే వృత్త్యనుప్రాసము. 'క్లిన్నద్వార – సుఖసార' యనుచోట నంత్యానుప్రాసము.

గజేంద్రుని ప్రాణములను రక్షించుటలోఁ దత్పరుఁడైన విష్ణుమూర్తియొక్క భార్య యంతకంటెను దయావతి యని 'కరిప్రాణత్రాణప్రణయిని!' యను విశేషణము సాభిప్రాయమగుటచేఁ బరికరాలంకారము.

అలంకారః పరికరః సాభిప్రాయే విశేషణే ।
సుధాంశుకలితోత్తంసస్తాపం హరతు వః శివః ॥ (చంద్రా–5–39)

విశేషణము సాభిప్రాయమైనచోఁ బరికరము. అమృతకిరణుఁడు శిరోభూషణముగాఁ గల శివుఁడు మీ తాపమును హరించుఁగాక! చంద్రుఁడే చల్లని వెన్నెలనిచ్చి మన తాపమును బోఁగొట్టును. అట్టి చంద్రుఁడే శిరోభూషణముగాఁ గల శివుఁ డింకను మిక్కిలి తాపము చల్లార్చునని భావము.

లేక యీ శ్లోకములో లక్ష్మీవాచకశబ్దము లేకుండుట వలనఁ 'గరిప్రాణత్రాణ–ప్రణయిని' యనునదే విశేష్యమగుటచేఁ బరికరాంకురాలంకారము.

సాభిప్రాయే విశేష్యే తు భవేత్పరికరాంకురః ।
చతుర్ణామ్ పురుషార్థానాం దాతా దేవశ్చతుర్భుజః ॥ (చంద్రా-5-40)

విశేష్యము సాభిప్రాయమైనచోఁ బరికరాంకురము. నాలుగు భుజములు గల విష్ణువు నాలుగు పురుషార్థముల నొసఁగుఁగాక! యనుచోట ధర్మార్థకామమోక్షములను నాలుగు పురుషార్థముల నిచ్చుటకు నాల్గు భుజములుగల వాఁడని భావము వచ్చుటచేఁ బరికరాంకురము.

ఈ శ్లోకమునందలి యుత్తరార్ధములో లక్ష్మీకటాక్షము గల రాజుయొక్క సంపత్సమృద్ధిని వర్ణించుటచే నుదాత్తాలంకారము.

ఉదాత్తమృద్ధిశ్చరితం శ్లాఘ్యమ్ (చంద్రా-5-115)

శ్లాఘింపఁదగిన చరిత్ర సమృద్ధిని వర్ణించినచో నుదాత్తాలంకారమని చంద్రాలోకము.

ఉద్గారము = త్రేనుపు. 'ఉమియు' - 'క్రక్కు' - 'త్రేన్చు' మొదలగునవి రోఁతపుట్టించునవి కానిచో గ్రామ్యత్వము లేదు.

నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాది గౌణవృత్తివ్యపాశ్రయిమ్ ।
అతిసుందరమన్యత్ర గ్రామ్యకక్షాం విగాహతే ॥ (కావ్యా-1-95)

అని దండి చెప్పినాఁడు.

## 3

**అవతారిక :** మఱల లక్ష్మీదేవి క్రీఁగంటి చూపుల కృపనే వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ ఉరస్యస్య భ్రశ్యత్కబరభరనిర్యత్సుమనసః**
**పతన్తి స్వర్బాలాః స్మరశరపరాధీనమనసః ।**
**సురాస్తం గాయన్తి స్ఫురితతను గఙ్గాధరముఖా-**
**స్తవాయం దృక్పాతో యదుపరి కృపాతో విలసతి ॥** 3

**ప్రతిపదార్థము :** ఓలక్ష్మి! (ఈ సంబోధనము నిచ్చట నధ్యాహారము చేసికొనవలయును.) తవ = నీయొక్క; అయమ్ = ఈ; దృక్పాతః = చూపుపాటు; కృపాతః = దయతో; యత్ + ఉపరి = ఎవనిపై; విలసతి = ప్రకాశించునో; అస్య = వానియొక్క; ఉరసి =

వక్షఃస్థలముపై; భ్రశ్యత్ = విడిపోవుచున్న; కబరభర = బరువైన కొప్పునుండి; నిర్యత్ = జాఱుచున్న; సుమనసః = పూలుగలవారు; 'స్త్రియః సుమనసః పుష్పమ్ ప్రసూనం కుసుమం సుమమ్' – అని యమరము. స్మర = మన్మథునియొక్క; శర = బాణములచే; పర + అధీన = పరవశమైన; మనసః = మనస్సులు గలవారు నగు; స్వః + బాలాః = స్వర్గలోకమునందలి యప్సరఃకాంతలు; 'స్వరవ్యయస్వర్గనాకత్రిదివత్రిదశాలయాః' – అని యమరము. పతంతి = పడుచున్నారు. వారి యంతట వారే వచ్చి సంభోగమునకై యెదపై వ్రాలుచున్నారని భావము. తమ్ = వానిని; గంగాధరముఖాః = శివుఁడు మొదలగు; సురాః = దేవతలు; స్ఫురితతను = పులకించిన దేహములతో; గాయంతి = గానము చేయుచున్నారు.

**తాత్పర్యము :** ఓ లక్ష్మీదేవీ! నీయొక్క దృష్టిపాతము కరుణతో నెవ్వనిపైఁ బడునో వాని యురఃస్థలముపై విడిపోవుచున్న పెద్దకొప్పులనుండి జలజల రాలుచున్న పూలతో మన్మథుని బాణములకుఁ బరవశించిన మనస్సులు కలవారై దేవతాస్త్రీలు సురతకేళికై పడుచున్నారు. అట్టి వానిని జూచి శివప్రముఖులైన దేవత లందఱు గగురుపొడిచిన యొడళ్ళతో గానము చేయుచున్నారు. అంత కంటె భాగ్యమేమి కావలయునని భావము.

**వ్యాకరణవిశేషములు :**

కృపాతః – **పంచమ్యా స్తసిల్ (5-3-7)** అను పాణినీయసూత్రముచేఁ బంచమీ-విభక్త్యర్థములో వచ్చిన 'తసిల్' ప్రత్యయము.

స్ఫురితతను – 'గాయంతి' యను క్రియకు విశేషణ మగుటచే నపుంసకత్వము.

స్య-స్య, బర-భర – అని హలావృత్తిచే వృత్త్యనుప్రాసము.

ప్రథమ-ద్వితీయపాదముల చివర 'మనసః' అను మూఁడు హల్లుల సముదాయ మర్థభేదముతో నావృత్త మగుటచే **యమకము.**

ఇటువంటి శ్లోకమే శ్రీశంకరభగవత్పాదుల సౌందర్యలహరి యందును గలదు-

శ్లో॥ నరం వర్షీయాంసం నయనవిరసం నర్మసు జడం
తవాపాఙ్గాలోకే పతితమనుధావన్తి శతశః ।
గలద్వేణీబన్ధాః కుచకలశవిస్రస్తసిచయా
హఠాత్త్రుట్యత్కాఞ్చ్యో విగలితదుకూలా యువతయః ॥ (13)

## 4

**అవతారిక :** మఱల నమ్మవారి కటాక్షమహిమనే వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥** **సమీపే సఙ్గీతస్వరమధురభఙ్గీ మృగదృశాం**
**విదూరే దానాన్ధద్విరదకలభోద్దామనినదః ।**
**బహిర్ద్వారే తేషామ్ భవతి హయహేషాహలహలో**
**దృగేషా తే యేషాముపరి కమలే! దేవి! సదయా ॥** ౪

**ప్రతిపదార్థము :** కమలే! దేవి! = ఓ లక్ష్మీదేవీ! 'కమలా శ్రీర్హరిప్రియా' – అని యమరము. తే = నీయొక్క; ఏషా దృక్ = ఈ చూపు; యేషామ్ + ఉపరి = ఎవరిపై; సదయా = దయతోఁ గూడినదై; (పతతి = పడునో యని శేషము); తేషామ్ = వారియొక్క; సమీపే = దగ్గఱ ప్రదేశములో; మృగదృశామ్ = లేళ్ళచూపులవంటి చూపులు గల స్త్రీలయొక్క; సంగీత = సంగీతాలాపముతోఁ గూడిన; స్వర = 'సరిగమపధని' స్వరములయొక్క; మధుర = తియ్యని; భంగీ = మూర్ఛనాది పద్ధతి; భవతి = ఉండును; విదూరే = వారికిఁ గొంచెము దూరములో; దాన + అంధ = దానజలముచే మోడ్చిన కన్నులుగల; ద్విరద = ఏనుఁగులయొక్క; కలభ = ఏనుఁగు గున్నలయొక్క; ఉద్దామ = గొప్పదైన; నినదః = ఘీంకారధ్వని; భవతి = ఉండును; బహిః + ద్వారే = బహిర్ద్వారే = వారి కోటగుమ్మమునకు ముంగల; హయ = గుఱ్ఱములయొక్క; హేషా = సకలింపులయొక్క; కలకలః = కలకలధ్వని; భవతి = ఉండును.

**తాత్పర్యము :** ఓ కమలాదేవీ! నీ చూపు దయతో నెవ్వరిపైఁ బ్రసరించునో వారికి సమీపములో గాయనీమణుల సంగీతస్వరమూర్ఛనాధ్వనులు, కొంచెము దూరములో మదించిన యేనుఁగుల, యేనుఁగుగున్నల మహాఘీంకారధ్వనులు, వారి కోటగుమ్మముల ముందు గుఱ్ఱముల సకిలింపుల ధ్వనులు నుండును.

లక్ష్మీకటాక్షము ప్రసరించిన వాఁడు మహారాజగును గాన వాని సన్నిధిలో సంగీతసభలు, కోటముందు గజతురగబలముల ధ్వనులు గొప్పఁగా నుండునని భావము.

ఇక్కడ (1) స్త్రీల సంగీతము (2) ఏనుఁగుల ఘీంకారము (3) హయముల హేషలు నను మూఁడు వాక్యములందును ధ్వనియను నొకేయర్థమును జెప్పుటచే నిదర్శనాలంకారము.

శ్లో॥ వాక్యార్థయోః సదృశయోరైక్యారోపో నిదర్శనా। (చంద్రా-5-58)

సమానములైన వాక్యార్థముల కేకత్వారోపము **నిదర్శన** యని చంద్రాలోకలక్షణము.

**విశేషము :** ఇక్కడ రెండవపాదములో దానాంధద్విరదములు మఱియుఁ గలభములుఁ (ఏనుఁగులు, ఏనుఁగుగున్నలు) అని ద్వంద్వసమాసమునే చెప్పవలయును గాని, ద్విరదములయొక్క కలభములని షష్ఠీసమాసము చెప్పఁగూడదు. 'కలభః కరిశాబకః' అని యమరకోశమునం దుండుటచేఁ గలభ శబ్దమునకే యేనుఁగుగున్న యని యర్థమున్నప్పుడు మఱల ద్విరదకలభ మని ద్విరదశబ్దము వాడుట వ్యర్థము. దానాంధములైన ద్విరదకలభములని చెప్పుట కూడ సరిగాదు. కలభములకు మత్తేభములవలె దానమదజలధార లుండుట యసంభవము. కలభ మనఁగా 5 సంవత్సరముల వయస్సు గల యేనుఁగుగున్న.

శ్లో॥ కాష్ఠత్వక్ తృణసేవనస్తనుకచః పంకాంబుపాంసుప్రియః
స్వల్పం హృష్యతి కోపమేతి చ సుఖం దుఃఖం యతో బుద్ధ్యతి ।
శబ్దాదీనపి వేత్తి యంతృవశగో హ్యుత్థానవిత్ ప్రోల్లసత్
స్వచ్ఛావగ్రహదంత ఏష కలభః ప్రాప్తః సమామ్ పంచమీమ్ ॥
(గజ-5-58)

చెట్టుపట్టలను గడ్డిని దినునది, తక్కువ వెంద్రుకలు కలంది, బురదయందు, దుమ్మునందు దొరలునది, తక్కువ సంతోషము, కోపము గలది, సుఖదుఃఖముల నెఱుఁగునది, శబ్దజ్ఞానము కలది, మావటీని యదుపులో నుండునది, దాని యంతట యది లేచునది, ప్రకాశించు స్వచ్ఛమైన దంతపు మొలకలు గలది, యైదు సంవత్సరముల యీడు గలది **కలభ**మని పాలకాప్యమహర్షి గజశాస్త్రము.

**5**

**అవతారిక :** మఱల లక్ష్మీదేవి యపాంగములే తన పాపములను హరింపవలెనని ప్రార్థించుచున్నాఁడు -

**శ్లో॥ అగణ్యైరిన్ద్రాద్యైరపి పరమపుణ్యైః పరిచితో**
**జగజ్జన్మస్థేమప్రలయరచనాశిల్పనిపుణః ।**
**ఉదఞ్చత్పీయూషామ్బుధిలహరిలీలామనుహర -**
**న్నపాఙ్గస్తేఽ మన్దమ్ మమ కలుషబృన్దం దలయతు ॥** ౫

**ప్రతిపదార్థము :** సంబోధనము లేని ప్రతిశ్లోకమునందును లక్ష్మీదేవి సంబోధనము నధ్యాహారము చేసికొనవలయును. ఓ లక్ష్మీదేవీ! అగణ్యైః = లెక్కింపలేని; పరమపుణ్యైః = మిక్కిలి పుణ్యాత్ములైన; ఇంద్ర + ఆద్యైః + అపి = ఇంద్రుఁడు మొదలగు దేవతలచేఁ గూడ; పరిచితః = పరిచయము చేయఁబడినది (సేవింపఁబడినది); జగత్ = విశ్వముయొక్క; జన్మ = పుట్టుక; స్థేమ = ఉండుట; ప్రలయ = లయము పొందుట యనువానిని; రచనా = చేయుట యను; శిల్ప = శిల్పమునందు; నిపుణః = సమర్థమైనది; ఉదంచత్ = పొంగుచున్న; పీయూష + అంబుధి = అమృతసముద్రము యొక్క; లహరి = కెరటములయొక్క; లీలామ్ = విలాసమును; అనుహరన్ = క్రమముగా హరించునదియగు; తే = నీయొక్క; అపాంగః = వాలుచూపు; మమ = నాయొక్క; అమందమ్ = తక్కువ కాని; కలుష బృందమ్ = పాపసమూహమును; దలయతు = చీల్చుఁగాక! పోఁగొట్టుఁగాక! 'పాపం కిల్బిషకల్మషం కలుషమ్'; 'బృందం నికురుంబం కదంబకమ్' అని యుభయత్ర యమరము. ఇక్కడ మూఁడవ పాదము చివర 'అనుహరన్' అనుచోట 'విలసితః' అను పాఠాంతరము గలదు. అప్పుడు – లీలా = విలాసముచే; విలసితః = ప్రకాశించునది యని యర్థము.

**తాత్పర్యము :** ఎక్కువ పుణ్యము చేసినవారు, లెక్కింపలేని వారునగు నింద్రుఁడు మొదలగు దేవతల సేవాసంపర్కము గలది, జగములను బుట్టించుట, రక్షించుట, నాశనము చేయుటయను శిల్పములో నైపుణ్యము గలది, యుప్పొంగుచున్న యమృత సముద్రముయొక్క కిరణముల విలాసములను దొంగిలించునది యగు నీ వాలుచూపు కరడుగట్టిన నా పాపములను విదలించుఁగాక!

ఈ శ్లోకమే రసగంగాధరములో నిదర్శనాలంకార ప్రకరణములోఁ బదార్థ నిదర్శన కుదాహరణముగాఁ జూపఁబడినది. పదార్థనిదర్శనా యథా – 'అగణ్యై రింద్రాద్యైః...' అత్ర దృగన్తామ్బుధిలహరిలీలయోరాశ్రయభేదాద్భిన్నయోరపి సాదృశ్యమూలస్తాద్రూప్యాభిమానః। ఆరోపో వా దృగన్తే లహరిలీలాయాః ॥

ఇక్కడ లక్ష్మీదేవి దృగంతము, పీయూషాంబుధిలహరిలీల యొకే యాశ్రయము గలవి గావు. రెండును వేఱు వేఱు. అయినను రెండింటికి సాదృశ్యమూలమైన (లక్ష్మీకటాక్ష మమృతసముద్రతరంగము వంటిది) తాద్రూప్యాభిమానము కలదగుటచేఁ బదార్థనిదర్శనాలంకారము. లేక లక్ష్మీదేవి దృగంతముపై లహరిలీల యారోపింపఁ బడుటచేఁ గూడ నిదర్శనయే.

ఈ రసగంగాధరశ్లోకములో మూఁడవ పాదమునందు – 'ప్రసర్పత్ పీయూషామ్బుధిలహరిలీలావిలసితః' అను పాఠాంతరము గలదు. నాల్గవపాదము మొదట 'దృగన్త' – అను పాఠము గలదు.

అందువల్లనే కావ్యమాలాసంపాదకులగు దుర్గాప్రసాదు గారు, శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు, నాగరాజశర్మగారు 'అనుహరన్' అను పాఠమును గ్రహించిరి. ఉస్మానియా ప్రతి సంపాదకులార్యేంద్రశర్మగారు, చంద్రప్రభావ్యాఖ్యాతలగు భువనేశ్వరకర శర్మగారు, 'విలసితః' అను పాఠమును స్వీకరించిరి. బాలక్రీడాకర్తలగు శ్రీమధుసూదన శాస్త్రిగారు 'ప్రసర్పత్పీయూషామ్బుధిలహరిలీలావిలసితః' అను రసగంగాధరపాఠమునే లక్ష్మీలహరిలోఁ గైకొనిరి. ప్రసర్పత్ = వేగముగాఁ బాముచుట్టలవలె వచ్చుచున్న కిరణములని యర్థము. సృప్ ౨ – గతౌ – భ్వాదిధాతువు.

**విశేషము :** యతో వా ఇమాని భూతాని జాయన్తే; యేన జాతాని జీవన్తి; యత్ప్రయ–న్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి॥ ఈ భూతములన్నియు దేనినుండి పుట్టుచున్నవో, పుట్టినవి దేనివలన జీవించుచున్నవో, చివరకు దేనియందుఁ బ్రవేశించుచున్నవో యది బ్రహ్మమని తెలిసికొనుమని తైత్తిరీయోపనిషత్తు.

జన్మాద్యస్య యతః (బ్ర.సూ. 1–1–2) 'జన్మ + ఆది + అస్య + యతః' అని బ్రహ్మసూత్రము.

జన్మస్థితిభంగం యతః సర్వజ్ఞాత్ సర్వశక్తేః కారణాద్ భవతి తద్బ్రహ్మేతి వాక్యశేషః – అని శ్రీశంకరభాష్యము.

శ్లో॥ యస్మిన్నిదం యతశ్చేదం యేనేదం య ఇదం స్వయమ్ ।
యోఽస్మాత్ పరస్మాచ్చ పరస్తమ్ ప్రపద్యే స్వయమ్భువమ్ ॥
(భాగ–8స్క–3–3)

అని శ్రీమద్భాగవతము.

ఉ॥ ఎవ్వనిచే జనించు జగ–మెవ్వని లోపల నుండు లీనమై
యెవ్వని యందు డిందుఁ బర–మేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ–డెవ్వఁడు సర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు–నీశ్వరునే శరణంబు వేఁడెదన్.
(భాగ–8స్క–73)

అని పోతనమహాకవి యాంధ్రానువాదము.

'జగజ్జన్మస్థేమప్రలయరచనాశిల్పనిపుణః' అనుటచే లక్ష్మీదేవికటాక్షమే పరబ్రహ్మస్వరూపమని ధ్వని.

**6**

**అవతారిక :** ఇప్పుడు పద్మాదేవి పాదారవిందమును వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ నమన్మౌలిశ్రేణిత్రిపురపరిపన్థిప్రతిలసత్**
**కపర్దవ్యావృత్తిస్ఫురితఫణిఫూత్కారచకితః ।**
**లసత్ఫుల్లామ్భోజమ్రదిమహరణః కో౽పి చరణః**
**చిరం చేతశ్చారీ మమ భవతు వారీశదుహితుః ॥** ౬

**ప్రతిపదార్థము :** నమత్ = వంగి నమస్కరించుచున్న; మౌళి = శిరస్సులయొక్క; శ్రేణి = వరుసగల; శివుఁడు పంచాననుఁడు కావున నైదు తలలను వంచి నమస్కరించు చున్నాఁడని భావము. త్రిపురపరిపంథి = త్రిపురములకు శత్రువైన శివునియొక్క; 'అభిఘాతి పరారాతి ప్రత్యర్థి పరిపన్థినః' - అని యమరము. ప్రతిలసత్ = ప్రతిప్రకాశించుచున్న; కపర్ద = జటాజూటముయొక్క; వ్యావృత్తి = కదలికచే; స్ఫురిత = అదిరిన; ఫణి = పాముయొక్క; ఫూత్కార = ఫూత్కారముచే - బుస్స కొట్టుటచే; చకిత = భయపడిన - ఇది చరణమునకు విశేషణము. లసత్ = ప్రకాశించుచున్న; ఫుల్ల = వికసించిన; అంభోజ = పద్మముయొక్క; మ్రదిమ = మృదుత్వమును; హరణః = హరించునది యగు; వాః + ఈశ = జలాధిపతియైన సముద్రునియొక్క; 'ఆపః స్త్రీ భూమ్ని వార్వారి' - అని యమరము. దుహితుః = కూఁతురైన లక్ష్మీదేవియొక్క; కః + అపి = ఒకానొక యనిర్వాచ్యమైన; చరణః = పాదము; చిరమ్ = ఎల్లప్పుడు; మమ = నాయొక్క; చేతః + చారీ = మనస్సునందు సంచరించునది; 'చిత్తం తు చేతో హృదయం స్వాంతం హృన్మానసమ్ మనః' - అని యమరము. భవతు = అగుఁగాక!

**తాత్పర్యము :** శివుఁడు లక్ష్మీదేవి పాదములకు వంగి నమస్కరించుచున్నాఁడు. పంచముఖుఁడైన శివుఁడు తన యైదు తలలను వంచి నమస్కరించుచుండఁగా నాశిరస్సులపై నున్న జటాజూటమునకుఁ జుట్టఁబడి యున్న పామున కదురుపాటు కలిగి పడగయెత్తి ఫూత్కారముతో బుస్సకొట్టినది. ఆ పాము బుస్సకు భయపడి లక్ష్మీదేవి తన పాదమును వెనుకకు లాగికొన్నది. ఆ పాదము బాగుగా వికసించిన పద్మముయొక్క

మెత్తదనమును దొంగిలించునది. అమ్మవారి పాదము తామరపూవుకంటెను మెత్తనైనదని భావము. అట్టి యలౌకిక మహిమగల లక్ష్మీదేవి పాద మెల్లపుడు నా మనసులో సంచరించుఁగాక! నా హృదయమునందు నిల్చుఁగాక! యని భావము.

**మ్రదిమ :** పృథ్వాదిభ్య ఇమనిజ్వా (5-1-122) అను సూత్రముచే మృదుశబ్దముపై 'ఇమనిచ్' ప్రత్యయము చేరి 'రఋతో హలాదేర్లఘోః (6-4-161) అను సూత్రముచే 'మృ' అను నక్షరము నందలి ఋకారమునకు రేఫము, ఉకారలోపమువచ్చి మ్రదిమయని యైనది.

లక్ష్మీదేవి 'శివవంద్య' (శివుఁనిచేఁ గూడ నమస్కరింపఁదగినది) యని చిన్న వాక్యములోఁ జెప్పఁదగిన విషయమును 'నమన్మౌళి... ...చకితః' అని యేకసమాసము లో దీర్ఘవాక్యములోఁ జెప్పుటచేఁ 'బ్రౌఢి'యను గుణము గలదు.

అర్థస్య ప్రౌఢిరోజః (కావ్యా-3-2-2)

పదార్థే వాక్యరచనా వాక్యార్థే చ పదాభిధా ।
ప్రౌఢిర్వ్యాససమాసౌచ సాభిప్రాయత్వమేవ చ ॥

అని వామనుని కావ్యాలంకారసూత్రము. కుదించిచెప్పుట సమాసము. విస్తరించి చెప్పుట వ్యాసము.

పద్మాక్షుఁడు = పద్మముల వంటి కన్నులు గలవాఁడు విష్ణుమూర్తి. కాని రాయలవా- రాముక్తమాల్యదలో - 'బాలార్కాంశువిజృంభితామలశరత్పద్మాక్ష!' (ఆముక్త-1-86) బాలసూర్యుని కిరణములచే వికసింపఁబడిన నిర్మలమైన శరత్కాలమునందలి పద్మముల వంటి కన్నులు గలవాఁడా! యని శ్రీవేంకటేశ్వరస్వామిని దీర్ఘసమాసములో సంబోధించుట ప్రౌఢి.

**విశేషము :** ఈ శ్లోకము మొదలుకొని లక్ష్మీదేవి సౌందర్యమును వర్ణించుచున్నాఁడు. 'దేవతానాం రూపమ్ పాదాంగుష్ఠాత్ ప్రభృతి వర్ణ్యతే. మానుషాణాం కేశాదారభ్యేతి ధార్మికాః' దేవతల రూపము పాదములనుండి, మానుషుల రూపము కేశములనుండి వర్ణింపఁబడునని మల్లినాథమహోపాధ్యాయుని కుమారసంభవ సంజీవనీవాక్యము ననుసరించి పద్మాదేవి పాదారవిందముతో వర్ణనము మొదలుపెట్టినాఁడు.

## 7

**అవతారిక :** ఇప్పు డిందిరాదేవి పాదకాంతిని వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥** **ప్రవాలానాం దీక్షాగురురపి చ లాక్షారుణరుచాం**
**నియన్త్రీ బన్ధూకద్యుతినికరబంధూకృతపటుః ।**
**నృణామన్తర్ధ్వాన్తం నిబిడమపహర్తుం తవ కిల**
**ప్రభాతశ్రీరేషా చరణరుచివేషా విజయతే ॥** ౭

**ప్రతిపదార్థము :** ప్రవాలానామ్ = పగడములకు లేక లేఁతచిగుళ్ళకు; 'ప్రవాలోఽస్త్రీ కిసలయే వీణాదణ్డే చ విద్రుమే' యని మేదినీకోశము. దీక్షాగురుః = దీక్షనిచ్చిన యాచార్యుఁడు; అపి చ = ఇంకను; లాక్షా = లక్కయొక్క; అరుణరుచామ్ = ఎఱ్ఱని కాంతులకు; నియంత్రీ = నియంత్రించునది; బంధూక = మంకెనపూవులయొక్క; ద్యుతి = కాంతుల; నికర = సమూహమునకు; బంధూకృత = చుట్టమగుటలో; పటుః = నేర్పుగలది యగు; తవ = నీయొక్క; చరణరుచివేషా = పాదకాంతివేషములో నున్న; ఏషా = ఈ; ప్రభాతశ్రీః = ప్రాతఃకాలశోభ; నృణామ్ = మానవులయొక్క; నిబిడమ్ = దట్టమైన; అంతః + ధ్వాంతమ్ = లోపలనున్న చీఁకటిని; అపహర్తుమ్ = దొంగిలించుటకు (పోఁగొట్టుటకు); కిల = సమర్థమైనదై; విజయతే = సర్వోత్కృష్టముగా నున్నది.

**తాత్పర్యము :** ఈ శ్లోకములో లక్ష్మీదేవి చరణకాంతి పగడములకంటె, లేఁతచిగుళ్ళ కంటె, లక్కకంటె, మంకెనపూవులకంటె, బ్రభాతకాంతులకంటె మిక్కిలి యెఱ్ఱనైన దని వర్ణింపఁబడినది. ఓ లక్ష్మీదేవీ! పగడములకు లేఁతచిగుళ్ళకు దీక్ష నొసఁగిన గురువు, లత్తుక యెఱ్ఱనికాంతుల నడ్డగించునది, మంకెనపూవులకు బంధువైనదియై మానవుల దట్టమైన లోఁజీఁకటిని హరించునదై నీ చరణవేషములో నున్న యీ ప్రభాతశోభాలక్ష్మి సర్వోత్కృష్టముగా వర్తిల్లుచున్నది.

బంధూకృతి : ఇంతకు ముందు బంధువు కాని దానిని బంధువుగా సంపాదించునది. బంధు + కృతి = కృభ్వస్తియోగే సంపద్యకర్తరి చ్విః (5–4–50) అను సూత్రముచే 'చ్వి' ప్రత్యయము. బంధు + చ్వి + కృతి. చ్వౌ చ (7–4–26) అను సూత్రముచే బంధుశబ్దమునందలి ఉకారమునకు దీర్ఘము వచ్చి 'బంధూకృతి' యని యగును. 'అభూతతద్భావ ఇతి వక్తవ్యమ్' అను వార్తికముచే నంతకు ముందు కానిది, తద్భావమును బొందుట చ్విప్రత్యయార్థము.

అతథ్యమారోపయితుం తథ్యాపాస్తిరపహ్నుతిః । (చంద్రా–5–24)
అసత్యవిషయమునారోపించుటకు సత్యవిషయమును గప్పిపుచ్చుట యపహ్నుతి.

కైతవాపహ్నుతిర్వ్యక్తా వ్యాజాద్యైర్నిహ్నవే పదైః ।
నిర్యాన్తి స్మరనారాచాః కాంతా దృక్పాతకైతవాత్ ॥ (చంద్రా–5–28)

మచ్చెకంటి చూపుల మిషతో మన్మథుని బాణములు వెలువడుచున్నవని యసలు విషయమును గప్పిపుచ్చి వర్ణించినచోఁ గైతివాపహ్నుతి యని చంద్రాలోకము. ఇక్కడ లక్ష్మీదేవి చరణరుచిని నిహ్నవించి ప్రభాతశ్రీనిఁ జెప్పుటచే నపహ్నుతి యలంకారము.

దీక్షాగురు – నియంత్రీ – బంధూకృతిశబ్దములు సాదృశ్యవాచకములు గావున నుపమాధ్వని.

## 8

**అవతారిక :** ఇప్పుడు లోకమాత మృదువైన చరణమును గఠోరమైన తన వాణి యెట్లు వర్ణింపఁ గలదని వినయముతోఁ జెప్పుచున్నాఁడు –

**శ్లో॥ ప్రభాతప్రోన్మీలత్ కమలవనసఞ్చారసమయే**
**శిఖాః కిఞ్జల్కానాం విదధతి రుజం యత్ర మృదులాః ।**
**తదేతన్మాతస్తే చరణమరుణం శ్లాఘ్యకరుణం**
**కఠోరా మద్వాణీ కథమియమిదానీమ్ ప్రవిశతు ॥** ౮

**ప్రతిపదార్థము :** మాతః! = ఓ తల్లీ! లక్ష్మీ! ప్రభాత = ప్రాతఃకాలమునందు; ప్ర + ఉత్ + మీలత్ = ప్రోన్మీలత్ = మిక్కిలి వికసించుచున్న; **'ప్రభాతోన్మీలచ్ఛ్రీ'** యని బూర్గులవారి పాఠము. అప్పుడు – ఉన్మీలత్ = వికసించుచున్న; శ్రీ = శోభతోఁ గూడిన యని చెప్పుకొనవలయును. కమలవన = పద్మసమూహమునందు; సంచార సమయే = నడయాడు వేళలో; యత్ర = ఎక్కడ; మృదుల = మెత్తనివియైన; కింజల్కానామ్ = కేసరములయొక్క; శిఖాః = కొనభాగములు; రుజమ్ = బాధను; విదధతి = కల్గఁజేయుచున్నవో, యట్టి; శ్లాఘ్యకరుణమ్ = పొగడఁదగిన దయ గలది; అరుణమ్ = ఎఱ్ఱనిది యగు; తత్ + ఏతత్ = ఆయీ; చరణమ్ = పాదమును; కఠోరా = కఠినమైన; ఇయమ్ = ఈ; మత్ + వాణీ = నాయొక్క మాట; ఇదానీమ్ = ఇప్పుడు; కథమ్ = ఎట్లు; ప్రవిశతు = ప్రవేశింపఁగలదు? స్తుతింపఁగలదు?

**తాత్పర్యము :** ఓ జననీ!; లక్ష్మీదేవీ! సూర్యోదయకాలములో నీవు పద్మవనములో సంచరించునప్పుడు మిక్కిలి మెత్తనైన పద్మకేసరముల మొనలు కూడ నీ పాదమునకు గ్రుచ్చుకొని బాధ కల్గఁజేయుచున్నవి. నీ పాదము కమలకేసరముకంటెను కోమల మైనది. అందువల్లనే మిక్కిలి యెఱ్ఱనిది, శ్లాఘింపఁదగిన దయ గలది. అటువంటి మృదులమైన నీ చరణమును స్తుతించుటకు నా వాణి యెట్లు ప్రవేశింపఁగలదు? ఎప్పుడు నేవిధముగను బ్రవేశింపఁజాలదు. నీ చరణమును వర్ణించుటకు నేను సమర్థుఁడను గానని భావము.

ఇక్కడ మిక్కిలి మెత్తనివి యగు పద్మకేసరముల మొనలుకూడ ముండ్లవలె గ్రుచ్చుకొని లక్ష్మీ పాదములు కందిపోవున ట్లెఱ్ఱవానిగాఁ జేయుచున్నవని వర్ణించుటచే నతిశయోక్తి యలంకారము.

## 9

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి స్మరణమహిమను వర్ణించుచున్నాఁడు.

**శ్లో॥ స్మితజ్యోత్స్నామజ్జద్ద్విజమణిమయూఖామృతఝరై-**
**ర్నిషిఞ్చన్తీం విశ్వం తవ విమలమూర్తిం స్మరతి యః ।**
**అమన్దం స్యన్దన్తే వదనకమలాత్తస్య కృతినో**
**వివిక్తౌ వై కల్పాః సతతమవికల్పా నవగిరః ॥**

**ప్రతిపదార్థము :** ఓ లక్ష్మీదేవీ! స్మిత = నీ నవ్వనెడు; జ్యోత్స్నా = వెన్నెల యందు; మజ్జత్ = మునుఁగుచున్న; ద్విజమణి = శ్రేష్ఠమైన దంతములయొక్క లేక దంతములనెడు మణులయొక్క; మయూఖ = కిరణకాంతులనెడి; అమృతఝరైః = అమృతము ప్రవహించు సెలయేళ్ళచే; విశ్వమ్ = సమస్తజగత్తును; నిషిఞ్చన్తీమ్ = తడుపుచున్న; తవ = నీయొక్క; విమలమూర్తిమ్ = నిర్మలమైన విగ్రహమును; యః = ఎవఁడు; స్మరతి = స్మరించుచున్నాఁడో; తస్య కృతినః = ఆ కుశలునియొక్క; 'కృతీ కుశల ఇత్యపి' యని యమరము. వదనకమలాత్ = ముఖపద్మమునుండి; వివిక్తౌ = వివేకమునందు; అవికల్పాః = మాఱులేని; కల్పాః = యథోచితసామర్థ్యముగల; నవగిరః = క్రొత్త వాక్కులు; వై = నిశ్చయముగా; సతతమ్ = ఎల్లప్పుడు; అమందమ్= ఎక్కువగా; స్యందంతే = ప్రవహించుచున్నవి.

**తాత్పర్యము :** ఓ లక్ష్మీదేవీ! నీ నవ్వనెడు వెన్నెలలో మునుఁగుచున్న నీ దంతము లనెడు మణులయొక్క కిరణము లనెడు నమృతనదీప్రవాహములచే సమస్తవిశ్వమును దడుపుచున్న నీ నిర్మలమైన దివ్యమూర్తి నెవ్వఁడు స్మరించునో యా పుణ్యాత్ముని ముఖపద్మమునుండి వివేచనతోఁ గూడినవి, వికల్పములు లేనివి యథోచితసామర్థ్యము గల వ్రతకల్పములవంటి నూతనవాక్కు లెల్లప్పుడు నిశ్చయముగాఁ బ్రవహించును.

ఈ శ్లోకములో స్మితమునందు జ్యోత్స్నాత్వము, దంతములందు మణిత్వము, మయూఖములం దమృతఝరత్వము నారోపింపఁబడుటచే రూపకాలంకారము. అవికల్పములు, కల్పములు ననుచోట విరోధాభాసము.

## 10

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి మంత్రబీజాక్షర జపమహిమను వక్కాణించుచున్నాఁడు–

**శ్లో॥ శరౌ మయాబీజౌ హిమకరకలాక్రాన్తశిరసౌ**
**విధాయోర్ధ్వమ్ బిన్దుం స్ఫురితమితి బీజం జలధిజే! ।**
**జపేద్యః స్వచ్ఛన్దం స హి పునరమన్దం గజఘటా–**
**మదభ్రామ్యద్భృఙ్గైర్ముఖరయతి వేశ్మాని విదుషామ్ ॥** ౧౦

**ప్రతిపదార్థము :** జలధిజే = సముద్రమునుండి పుట్టిన లక్ష్మీదేవీ!; మాయాబీజౌ = మాయకు మూలములైన; భగవంతుని యఘటనఘటనాశక్తికి మాయయని పేరు. లేక, మాయాః = లక్ష్మీదేవియొక్క; బీజౌ = మంత్రబీజాక్షరములైన; 'ఇందిరా లోకమాతా మా' యని యమరము. శరౌ = శకార–రకారములను; హిమకర = చంద్రునియొక్క; కలా = కళచే; ఆక్రాంత = ఆక్రమింపఁబడిన; శిరసౌ = తల గల వానినిగాఁ జేసి; చంద్రకళయొక్క యాకారము గల ఈకారముతోఁ గూడిన శిరోభాగము గలవిగా; విధాయ = చేసి; ఊర్ధ్వమ్ = వాని పైభాగమునందు; బిందుంచ = పూర్ణానుస్వారమును గూడ; విధాయ = ఉంచి; ఇతి = ఈ విధముగా; స్ఫురితమ్ = స్ఫురించిన (ప్రకాశించిన); 'స్ఫుటితమ్' అని పాఠాంతరము. అప్పుడు స్ఫుటితమ్ = సంపుటి చేయఁబడిన; బీజమ్ = (శ+ర+ఈ+ం = శ్+ర్+ఈ+ం) **'శ్రీం'** అను బీజాక్షర మంత్రమును; యః = ఎవఁడు; స్వచ్ఛందమ్ = స్వేచ్ఛగా (స్వీయమార్గములో); జపేత్ = జపముచేయునో; సః = వాఁడు; హి = నిశ్చయముగా; పునః = మఱల; అమందమ్ = తక్కువ కాని; గజ = ఏనుఁగులయొక్క; ఘటా = సమూహముయొక్క; మద = మదజలమునందు;

భ్రామ్యత్ = భ్రమించుచున్న; తిరుగుచున్న; భృంగైః = తుమ్మెదలచే; విదుషామ్ = పండితులయొక్క; వేశ్మాని = ఇండ్లను; ముఖరయతి = ధ్వనింపఁజేయును.

**తాత్పర్యము :** మాయకు లేక లక్ష్మీదేవికి మూలబీజములైన శవర్ణ-రేఫములను, చంద్రకళాకారములో నున్న ఈకారముతోఁ గూడిన వానినిగాఁ జేసి వాని శిరస్సుపైఁ బూర్ణబిందువు నుంచఁగా వచ్చిన **'శ్రీం'** అను లక్ష్మీబీజాక్షరమంత్రము నెవఁడు స్వచ్ఛందముగా జపించునో యతఁడు పండితుల గృహములను గూడ నెక్కువ యేనుఁగు గుంపులయొక్క మదజలధారలలోఁ దిరుగు తుమ్మెదల ఝంకారములతో నిండిన వానిగాఁ జేయును. లక్ష్మీబీజాక్షరజపము చేయువాఁడు తాను ధనవంతుఁ డగుటయే కాక మఱల నితరపండితులను గూడ ధనవంతులుగాఁ జేయునని భావము.

ఇక్కడ లక్ష్మీమంత్రమును జపించిన వాఁడు తక్కిన పండితులను గూడ ధనవంతులుగాఁ జేయుచున్నాఁడని చెప్పవలసిన విషయమును బండితుల గృహముల నేనుఁగు గుంపుల మదజలధారలపై మూఁగుచున్న తేంట్ల ఝంకారములతో మ్రోఁగు వానిగాఁ జేయుచున్నాఁడని భంగ్యంతరముగాఁ జెప్పుటచేఁ బర్యాయోక్త మలంకారము.

శ్లో॥ కార్యాద్యైః ప్రస్తుతైరుక్తే పర్యాయోక్తమ్ ప్రచక్షతే ।
తృణాన్యంకురయామాస విపక్షనృపపద్మసు ॥ (చంద్రా-5-70)

ప్రస్తుతకార్యముచేఁ బ్రస్తుతకారణముయొక్క ప్రతీతి గల్గినచోఁ బర్యాయోక్తాలంకారము. ఓరాజా! నీవు శత్రువుల యిండ్లలో గడ్డి మొలుచునట్లు చేసితివి. ఇక్కడ నీ శత్రువుల యిండ్లలో గడ్డి మొలిచినదను కార్యమువలన నీ శత్రువు లందఱు చచ్చిరను కారణము ప్రతీయమాన మగుటచేఁ బర్యాయోక్తమని చంద్రాలోకము.

పర్యాయోక్తం తు గమ్యస్య వచో భంగ్యంతరాశ్రయమ్ ।

గమ్యమైన దానినిఁ బ్రకారాంతరముగాఁ జెప్పినచోఁ బర్యాయోక్తమని కువలయానందము.

వివక్షితస్యార్థస్య భంగ్యంతరేణ ప్రతిపాదనమ్ పర్యాయోక్తమ్।

చెప్పఁ దలఁచిన యర్థమును భంగ్యంతరముగాఁ బ్రతిపాదించినచోఁ బర్యాయోక్తమని రసగంగాధరము.

ఇటువంటి శ్లోకమే శ్రీశ్రీహర్షుని నైషధీయచరితము నందును గలదు.

శ్లో॥ అవామావామార్ధే సకలముభయాకారఘటనాద్
ద్విధా భూతం రూపమ్ భగవదభిధేయమ్ భవతి యత్ ।
తదన్తర్మన్త్రమ్ మే స్మరహరమయం సేన్దుమమలం
నిరాకారం శశ్వజ్జప నరపతే! సిద్ధ్యతు స తే ॥ (నైష-14-88)

ఇది సాక్షాత్సరస్వతీదేవి నలమహారాజున కుపదేశించిన **చింతామణీమంత్ర** శ్లోకము. దీనికి (1) భగవత్పరముగా (2) మంత్రపరముగా (3) యంత్రపరముగా ననేకార్థములు వచ్చును.

**1) భగవత్పరము :** ఓ నలమహారాజా! దేహములో సగభాగము నందుఁ బురుషుఁడును, సగభాగమునందు స్త్రీయును రెండు విధములుగా నేర్పడి యా రెండాకారములు కలియుటవలన సంపూర్ణమైన భగవచ్ఛబ్దముచేఁ జెప్పఁదగిన యర్ధనారీశ్వరరూపము, చంద్రకలతోఁ గూడినదియు, నిర్మలమైనదియు నేయాకారము లేనిదియు, మంత్రరూపమై హకారరూపమైన నా రూపము నంతఃకరణమునందు మాటిమాటికి జపింపుము. ఆ మంత్రస్వరూపుఁడైన యర్ధనారీశ్వరుఁడు నీకుఁ బ్రసన్నుఁ డగుఁగాక!

**2) మంత్రపక్షము :** పూర్వార్ధమునందు (అవా) ఓకారముచే (మా) మకారముచే (ఓమ్) నట్లే యుత్తరార్ధమునందు ఓకార-మకారములతో (ఓమ్) గూడినదై యనఁగా నాద్యంతములందు ఓంకారములతో హరమయమైనది **'ఓం హర ఓం'** అను నుభయాకారము గలది, హరవర్ణములతో ఈకార బిందువులతోఁ గూడినది (హ్ + ర్ + ఈ + ం) **'హ్రీం'** అనునది, యాద్యంతములందుఁ బ్రణవము చేరినచో **'ఓం హ్రీం ఓం'** అని యగును. అట్లే సకల - కకార లకారములతో నుభయాకారము నొంది ఈకార బిందువులతోఁ గూడి క్ + ల్ + ఈ + ం **'క్లీం'** అనునది, యాద్యంతములందు నోంకారముల చేరినచో **'ఓం క్లీం ఓం'** అగును. భగవత్స్వరూపములై, నిర్మలములైన 'ఓం హ్రీం ఓం' 'ఓం క్లీం ఓం' అను మంత్రములను నెల్లప్పుడు జపింపుము. నీకు మంత్రము సిద్ధించును.

**3) యంత్రపక్షము :** భగవద్యోనివలెఁ గనఁబడు నేత్రికోణాత్మకరూపము గలదో యది యుభయాకారఘటనముచే - రెండు త్రికోణములు కలియుటచే షట్కోణ మేర్పడును. ఆ షట్కోణములకు మధ్యనున్న మంత్రము 'ఓం హ్రీం ఓం' లేక 'ఓం క్లీం ఓం'. ఈ

మంత్రమును షట్కోణయంత్రమునందు నిలిపి ధ్యానము చేయుము. నీకు సర్వము సిద్ధించును.

ఇదియే శ్రీశ్రీహర్షుఁ డుపాసించిన **చింతామణీమంత్రము**. కొందఱీ మంత్రమును 'ఓం హ్రీం క్లీం ఓం' అని కూడ సంపుటీకరించుచున్నారు.

మంత్రశాస్త్రములో 'ఓం ఐం హ్రీం క్లీం శ్రీం' మొదలగునవి ప్రధాన బీజాక్షరములు. శ్రీశ్రీహర్షకవి 'ఓం హ్రీం క్లీం' బీజాక్షరముల నుపదేశించినాఁడు. జగన్నాథకవి 'శ్రీం' అను బీజాక్షరము నుపదేశించినాఁడు. రెండు శ్లోకములు పృథ్వీవృత్తములే.

పూర్వ గోదావరీమండలమునందలి కోనసీమలోని పేరూరు, ముంగండ మొదలగు గ్రామములు మంత్రశాస్త్రమునకు, మంత్రశాస్త్రజ్ఞులగు పండితులకు నిలయములు. జగన్నాథపండితరాయల పూర్వవంశజులు ముంగండ గ్రామవాస్తవ్యులని ప్రాచీన పండిత పరంపరాప్రసిద్ధము. పండితరాయలు కూడ మంత్రశాస్త్రనిష్ణాతుఁ డనుటకుఁ గొన్ని నిదర్శనము లతని గ్రంథములందే గలవు.

(1) ప్రతిభ (2) వ్యుత్పత్తి (3) అభ్యాసము ననునవి కావ్యనిర్మాణమునకు హేతువులని యాలంకారికుల మతము. జయదేవుఁడు, జగన్నాథుఁడు మొదలగువారు కావ్యమునకుఁ బ్రతిభయే ప్రధానకారణమని, వ్యుత్పత్త్యభ్యాసములు ప్రతిభావికాసమునకు హేతువులని ప్రతిపాదించినారు. ఈ సందర్భములో జగన్నాథ మహాకవి –

'ప్రతివాదిభిః మంత్రాదిభిః కృతే కతిపయదివసవ్యాపిని వాక్స్తంభే విహితానేకప్రబంధస్యాపి కావ్యానుదయస్య దర్శనాత్' – 'ప్రతివాదులు మంత్రాదులచే వాక్స్తంభనమును జేసినచో నా మంత్రశక్తిగల కొన్నిదినముల వఱకు ననేక మహాగ్రంథములు రచించిన కవికిఁ గూడఁ గావ్యమును రచింపఁ గల శక్తి లేకపోవుట లోకములోఁ జూచుచున్నా'మని రసగంగాధరములో వాక్రుచ్చినాఁడు.

**11**

**అవతారిక :** ఇప్పుడు రమాదేవి చరణస్మరణ సామర్థ్యమును వర్ణించుచున్నాఁడు.

**శ్లో॥ స్మరో నామం నామం త్రిజగదభిరామం తవ పదమ్**
**ప్రపేదే సిద్ధిం యాం కథమివ నరస్తాం కథయతు ।**

**యయా పాతం పాతం పదకమలయోః పర్వతచరో**
**హరో హా రోషార్ద్రామనునయతి శైలేన్ద్రతనయామ్ ॥ 11**

**ప్రతిపదార్థము :** ఓలక్ష్మీదేవీ! త్రిజగత్ = ముల్లోకములకు; అభిరామమ్ = అందమైన; తవ = నీయొక్క; పదమ్ = పాదమును (అడుగును); నామం నామమ్ = నమస్కరించి, నమస్కరించి; స్మరః = మన్మథుఁడు; యాం సిద్ధిమ్ = ఏ సిద్ధిని; ప్రపేదే = పొందెనో; తామ్ = దానిని; నరః = సామాన్యమానవుఁడు; కథమ్ + ఇవ = ఏవిధముగా?; కథయతు = చెప్పఁగలఁడు; యయా = ఏ సిద్ధిచే; పర్వతచరః = పర్వతమునందుఁ జరించెడు; హరః = శివుఁడు; హా = అయ్యో!; రోష + ఆర్ద్రామ్ = కోపముచేఁ జెమర్చిన; శైల + ఇంద్ర + తనయామ్ = పర్వత శ్రేష్ఠుఁడైన హిమవంతునియొక్క కొమార్తెయైన పార్వతీదేవిని; పదకమలయోః = పాదపద్మములపై; పాతమ్ పాతమ్ = మాటిమాటికిఁ బడుచు; అనునయతి = బతిమాలుచున్నాఁడు.

**తాత్పర్యము :** ముజ్జగములకు మనోజ్ఞమైన నీయొక్క పాదమును మ్రొక్కి మ్రొక్కి మన్మథుఁడెట్టి సిద్ధిని సాధించెనో దానిని సామాన్యనరుఁడెట్లు వర్ణింపఁగలఁడు? అట్టి సిద్ధిని బొందిన మదనుని శక్తివల్లనే పర్వతమునందుఁ దిరుగాడు శివుఁడు కూడ నయ్యో! కోపముచేఁ జెమరించిన పార్వతీదేవి పాదములపై వ్రాలివ్రాలి ప్రసన్నురాలగుటకు వేఁడుకొనుచున్నాఁడు.

ఇక్కడ శివుఁడు పార్వతిపాదములపైఁ బడుటకు మన్మథశక్తి కారణము. మన్మథునకా శక్తి వచ్చుటకు లక్ష్మీదేవి పాదనమస్కారము కారణము. ఇట్లుత్తరోత్తర వస్తువులకుఁ బూర్వపూర్వవస్తువులు కారణమని చెప్పుటచేఁ గారణమాలయలంకారము.

శ్లో॥ గుంఫః కారణమాలా స్యాద్యథా ప్రాక్ ప్రాంతకారణైః ।
నయేన శ్రీః శ్రియా త్యాగస్త్యాగేన విపులం యశః ॥ (చంద్రా–5–37)

పూర్వపూర్వకారణము లనంతరములకుఁ గారణములని గుంఫించినచోఁ గారణమాలాలంకారము. నీతివలన సంపద, సంపదవలనఁ ద్యాగము, త్యాగమువలనఁ గీర్తి వచ్చునని చంద్రాలోకలక్షణము. 'నామం నామమ్, పాతమ్ పాతమ్' –అనునవి ణములంతములగు క్రియారూపములు.

ణమ్ (నమ) – ప్రహ్వత్వే శబ్దేచ (భ్వాది)

పత – గతౌ వా (చురాది) అను ధాతువులకు – ఆభీక్ష్ణ్యే ణముల్ చ (4–4–22) అను సూత్రముచే 'ణముల్' (అమ్) ప్రత్యయమువచ్చి 'నామం నామమ్ – పాతమ్ పాతమ్' అను రూపములేర్పడును. ఆభీక్ష్ణ్యమనఁగా బౌనఃపున్యము.

పునః పునః – మఱల మఱల యని యర్థము. సమానకర్తృకములై పూర్వకాలమును బోధించు ధాతువులకుఁ బౌనఃపున్యార్థములో 'ణముల్' ప్రత్యయము వచ్చును. 'ఆభీక్ష్ణ్యే ద్వే భవతః' అనువార్తికముచేఁ బౌనఃపున్యార్థములో ణములంతములగు ధాతువులకు ద్విర్వచనము వచ్చి 'నామం నామమ్' 'పాతమ్ పాతమ్' అను రూపములేర్పడును. ఈ ణములంతములగు ధాతురూపముల నెప్పుడు జంటలు జంటలుగానే ప్రయోగింప వలయును. సూత్రము నందలి చకారముచే 'క్త్వా' ప్రత్యయము వచ్చి 'నత్వా నత్వా' 'పతిత్వా పతిత్వా' అను రూపములు కూడ నేర్పడును.

ఈ ప్రౌఢప్రయోగములు జగన్నాథపండితరాయల మహావైయాకరణత్వమును వ్యక్తము చేయుచున్నవి. జగన్నాథకవి సామాన్యపండితుఁడు గాఁడు. (1) శబ్దకౌస్తుభ శాణోత్తేజనము (2) మనోరమాకుచమర్దనమునను ప్రౌఢగ్రంథములను రచించి వ్యాకరణ పాండిత్యమును వెల్లడించిన దిట్ట.

## 12

**అవతారిక :** ఇప్పుడు రమాదేవి కాలి గోళ్ళను వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ హరన్తో నిశ్శఙ్కం హిమకరకలానాం రుచిరతాం**
**కిరన్తః స్వచ్ఛన్దం కిరణమయపీయూషనికరమ్ ।**
**విలుమ్పన్తు ప్రౌఢా హరిహృదయహారాః ప్రియతమా**
**మమాన్తః సన్తాపం తవ చరణశోణామ్బుజనఖాః ॥** ౧౨

**ప్రతిపదార్థము :** ఓ లక్ష్మీదేవీ! హిమకరకలానామ్ = చంద్రకళలయొక్క; రుచిరతామ్ = సొగసును; నిః + శంకమ్ = సందేహము లేకుండ; హరంతః = దొంగిలించునవియు; స్వ + ఛందమ్ = స్వేచ్ఛగా; కిరణమయపీయూషనికరమ్ = కాంతులతో నిండిన యమృత సమూహమును; కిరంతః = వెలిగ్రక్కునవియు; ప్రౌఢాః = నేర్పుకలవియు; హరి = విష్ణుమూర్తియొక్క; హృదయ = వక్షఃస్థలమునకు; హారాః = దండలవంటివియు; ప్రియతమాః = శ్రీమహావిష్ణువునకు మిక్కిలి యిష్టమైనవియునగు; తవ = నీయొక్క; చరణ = పాదములనెడు; శోణ + అంబుజ = ఎఱ్ఱని పద్మముయొక్క; నఖాః =

గోళ్ళు; మమ = నాయొక్క; అంతః = లోపలనున్న; సంతాపమ్ = దుఃఖమును; విలుంపన్తు = నాశనము చేయుఁ గాక!

**తాత్పర్యము :** ఓ లక్ష్మీదేవీ! కొంచెము కూడ శంక లేకుండఁగ, చంద్రరేఖల సౌందర్యము నపహరించునవియు, వెలుఁగులతో నిండి స్వచ్ఛందముగా నమృత ప్రవాహమును వెలికిఁ జిమ్మునవియు, నడివయస్సులో నున్నవియు, లక్ష్మీదేవి విష్ణువక్షఃస్థలనివాసిని యగుటచే శ్రీవిష్ణుమూర్తి వక్షఃస్థలమునకు హారముల వంటివియు, లేక రతిబంధ-విశేషములో లక్ష్మీదేవి తన పాదములను విష్ణువు వక్షఃస్థలమునం దానుచుటచే స్వామి యురఃఫలకముపై దండలవలె నుండునవియు, నందువల్లనే విష్ణుమూర్తికి మిక్కిలి యిష్టమైనవియు నగు నీ యడుగుఁ దమ్ముల గోళ్ళు నా మనస్సులో నున్న దుఃఖమును బోఁగొట్టుఁ గాక!

ఇక్కడ లక్ష్మీదేవి యంఘ్రుల యందలి గోళ్ళను విష్ణుమూర్తి వక్షఃస్థల హారములుగా నూహించుటచే నుత్ప్రేక్షాలంకారము. శోణాంబుజమువంటి చరణమని యర్థము గావున నుపమితసమాసము.

## 13

**అవతారిక :** ఇప్పుడు మంగళదేవత కాలియందెలను వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ మిషాన్మాణిక్యానాం విగలితనిమేషం నిమిషతా-**
**మమన్దం సౌన్దర్యం తవ చరణయోరమ్బుధిసుతే! ।**
**పదాలఙ్కారాణాం జయతి కలనిక్వాణనపటుః**
**ఉదఞ్చన్నుద్దామస్తుతివచనలీలాకలకలః ॥** ౧౩

**ప్రతిపదార్థము :** అంబుధిసుతే = సముద్రకుమారీ! లక్ష్మీదేవీ!; తవ = నీయొక్క; చరణయోః = పాదములయొక్క; అమందమ్ = తక్కువ కాని; సౌందర్యమ్ = అందమును; మాణిక్యానామ్ = కెంపుల; మిషాత్ = మిషచే - వ్యాజముచే; విగలిత నిమేషమ్ = ఱెప్పపాటు లేకుండ; మిషతామ్ = చూచుచున్న; పద + అలంకారాణామ్ = నీ పాదముల కలంకారములైన యందెలయొక్క (ఇది కర్తృపదము); కల = అవ్యక్త మధురముగా; నిక్వాణన = మ్రోఁగుటలో; పటుః = సమర్థమైనది; ఉదంచన్ = విజృంభించినది యగు; ఉద్దామ = గొప్పదైన; స్తుతివచన = స్తోత్రవాక్యములయొక్క; లీలా = విలాసముయొక్క; కలకలః = కలకలధ్వని; జయతి = సర్వోత్కృష్టముగా నొప్పుచున్నది.

**తాత్పర్యము :** ఆఁడువారు పాదముల కలంకారములుగా నూపురములు ధరింతురు. ఆ నూపురములు కెంపులు పొదిగినవై యుండును. లక్ష్మీదేవి పాదమంజీరములు మాణిక్యములను మిషతో లక్ష్మీదేవి పాదముల గొప్పయందమును తెప్పపాటు లేకుండఁ దిలకించుచున్నవి. మ్రోఁగుచున్న యా నూపురముల యవ్యక్తమధురధ్వని లక్ష్మీదేవిని స్తోత్రముచేయు కలకలధ్వనియై సర్వోత్కృష్టముగా నున్నది. లక్ష్మీదేవి పాద సౌందర్యమును జూచుచున్నవి నూపురములే. కలకలధ్వనులతో లక్ష్మీదేవిని స్తోత్రము చేయుచున్నవి నూపురములే.

ఇక్కడఁ బాదాలంకారములైన నూపురములు కెంపు కన్నులతో లక్ష్మీదేవి పాదసౌందర్యమును జూచుచున్నవని, యా నూపురముల యవ్యక్తమధురధ్వని లక్ష్మీస్తోత్రవాక్య కలకలధ్వనిగా నున్నదని కవి యూహించుటచే నుత్ప్రేక్షాలంకారము.

## 14

**అవతారిక :** ఇప్పుడు **లక్ష్మి** కాలి పిక్కలను వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ మణిజ్యోత్స్నాజాలైర్నిజతనురుచామ్ మాంసలతయా**
**జటాలం తే జఙ్ఘాయుగలమఘభఙ్గాయ భవతు ।**
**భ్రమన్తీ యన్మధ్యే దరదళితశోణామ్బుజరుచాం**
**దృశామ్ మాలా నీరాజనమివ విధత్తే మురరిపోః ॥** ౧౪

**ప్రతిపదార్థము :** ఓ లక్ష్మీదేవీ!; మురరిపోః = మురాసురునకు శత్రువైన శ్రీవిష్ణుమూర్తి యొక్క; దర = కొంచెము; దళిత = విచ్చుకొన్న; శోణ + అంబుజ = ఎఱ్ఱని పద్మములయొక్క; రుచామ్ = కాంతులు గల; దృశామ్ = చూపులయొక్క; మాలా = దండ; యత్ + మధ్యే = ఏ జంఘలమధ్య; భ్రమంతీ = తిరుగుచు; నీరాజనమ్ = హారతిని; విధత్తే ఇవ = పట్టుచున్న దానివలె నున్నదో; అట్టి జంఘాయుగలమని యన్వయము. మణిజ్యోత్స్నాజాలైః = పాదములకుఁ దొడిగిన యందెలు, పట్టాలు, గొలుసులు మొదలగు నలంకారములలోఁ బొదిగిన రత్నములయొక్క వెన్నెలవంటి కాంతి సమూహముల చేత; నిజ = తమయొక్క; తను = దేహముయొక్క; రుచామ్ = కాంతులయొక్క; మాంసలతయా = దట్టముగాఁ బడుటచే; జటాలమ్ = బలిసిన; తే = నీయొక్క; జంఘాయుగలమ్ = పిక్కలజంట; అఘభంగాయ = పాపములు పోఁగొట్టుటకొఱకు; భవతు = అగుఁగాక!

**తాత్పర్యము :** లక్ష్మీదేవి పాదముల కందెలు, గొలుసులు, చుట్లు మొదలగు భూషణములు గలవు. అవి యన్నియు రత్నములు పొదిగినవి. ఆ మణులు వెన్నెలల వంటి కాంతులీనుచున్నవి. ఆ కాంతులలో లక్ష్మీదేవి దేహకాంతులు కూడ దట్టముగా నుండును. లక్ష్మీదేవి కాలి పిక్కలు మిక్కిలి యందమైన వగుటచే మహావిష్ణువు వానిని నిత్యము తిలకించుచుండును. అప్పుడెఱ్ఱని పద్మములవంటి కాంతులు గల విష్ణుమూర్తి చూపుల మాలిక యామె రెండు పిక్కలమధ్యఁ దిరుగుచు వానికి నీరాజనము పట్టినట్లుండును. అట్టి కాంతులతో నిండి, కండపట్టి బలిసిన లక్ష్మీదేవి జంఘాయుగ్మము నా పాపములను భంగము చేయుఁగాక!

**'బలవాన్ మాంసలోఽంసలః'** అని యమరము. **ప్రాణిస్థాదాతోలజన్యతరస్యామ్** (5-2-96) అను సూత్రముచే జటాశబ్దముపై 'లచ్' ప్రత్యయము వచ్చి 'జటాల' మని యగును. జటాల మనఁగా జడలు గట్టినదని యవయవార్థము. బలిసినదని లాక్షణికార్థము.

లక్ష్మీదేవి పిక్కల మధ్య భ్రమించు విష్ణుమూర్తి చూపులు నీరాజనము పట్టుచున్నట్లున్నవని కవి యూహించుటచే నుత్ప్రేక్షాలంకారము.

## 15

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి తొడలను వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ హరద్గర్వం సర్వం కరిపతికరాణామ్ మృదుతయా**
**భృశమ్ భాభిర్దమ్భం కనకమయరమ్భావనిరుహామ్ ।**
**లసజ్జానుజ్యోత్స్నాతరణిపరిణద్ధం జలధిజే!**
**తవోరుద్వన్ద్వం నః శ్లథయతు భవోరుజ్వరభయమ్ ॥** ౧౫

**ప్రతిపదార్థము :** జలధిజే! = సాగరకన్యవైన లక్ష్మీదేవీ! మృదుతయా = మెత్తనివగుటచే; కరిపతికరాణామ్ = గజేంద్రుల తొండములయొక్క; సర్వం గర్వమ్ = సమస్త దర్పమును; హరత్ = హరించునది; భృశమ్ = ఎక్కువగా; భాభిః = కాంతులచే; 'భాభాశ్చవిద్యుతి దీప్తయః' - అని యమరము. కనకమయ = బంగారముతో నిండిన; రంభా + అవని రుహామ్ = అరఁటిచెట్లయొక్క; దంభమ్ = డాంభికత్వమును; హరత్ = హరించునదియు; లసత్ = ప్రకాశించుచున్న; జాను = మోఁకాళ్ళయొక్క; జ్యోత్స్నా = వెన్నెలవంటి కాంతులనెడు; తరణి = సూర్యునిచే; పరిణద్ధమ్ = కట్టఁబడినదియగు;

తవ = నీయొక్క; ఊరుద్వంద్వమ్ = తొడల జంట; నః = మాయొక్క; భవ = సంసారమనెడు; ఉరు = ఎక్కువయైన; జ్వరభయమ్ = రోగభయమును; శ్లథయతు = శిథిలము చేయుఁగాక! పోఁగొట్టుఁ గాక!

**తాత్పర్యము :** కవులు స్త్రీల తొడలను నేనుఁగుల తొండములతోఁ గాని యరఁటి బోదెలతోఁ గాని పోల్చి వర్ణింతురు. ఏనుఁగు తొండములుగాని, బంగారపు టరఁటి చెట్లుగాని లక్ష్మీదేవి తొడలతోఁ బోలవని చెప్పుచున్నాఁడు. ఏనుఁగుల తొండములు కర్కశములైనవి. లక్ష్మీదేవి తొడలు మెత్తనివి. కాఁబట్టి మృదుత్వముచే గజపతుల తొండములయొక్క గర్వమును సర్వమును హరించునవి. అరఁటికాండములు కాంతి కలవిగావు. లక్ష్మీదేవి తొడలు కాంతులతో మెఱయునవి. కాఁబట్టి బంగారరఁటి చెట్ల గర్వమును గూడ సంపూర్ణముగా హరించునవి. లక్ష్మీదేవి మోఁకాళ్ళ కాంతి వెన్నెలవలె నున్నది. ఆ వెన్నెలయే సూర్యుఁడు. ఆ సూర్యునిచేఁ గట్టఁబడినవి యనఁగా నా కాంతులచే బంధింపఁబడినది లక్ష్మీదేవి యూరుద్వంద్వము. ఆ తొడల దోయి నా సంసారరోగభయమును శిథిలము చేసి పోఁగొట్టుఁగాక!

శ్లో॥ ఆరోగ్యమ్ భాస్కరాదిచ్ఛేచ్ఛ్రియమిచ్ఛేద్ధుతాశనాత్ ।
ఐశ్వర్యమీశ్వరాదిచ్ఛేన్మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్ ॥

ఆరోగ్యము సూర్యునుండి, సంపద నగ్నినుండి, యైశ్వర్యము నీశ్వరునుండి; మోక్షమును విష్ణువునుండి కోరవలయునను వచనము ననుసరించి లక్ష్మీదేవి జానుకాంతి యనెడు సూర్యునిచే వెలుఁగొందు నూరు ద్వంద్వము మా సంసార రోగమును బోఁగొట్టుఁగాక! యని వర్ణింపఁబడినది.

ఇక్కడ లక్ష్మీదేవి తొడలు కోమలములు. ఏనుఁగు తొండములట్టివి కావు. లక్ష్మీదేవి తొండలు కాంతిమంతములు. అరఁటిచెట్లట్టివి కావని యుపమానముల కంటె నుపమేయమున కాధిక్యమును వర్ణించుటచే వ్యతిరేకాలంకారము.

'ఉపమానాదుపమేయస్య గుణవిశేషవత్త్వేనోత్కర్షో వ్యతిరేకః।' ఉపమానము కంటె నుపమేయమునకు గుణవిశేషము కల్గి యుండుటవలన నుత్కర్షమును జెప్పినచో వ్యతిరేకాలంకారమని రసగంగాధరము.

కాళిదాసమహాకవి కుమారసంభవములో శ్రీ పార్వతీదేవి తొడల నిట్లే వర్ణించినాఁడు –

శ్లో॥ నాగేన్ద్రహస్తాస్త్వచి కర్కశత్వా-
దేకాన్తశైత్యాత్ కదళీవిశేషాః ।
లబ్ధ్వాపి లోకే పరిణాహిరూపం
జాతాస్తదూర్వోరుపమానబాహ్యాః ॥ (కుమా-1-36)

ఐరావతాది నాగేంద్రముల తొండముల చర్మము కర్కశ మగుటచేతను; అరఁటిచెట్లు నియతముగాఁ జల్లనివగుట చేతను శ్రీపార్వతీదేవి తొడలతోఁ బోల్చుటకు వెలియైనవని భావము.

## 16

**అవతారిక :** ఇప్పుడు జగజ్జనని నితంబబింబమును వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ కలక్వాణాం కాఞ్చీమ్ మణిగణజటాలామధివహన్**
**వసానః కౌసుమ్భం వసనమసనం కౌస్తుభరుచామ్ ।**
**మునివ్రాతైః ప్రాతః శుచివచనజాతైరతినుతం**
**నితమ్బస్తే బిమ్బం హసతి నవమమ్బామ్బరమణేః ॥** ౧౬

**ప్రతిపదార్థము :** అంబ! = అమ్మా! లక్ష్మీదేవీ!; కలక్వాణామ్ = (మువ్వలయొక్క) అవ్యక్తమధురధ్వనితో మ్రోఁగుచున్నది; మణిగణ = రత్నముల సమూహముచే; జటాలామ్ = దట్టమైనది (నిండినది) యగు; కాంచీమ్ = ఒడ్డాణమును; అధివహన్ = ధరించినది; కౌస్తుభరుచామ్ = కౌస్తుభమణికాంతులకు; అసనమ్ = వాసమైన; కౌసుంభమ్ = కుంకుమపువ్వు వన్నెగల; వసనమ్ = బట్టను; వసానః = ధరించినది యగు; తే = నీయొక్క; నితంబః = పిఱుఁదు లేక మొల; ప్రాతః = సూర్యోదయ కాలమునందు; మునివ్రాతైః = మహర్షుల సమూహముచే; శుచివచన జాతైః = పవిత్రమైన వాక్కుల సమూహములతో (వేదసూక్తములతో); అతినుతమ్ = ఎక్కువగా స్తుతింపఁబడిన; అంబరమణేః = ఆకాశమునకు రత్నమైన సూర్యునియొక్క; బింబమ్= మండలమును; హసతి = నవ్వుచున్నది.

**తాత్పర్యము :** అవ్యక్తమధురమైన మువ్వల సవ్వడి గలది, నవరత్నముల సమూహముచే నిండినదియగు నొడ్డాణమును ధరించినది, కౌస్తుభమణి కాంతులకు నిలయమైన కుంకుమపూవు రంగు గల యెఱ్ఱని వస్త్రమును ధరించినదియగు నీ జఘనభాగము -

ప్రాతఃకాలములో మునుల సమూహముచేఁ బవిత్రవాగ్జాలముచే నెక్కువగా స్తోత్రము చేయఁబడు సూర్యబింబమును నవ్వుచున్నది. గెల్చుచున్నదని భావము.

'మణిగణ' – 'వసన–అసన' – 'వ్రాతైః ప్రాతః' – 'శుచివచన' మొదలగు తావులలో హల్లులావృత్తమగుటచే ననుప్రాసము.

## 17

**అవతారిక :** ఇప్పుడు విశ్వజనని నడుమును వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ జగన్మిథ్యాభూతమ్ మమ నిగదతాం వేదవచసా–**
**మభిప్రాయో నాద్యావధి హృదయమధ్యావిశదియమ్ ।**
**ఇదానీం విశ్వేషాం జనకముదరం తే విమృశతో**
**విసన్దేహం చేతోఽజని గరుడకేతోః ప్రియతమే!** ౧౭

**ప్రతిపదార్థము :** గరుడకేతోః = గరుత్మంతుఁడు కేతనము (జెండా గుర్తు)గాఁ గల విష్ణుమూర్తికి; ప్రియతమే! = మిక్కిలి ప్రియురాలవైన లక్ష్మీదేవీ!; జగత్ = కన్పట్టునట్టి యీ జగత్తంతయు; మిథ్యాభూతమ్ = మృషయైనది యని (ఉన్నట్టుగాఁ గనఁబడుచున్నను లేనిది); 'మృషా మిథ్యా చ వితథే' – యని యమరము. నిగదతామ్ = చెప్పునట్టి; వేదవచసామ్ = వేదవాక్యముల యొక్క; అయమ్ = ఈ; అభిప్రాయః = అభిప్రాయము; మమ = నాకు; అద్య + అవధి = నేఁటి దాఁక; న + అధ్యావిశత్ = అవగతము కాలేదు; ఇదానీమ్ = ఇప్పుడు; విశ్వేషామ్ = సకల లోకములకు; జనకమ్ = జన్మస్థానమైన; తే = నీయొక్క; ఉదరమ్ = కడుపును; విమృశతః = విమర్శించెడి; మమ = నాయొక్క; చేతః = మనస్సు; విసందేహమ్ = సందేహము లేనిది; అజని = అయినది.

**తాత్పర్యము :** వేదవచనములనఁగా నుపనిషద్వాక్యములు. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' 'బ్రహ్మమొక్కటి మాత్రమే సత్యమైనది. ఈ కనఁబడు జగత్తంతయు మిథ్య – వాస్తవముగా లేనిది' యని బోధించునవి.

ఆఁడువారి నడుము మిక్కిలి సన్నముగా నున్నచో వారు సౌభాగ్యవతు లగుదురు. అందువల్లనే స్త్రీలకు నడుమున్నదా? లేదా? యని యతిశయోక్తితో వర్ణించుట కవి సమయము. సదసత్సంశయగోచరోదరీ (నైషధ 2–40) ఉన్నదా? లేదా? యను

సంశయము గలిగించు నుదరము గలది. 'అస్తి నాస్తి విచికిత్సాహేతుశాతోదరిన్ (శృ.నై. 2-21) ఉన్నదా? లేదా? యను సంశయమునకు హేతువైన సన్నని నడుము గలది. మహిత భావాభావమధ్యంబు మధ్యంబు (భాగ. 10-1-1715) భావపదార్థమునకు (ఉన్నదానికి) అభావ పదార్థమునకు (లేనిదానికి) నడుమనున్న నడుము - అని యీ రీతిగా వర్ణించుట కవుల పరిపాటి.

ఇప్పుడు జగన్నాథకవి లక్ష్మీదేవి యుదరమును వర్ణించుచు జగన్మిథ్యాత్వ వాదముతోఁ జమత్కరించు చున్నాఁడు. ఓ గరుడకేతనపత్నీ! లక్ష్మీదేవీ! జగత్తు మిథ్య యని చెప్పు వేదవాక్యముల యభిప్రాయము నాకింతవఱకు నర్థము కాలేదు. ఇప్పుడు సమస్త విశ్వముల పుట్టుకకుఁ గారణమైన నీ యుదరమును విమర్శింపఁగా నా మనస్సులో నున్న నా సందేహము తొలఁగినదని భావము.

జగత్తులు పుట్టుటకు లక్ష్మీదేవి యుదరము కారణము. సకల విశ్వములు కార్యములు. కారణగుణములు కార్యమునందు సంక్రమించును గావున నమ్మవారి యుదరము మిథ్యయగుటచే దాని నుండి పుట్టిన జగత్తుకూడా మిథ్యయే యని తాత్పర్యము.

ఇక్కడఁ జంద్రప్రభావ్యాఖ్యాతలగు శ్రీ భువనేశ్వరకరశర్మగారు - 'దృశ్యమానం జగత్ న మిథ్యా - ఖలు!' ఇతి జ్ఞానం సమజాయత - ఇత్యర్థః। ఈ కనఁబడు జగత్తు మిథ్యగాదను జ్ఞానము కలిగినదని చెప్పినారు. ఇది చింత్యము. విష్ణుమూర్తి పురుషుఁడు. లక్ష్మీదేవి ప్రకృతి. ప్రకృతియే మాయ. మాయ వలన జగము లేర్పడుటచే మాయాస్వరూపిణి యగు లక్ష్మీదేవియే జగజ్జనని యగుచున్నది. ఇక్కడఁ గనఁబడు జగత్తెట్లు మిథ్యయైనదో యట్టే విశ్వజన్మస్థానమైన లక్ష్మీదేవి యుదరము కూడ మిథ్యయే (ఉన్నను లేనట్టిదే) యని భావము. ఆలంకారికు **'లనుదరా కన్యా'** యని యుదాహరింతురు. లక్ష్మీదేవి తలోదరి - సన్నని పలుచని పొట్టగలదని కవియొక్క పరమతాత్పర్యము.

జగన్నాథకవి జగన్మిథ్యాత్వవాదియే కాని జగత్సత్యత్వవాది కాఁడు. శ్రీ శంకరభగవత్పాదులు బ్రహ్మసూత్రభాష్యములో (1) నిత్యానిత్యవస్తువివేకము (2) ఇహాముత్రఫలభోగవిరాగము (3) శమదమాదిసాధనసంపత్తి (4) ముముక్ష- ఇవి బ్రహ్మ జిజ్ఞాసువునకుఁ దప్పకుండ నుండవలసిన **సాధనచతుష్టయ**మని

నిర్దేశించినారు. జగన్నాథుఁడు కూడ రసగంగాధరములో – 'నిత్యానిత్య విచార జన్మా విషయవిరాగాఖ్యో నిర్వేదః' శాంతమునకు స్థాయిభావము నిర్వేదము. బ్రహ్మము నిత్యము. తక్కినదనిత్యము – అను నిత్యానిత్యవస్తువిచారమువలనఁ గలిగిన విషయ విరాగము నిర్వేదమని లక్షణము చెప్పినాఁడు. కాఁబట్టి జగన్నాథునకు శ్రీశంకర భగవత్పాదప్రతిష్ఠితమైన యద్వైతమునందే తాత్పర్యము.

బాలక్రీడావ్యాఖ్యాతలగు శ్రీ మధుసూదనశాస్త్రిగారు శ్లోకములోని 'విశ్వేషామ్' అను పాఠము సాధువు కాదు. 'విశ్వానామ్' అను పాఠము సరియైనదని సూచించినారు. విశ్వశబ్దము సమస్తవాచకమై సర్వనామమైనప్పుడు 'విశ్వేషామ్' అని యుండును. లోకవాచకమైనప్పుడు సర్వనామము కాదు కావున సంజ్ఞావాచకమై 'విశ్వానామ్' అని యుండవలెనని శాస్త్రిగారి తాత్పర్యము. జగన్నాథుఁడు సమస్తవిశ్వములను సూచించు సర్వనామముగా 'విశ్వేషామ్' అని వాడియుండును.

## 18

**అవతారిక :** ఇప్పుడు మఱల లక్ష్మీదేవి నడుమునే ప్రకారాంతముగా వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ అనల్పైర్వాదీన్ద్రైరగణితమహాయుక్తినివహై-**
**ర్నిరస్తా విస్తారం క్వచిదకలయన్తీ తనుమపి ।**
**అసత్ఖ్యాతివ్యాఖ్యాధికచతురిమాఖ్యాతమహిమా-**
**వలగ్నే లగ్నేయం సుగతమతసిద్ధాన్తసరణిః ॥** ౧౮

**ప్రతిపదార్థము :** న + అల్పైః = అల్పులుకాని యనఁగా గొప్పవారైన; వాది + ఇన్ద్రైః = తర్కవాదము చేయు కథక పండిత శ్రేష్ఠులచే; అగణిత = లెక్కింపలేని; మహాయుక్తి నివహైః = గొప్ప యుక్తుల సమూహములచే; నిరస్తా = నిరసింపఁబడినది; క్వచిత్ = ఒక్కచోటఁ గూడ; తనుమ్ + అపి = కొంచెము కూడ; విస్తారమ్ = విస్తృతిని; అకలయంతీ = పొందులేనిది; అసత్ఖ్యాతి = అసత్ ఖ్యాతి యను పేరుగల శూన్యవాద సిద్ధాంతమును; వ్యాఖ్యా = వివరించుటలో; అధిక = ఎక్కువ; చతురిమ = చాతుర్యముచే; ఆఖ్యాతమహిమా = ప్రసిద్ధమైన మహిమగల; ఇయమ్ = ఈ; సుగతమత = బౌద్ధమతముయొక్క; సిద్ధాంతసరణిః = సిద్ధాంత పద్ధతి; వలగ్నే = నీయొక్క నడుము నందు; 'మధ్యమం చావలగ్నం చ మధ్యోఽస్త్రీ' – అని యమరము. లగ్నా = ఆశ్రయము

పొంది యున్నది. శూన్యవాదము నీ నడుము నాశ్రయించిన దనఁగా నీ నడుము శూన్యము (లేనిది) అని భావము.

**తాత్పర్యము :** 'అసత్ ఖ్యాతి' యని పేరు పొందినది బౌద్ధుల శూన్యవాదము. ఈ శూన్యవాదమును దక్కిన శాస్త్రకారులందఱు ఖండించినారు. లెక్కించుటకు వీలు లేనన్ని గొప్ప గొప్ప యుక్తులతో వాదించు న్యాయ - మీమాంసా - వేదాంతాది శాస్త్ర పండితవర్యులచే నిరసింపఁబడిన శూన్యవాదసిద్ధాంతపద్ధతి కెక్కడ నిలఁద్రొక్కు కొనుటకుఁ జోటు లభింపలేదు. ఎక్కడఁ జోటులేక నీ నడుమును గట్టిగాఁ బట్టుకొని స్థిరపడినది. బౌద్ధుల సిద్ధాంతము శూన్యమే. అది యాశ్రయించిన నీ నడుముకూడ శూన్యమే యని భావము.

వాదము చేయువాఁడు వాది. వాదులలో శ్రేష్ఠుఁడు వాదీంద్రుఁడు. ప్రమాణ-తర్కసాధనోపాలంభః, సిద్ధాంతావిరుద్ధఃపంచావయవోపపన్నః పక్షప్రతిపక్షపరిగ్రహోవాదః (న్యా.ద. 1-2-1) ప్రమాణములను దర్కమును సాధనములుగాఁ గౌకొనునది, సిద్ధాంతమునకు విరుద్ధము కానిది. (1) ప్రతిజ్ఞ (2) హేతువు (3) ఉదాహరణము (4) ఉపనయము (5) నిగమనము నను పంచావయవములతోఁ గూడినది, పక్ష - ప్రతిపక్షములను సమానముగా గ్రహించునది వాదము. నిగ్గుతేల్చి శాస్త్రముచే నిర్ణయింపఁబడిన విషయము సిద్ధాంతము.

**అవలగ్నము - వలగ్నము :** అవలగ్నమనఁగా నడుము. అవలగ్నమే వలగ్నము. **వష్టిభాగురిరల్లోపమవాప్యోః** - అను వచనముచే భాగురి మహర్షి మతములో 'అవ+లగ్న' శబ్దము నందలి 'అవ'లోని అకారము లోపింపఁగా వలగ్నమైనది. 'అవలగ్నే' యని కూడఁ జెప్పవచ్చును.

**విశేషవివరణము :** సుగతుఁడనఁగా బుద్ధుఁడు. 'సర్వజ్ఞః సుగతో బుద్ధః' - యని యమరము. సుగతమత మనఁగా బౌద్ధమతము. బుద్ధుని శిష్యులు (1) సర్వము క్షణికము (2) సర్వము దుఃఖము (3) సర్వము స్వలక్షణము (4) సర్వము శూన్యము - అను నాలుగు భావనలు గైకొని నాలుగు శాఖలుగా విడిపోయిరి. సర్వము శూన్యము. శూన్యముయొక్క వివర్తము జగత్తని చెప్పువారు మాధ్యమికులు.

శ్లో॥ 'ముఖ్యో మాధ్యమికో వివర్తమఖిలం శూన్యస్య మేనే జగత్'

మాధ్యమిక మతస్థాపకులు నాగార్జునాచార్యులు. వీరు రచించిన మాధ్యమిక కారికలు, శూన్యతాసప్తతి మొదలగు గ్రంథములు ప్రసిద్ధములు.

శ్లో॥ ఆత్మా కశ్చిన్న చానాత్మా హ్యాత్మా నాత్మేతరశ్చ న ।
వాచ్యః సర్వస్వభావేన శూన్యో నిర్వాణసదృశః ॥

ఆత్మయన్నను, అనాత్మయన్నను, రెండును గాక మఱొకటి యన్నను నివి యేవియు యథార్థముగా లేనివే. అంతయు స్వభావముచే శూన్యమే. అదియే నిర్వాణము. - ఇది శూన్యతాసప్తతి ప్రారంభము.

శ్లో॥ కథం వా సర్వభావానాం శూన్యత్వాచ్ఛాశ్వతాదయః ।
క్వ? కస్య? కతమాః? కస్మాత్? సంభవిష్యంతి దృష్టయః ॥

సర్వభావములు శూన్యములే. ఏవియు శాశ్వతములు గావు. సకలభావములు ప్రతీత్యసముత్పన్నమ్ములగుటచే శాస్త్రమంతయు శూన్యత్వమునే ప్రతిపాదించుచున్నది- ఇది మాధ్యమిక శాస్త్రము ముగింపు.

**ఖ్యాతివాదము :**

శ్లో॥ ఆత్మఖ్యాతిరసత్ ఖ్యాతిరఖ్యాతిః ఖ్యాతిరేవ చ ।
తథానిర్వచనఖ్యాతిరిత్యేతత్ ఖ్యాతిపంచకమ్ ॥

యోగాచారా మాధ్యమికాస్తథా మీమాంసకా అపి ।
నైయాయికాద్వైతినౌ చ ప్రాహుః ఖ్యాతీర్యథాక్రమమ్ ॥

ఖ్యాతి యనఁగా భ్రమము. భ్రాంతి (ప్రతీతి)

(1) యోగాచారులు - ఆత్మఖ్యాతిని (2) మాధ్యమికులు - అసత్ ఖ్యాతిని (3) మీమాంసకులు - అఖ్యాతిని (4) నైయాయికులు (తార్కికులు) - అన్యథాఖ్యాతిని (5) అద్వైతవేదాంతులు - అనిర్వచనీయఖ్యాతినిఁ బ్రతిపాదించిరి. అసత్ఖ్యాతి యనఁగా శూన్యవాదమని యర్థము.

మండనమిశ్రుని 'విభ్రమవివేకము', శంకరచైతన్యభారతి 'ఖ్యాతివాదము'; వెప్పత్తూరు సుబ్రహ్మణ్యశాస్త్రి 'ఖ్యాతితత్త్వసమీక్ష' మొదలగునవి ఖ్యాతిగ్రంథములు.

బౌద్ధులలో మాధ్యమికులైన నాగార్జునాచార్యాదులు ప్రతిపాదించిన యసత్ ఖ్యాతి (శూన్యవాదము)నిఁ దక్కిన తర్క - మీమాంసా - వేదాంతాది శాస్త్రకారులు నిరసించుటచే లక్ష్మీదేవి నడుమునందు లగ్నమైనది. లక్ష్మీదేవి నడము శూన్యవాదమున కాశ్రయమునిచ్చినదని భావము.

ఇక్కడ నొక్క విషయము నాలోచింప వలయును. పూర్వశ్లోకములో నద్వైత వేదాంతము ననుసరించి జగన్మిథ్యాత్వము ప్రతిపాదింపఁబడినది. ఈ శ్లోకములో బౌద్ధమతము ననుసరించి యసత్ఖ్యాతి (శూన్య) వాదము చెప్పఁబడినది. జగన్నాథుఁడద్వైతియా? బౌద్ధుఁడా యన్నచో వినుఁడు.

జగన్నాథ మహాకవి గొప్ప భగవద్భక్తుఁడైన యాస్తికుఁడు. సకలదేవతా–సమైక్యవాదము నాదరించిన శ్రీశంకరాద్వైతమతస్థుఁడు. అయినను మహాకవులందఱు సార్వపథీనులు. చమత్కారపోషణమునకై సకలశాస్త్రమార్గములందును బయనింతురు. దీనినే కవిసామ్రాజ్యవ్యంజనమని క్షేమేంద్రుఁడు కవికంఠాభరణములో నిరూపించాఁడు. ఇందేవిధమగు దోషము లేదు.

## 19

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి పొక్కిలిని వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ నిదానం శృఙ్గారప్రకరమకరన్దస్య కమలే!**
**మహానేవాలమ్బో హరినయనరోలమ్బవరయోః ।**
**నిధానం శోభానాం నిధనమనుతాపస్య జగతో**
**జవేనాభీతిమ్ మే దిశతు తవ నాభీసరసిజమ్ ॥** ౧౯

**ప్రతిపదార్థము :** కమలే! = లక్ష్మీదేవీ! 'కమలా శ్రీర్హరిప్రియా' – అని యమరము. శృంగార = విష్ణుమూర్తి శృంగారప్రక్రియలయొక్క; ప్రకర = సమూహమనెడు; మకరందస్య = తేనెకు; 'మకరందః పుష్పరసః' – అని యమరము. నిదానమ్ = ఆదికారణమైనది; 'నిదానం త్వాదికారణమ్' – అని యమరము. హరి = విష్ణుమూర్తి యొక్క; నయన = కన్నులనెడు; రోలంబవరయోః = శ్రేష్ఠమైన తుమ్మెదలకు; 'ఇందిందిరశ్చంచరీకో రోలంబో బంభరశ్చ సః' – అని యమరము. ఏవ = నిశ్చయముగా; మహాన్ + ఆలంబః = గొప్ప యూఁతయైనది; శోభానామ్ = కాంతులకు; 'శోభా కాంతిర్ద్యుతిశ్ఛవిః' అని యమరము. నిధానమ్ = నిధియైనది; 'నిధానం గూఢకోశో నా నిధిశ్శేవధిరస్త్రియామ్' – అని వైజయంతీ కోశము; జగతః = లోకముయొక్క; అనుతాపస్య = పరితాపదుఃఖమునకు; నిధనమ్ = నాశనస్థానమైనదియునగు; 'నిధనం కులనాశయోః' – అని యమరము. తవ = నీయొక్క; నాభీసరసిజమ్ = బొడ్డనెడు పద్మము; జవేన = వేగముగా; మే = నాకు; అభీతిమ్ = అభయమును; దిశతు = చేకూర్చుఁగాక!

**తాత్పర్యము :** ఓ కమలాదేవీ! శ్రీవిష్ణుమూర్తి శృంగారకేళీ నికరమను పుష్పరసమునకు మూలకారణమైనది, విష్ణుమూర్తి కన్నులనెడు తుమ్మెద కొదమలకు గొప్ప యాలంబమైనది, సకల శోభలకు నిధియైనది, లోకమునందలి దుఃఖములకుఁ బశ్చాత్తాపములకు వినాశస్థానమైనది యగు నీ బొడ్డను పద్మము నాకభయము నిచ్చుఁగాక!

లక్ష్మీదేవి నాభి పద్మమువలె విశాలమైనది. లోఁతైనది. పద్మమునందుఁ దేనె యుండును. నాభీసరసిజమునందు విష్ణుమూర్తి శృంగార మకరంద ముండును. పద్మముపైఁ దుమ్మెదలు వ్రాలును. నాభీసరసిజముపై విష్ణుమూర్తి వీక్షణ రోలంబములు వ్రాలును. పద్మమువలెనే లక్ష్మీదేవి నాభికూడ శోభలకు మూలనిధి యైనది. పద్మ మాహ్లాదమును గూర్చి తాపములను జల్లార్చును. లక్ష్మీదేవి నాభి భక్తుల వగపులను బోఁగొట్టును. అట్టి లక్ష్మీదేవి నాభీపద్మము వేగముగా నాకభయము నొసఁగుఁ గాక!

ఇక్కడ శృంగారమునందు మకరందత్వము, హరినయనముల యందు రోలంబత్వము, నాభియందు సరసిజత్వము నారోపించుటచే రూపకాలంకారము.

## 20

**అవతారిక :** ఇప్పుడు మఱల నాభినే భంగ్యంతరముగా వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ గభీరాముద్వేలామ్ ప్రథమరసకల్లోలమిలితాం**
**విగాఢుం తే నాభీవిమలసరసీం గౌర్మమ మనాక్ ।**
**పదం యావన్న్యస్యత్యహహా! వినిమగ్నైవ సహసా**
**న హి క్షేమం సూతే గురుమహిమభూతేష్వవినయః ॥** ౨౦

**ప్రతిపదార్థము :** ఓ లక్ష్మీదేవీ!; గభీరామ్ = లోఁతైనది; ఉత్ + వేలామ్ = ఒడ్డు నొరసి ప్రవహించునది; ప్రథమరస = నవరసములలో మొదటిదైన శృంగారరసము యొక్క; కల్లోల = కెరటములతో; మిలితామ్ = కలిసినదియగు; తే = నీయొక్క; నాభీ = బొడ్డనెడు; విమలసరసీమ్ = నిర్మలమైన సరస్సును; అనఁగా సరస్సునందు; విగాఢుమ్ = క్రుంకుటకు (దిగుటకు); మమ = నాయొక్క; గౌః = వాక్కు (ఆవు); 'స్వర్గేషు పశువాగ్వజ్ర దిఙ్నేత్రఘృణిభూజలే లక్ష్యదృష్ట్యా స్త్రియామ్ పుంసి గౌః' – అని యమరము. మనాక్ = కొంచెముగా; పదం న్యస్యతి = అడుగును (మాటను) వేయుచున్నదో; సహసా = అంతలో వెంటనే; అహహా! = అయ్యో!; 'అహహేత్యద్భుతే ఖేదే' – అని

యమరము. వినిమగ్నా + ఏవ = మునిఁగి పోయినది; గురుమహిమభూతేషు = ఎక్కువ మహిమ గలవారి యందు; అవినయః = వినయము లేకపోవుట; క్షేమమ్ = కుశలమును; 'భావుకమ్ భవికమ్ భవ్యం కుశలం క్షేమమస్త్రియామ్' – అని యమరము; న హి సూతే = పుట్టింపదు గదా!

**తాత్పర్యము :** ఓ లక్ష్మీదేవీ! ఎక్కువ లోఁతుగా నున్నది, తీరమును రాసికొనుచుఁ బ్రవహించునది, శృంగారరసతరంగములతో మిళితమైనది యగు నీ పొక్కిలి యను కాసారమునందు దిగుటకు నా వాక్కు కొంచెము కూడ నడుగుపెట్టినదో లేదో యంతలోనే దానియందే వెంటనే యక్కటా! మునిఁగి పోయినది. అది యుక్తమే. మిక్కిలి గొప్పవారి యెడల వినయవిధేయతలు లేనిచో క్షేమము పుట్టదు గదా!

ఇక్కడ వాక్కనెడు గోవని, మాటయనెడు నడుగని గోపద శబ్దములు రెండర్థములు గల్గియుండుటచే శ్లిష్టరూపకము. నాభియే సరసి యనుచోట శుద్ధ రూపకము. నీ నాభి నవగాహనము చేసి వర్ణించుటకు సాహసము చేసితిని. ఇది నా యవినయమే యను సామాన్యవిషయమును, గొప్ప మాహాత్మ్యము గలవారి యెడల వినయవిధేయతలు లేకున్నచో క్షేమము గల్గదు గదా! యని విశేషవిషయముతో సమర్థించుటచే **నర్థాంతరన్యాసాలంకారము.**

'సామాన్యేన విశేషస్య; విశేషేణ సామాన్యస్య వా యత్ సమర్థనం తదర్థాంతరన్యాసః' సామాన్యముచే విశేషమును గాని, విశేషముచే సామాన్యముగాని చమత్కారముగా సమర్థించుట యేది కలదో యది యర్థాంతరన్యాసమని రసగంగాధరము.

## 21

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి కుచములను వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ కుచౌ తే దుగ్ధామ్భోనిధికులశిఖామణ్డనమణే!**
**హరేతే సౌభాగ్యం యది సురగిరేశ్చిత్రమిహ కిమ్? ।**
**త్రిలోకీలావణ్యాహరణనవలీలానిపుణయో–**
**ర్యయోర్దత్తే భూయః కరమఖిలనాథో మధురిపుః ॥** ౨౧

**ప్రతిపదార్థము :** దుగ్ధ + అంభః + నిధి = పాలసంద్రముయొక్క; కుల = వంశము

యొక్క; శిఖా = సిగకు; మండన = ఆభరణమైన; మణే = రత్నమైనదానా! క్షీరసాగరవంశశిరోభూషణరత్నమా! లక్ష్మీదేవీ!; తే = నీయొక్క; కుచౌ = గుబ్బలు; సురగిరేః = బంగారముతో నిండిన మేరుపర్వతముయొక్క; సౌభాగ్యమ్ = సుభగత్వమును (మనోహరత్వమును); హరేతే యది = దొంగిలించుచున్నవన్నచో; ఇహ = ఈ విషయములో; చిత్రమ్ = ఆశ్చర్యము; కిమ్ = ఏమి కలదు?; త్రిలోకీ = మూఁడు లోకములందున్న; లావణ్య = అందమును; ఆహరణ = దొంగిలించుట (సమీకరించుట) యను; నవలీలా = క్రొత లీలలను జూపుటలో; నిపుణయోః = చతురములైన; యయోః = ఏ చన్నులయందు; అఖిలనాథః = సమస్తమునకు నధినాథుఁడైన; మధురిపుః = మధువను రాక్షసునకు శత్రువైన విష్ణుమూర్తి; భూయః = మాటిమాటికి; కరమ్ = చేతిని; దత్తే = ఉంచుచున్నాఁడో; కరమ్ = పన్నును; దత్తే = ఇచ్చుచున్నాఁడో యని రెండవ యర్థము.

**తాత్పర్యము :** ఓ పయఃపయోనిధివంశచూడాలంకారమణీ! లక్ష్మీదేవీ! నీ గబ్బిగుబ్బలు బంగారుపర్వతముయొక్క సౌభాగ్యమును హరించుచున్న వన్నచో నిందాశ్చర్యమేమి కలదు. ఇవి ముల్లోకముల యందలి సౌందర్యమును దొంగిలించి సమీకరించుటలో మిక్కిలి నేర్పు గలవి. అందువల్లనే సకలలోకములకు నాథుఁడైన శ్రీమహావిష్ణువు వానిపైఁ జేతులు వేయుచున్నాఁడు. వానికి సుంకము చెల్లించుచున్నాఁడు. దేవతలకు నిలయమైనది మేరుపర్వతము (సురగిరి). ఇది బంగారముతో నిండినది. ఆ మేరుపర్వత సౌభాగ్యమును ముచ్చిలించినవి లక్ష్మీదేవి కుచములు. బంగారు పర్వతములను మించి యున్నవని భావము. అవి మూఁడు లోకములందలి లావణ్యము నపహరించుట యను క్రీడలో సమర్థములైనవి. అనఁగా ముజ్జగములందలి శోభను నొకేచోట సమీకరించుకొన్నవి.

శ్లో॥ ముక్తాఫలేషు చ్ఛాయాయాస్తరలత్వమివాన్తరా ।
ప్రతిభాతి యదఙ్గేషు తల్లావణ్యమితీరితమ్ ॥

స్త్రీల యంగములందు మంచిముత్యముల యందలి ప్రకాశమువలె నుండు నైగనిగ్యమునకు (నిగనిగలాడుటకు) లావణ్యమని పేరు. అట్టి లావణ్యమును బుఁణికిపుచ్చుకొన్నవి లక్ష్మీదేవి స్తనములు. అందువల్లనే సకలలోకనాథుఁడగు శ్రీమహావిష్ణువు వానికిఁ జేతులిచ్చుచున్నాఁడని యొక యర్థము. వానికి శుల్కము కట్టుచున్నాఁడని రెండవ యర్థము. కరము = చేయి, పన్ను. 'బలిహస్తాంశవః కరాః'

– అని యమరము. ఇక్కడఁ గరశబ్దమునకు రెండర్థములుండుటచే శ్లేషాలంకారము. లక్ష్మీస్తనములకు విష్ణువు పన్ను కట్టుచున్నాఁడను ప్రస్తుతవిషయముచే సార్వభౌమునకు సామంతరాజు కప్పము కట్టుచున్నాఁడను విషయము స్ఫురించుటచే సమాసోక్తి యలంకారము.

శ్లో॥ సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్ ।
అయ మైంద్రీముఖమ్ పశ్య రక్తశ్చుంబతి చంద్రమాః ॥ (5–62)

అని చంద్రాలోకలక్షణము.

**22**

**అవతారిక :** మరల లక్ష్మీదేవి వక్షోజములనే ప్రకారాంతరముగా వర్ణించుచున్నాఁడు–

**శ్లో॥ హరక్రోధత్రస్యన్మదననవదుర్గద్వయతులాం**
**దధత్ కోకద్వన్ద్వద్యుతిదమనదీక్షాధిగురుతామ్ ।**
**తవైతద్వక్షోజద్వితయమరవిన్దాక్షమహిళే!**
**మమ స్వాన్తధ్వాన్తం కిమపి చ నితాన్తం గమయతు ॥ ౨౨**

**ప్రతిపదార్థము :** అరవింద + అక్ష = పద్మముల వంటి కన్నులు గల శ్రీమహావిష్ణువునకు; మహిళే! = గేస్తురాలవైన యో లక్ష్మీదేవీ!; హర = శివునియొక్క; క్రోధ = కోపమునకు; త్రస్యత్ = భయపడుచున్న; మదన = మన్మథునకు; నవదుర్గద్వయతులామ్ = నివసించుటకుఁ గ్రొత్తగా నిర్మించుకొన్న దుర్గముల జంటయొక్క సౌమ్యమును; దధత్ = ధరించునదియు; కోకద్వంద్వ = చక్రవాకమిథునముయొక్క; ద్యుతి = కాంతిని; దమన = అణఁచివేయుట యను; దీక్షామ్ = దీక్షనిచ్చుటలో; అధిగురుతామ్ = ఆచార్యకత్వమును; దధత్ = వహించునదియునగు; తవ = నీయొక్క; ఏతత్ = ఈ; వక్షోజద్వితయమ్ = చన్నుదోయి; మమ = నాయొక్క; కిమ్ + అపి + చ = చెప్పలేని; స్వాంత = మనస్సులోని; ధ్వాంతమ్ = చీఁకటిని; నితాంతమ్ = పూర్తిగా; గమయతు = వెళ్ళఁగొట్టుఁ గాక!

**తాత్పర్యము :** ఓ విష్ణుపత్నీ! శివుని కోపమునకు భయపడి తాను దాఁగి యుండుటకై మన్మథుఁడు క్రొత్తగాఁ గట్టుకొన్న రెండు దుర్గములతోఁ బోలిక గలది, చక్రవాక మిథునముయొక్క శోభ నణఁగఁద్రొక్కుట యను దీక్షకాచార్యకత్వము వహించునది,

(గురుత్వము = ఆచార్యకత్వము, బరువు. చక్రవాకమిథునముకంటె బరువైనది) యగు నీ పాలిండ్ల జంట నా మనస్సులో నెక్కువగా నున్న యజ్ఞాన మనెడు నంధకారమును దూరముగా వెళ్ళఁగొట్టుఁ గాక!

ఈ శ్లోకము నందలి తులా - గురుతా శబ్దము లుపమా వాచకములు. లక్ష్మీదేవి యురోజములు మన్మథ దుర్గములవలె, జక్కవ జంటలవలె నున్నవని భావము. కాఁబట్టి యుపమాలంకారము. గురుతామ్ - అనుచోట నుపాధ్యాయత్వమును, బరువును జెప్పుటచే శ్లేషాలంకారము.

లక్ష్మీదేవి సకలలోకములకు మాతృదేవత. భక్తులందఱు నామెకు శిశువులు. ఆ శిశువులందఱు నామె యందలి భక్తి యనెడు పాలుత్రావి జ్ఞానులై మోక్షము నొందవలెనని కవి యాకాంక్ష.

## 23

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి హృదయములోఁ దనకవకాశ మిమ్మని కోరుచున్నాఁడు-

**శ్లో॥ అనేకబ్రహ్మాణ్డస్థితినియమలీలావిలసితే**
**దయాపీయూషామ్భోనిధిసహజసంవాసభవనే! ।**
**విధోశ్చిత్తాయామే హృదయకమలే తే తు కమలే!**
**మనాఙ్ మన్నిస్తారస్మృతిరపి చ కోణే నివసతు ॥** ౨౩

**ప్రతిపదార్థము :** కమలే! = ఓ లక్ష్మీదేవీ!; అనేక = లెక్కలేనన్ని; బ్రహ్మాండ = విశ్వగోళములయొక్క; స్థితి = ఉనికిని; నియమలీలా = నియమించుట యను లీలతో; విలసితే = ప్రకాశించినదాని యందు; ఇది సప్తమ్యంతము. హృదయకమలమునకు విశేషణము. దయా = కరుణ యనెడు; పీయూష = అమృతముతో నిండిన; అంభః+ నిధి = సముద్రమునందు; సహజ = పుట్టుకతో వచ్చిన; సంవాసభవనే = నివాస మందిరమునందు; ఇది కూడ సప్తమ్యంతము. హృదయకమలమునకు విశేషణము. 'నిశాంతవస్త్యసదనమ్ భవనాగారమందిరమ్' - అని యమరము. విధోః = విష్ణుమూర్తియొక్క; 'విశ్వంభరః కైటభజిద్విధుః శ్రీవత్సలాంఛనః' - అని యమరము. చిత్త = మనస్సువలె; 'చిత్తంతు చేతో హృదయం స్వాంతం హృన్మానసమ్ మనః' - అని యమరము. ఆయామే = విశాలమైన; 'చిత్తాగారే' - అని మధుసూదనశాస్త్రి - భువనేశ్వరకరశర్మల పాఠము. అప్పుడు 'చిత్త + అగారే = మనోమందిరమునందు'

– అని యర్థము చెప్పుకొనవలయును. 'భవనాగారమందిరమ్' – అని యమరము. తే తు = నిశ్చయముగా నీయొక్క; హృదయకమలే = మానసపద్మమునందు; అపి చ కోణే = ఏదోయొక మూలయందైనను; మత్ = నన్ను; నిస్తార = దుఃఖసముద్రమునుండి దాఁటించి రక్షింపవలెననెడి; స్మృతిః + అపి = స్మరణము కూడ; మనాక్ = కొంచెమైనను; నివసతు = నివసించుఁగాక!

**తాత్పర్యము :** ఓ లక్ష్మీదేవీ! అసంఖ్యాకములైన బ్రహ్మాండములకు రక్షణ కల్పించి పాలించుట యను విలాసముచేఁ బ్రకాశించునది, కృపామృతసముద్రమునకు సహజముగా నివాసస్థానమైనది, విష్ణుమూర్తియొక్క మనస్సెంత విశాలమైనదో యంత వైశాల్యము గలది యగు నీ హృదయపద్మములో నేదో యొక మూల నన్ను రక్షింపవలెననెడు స్మరణము కొంచెమైన నుండుఁ గాక! ఈ జగన్నాథ కవి నేదో విధముగాఁ గష్టములనుండి దాఁటింపవలె ననెడు స్మృతి కూడ నీ హృదయజలజములో నేదో యొక కోణమునందుఁ గొంచెముగానైన నుండుఁ గాక!

కమలే – కమలే యని యర్థభేదముతో రెండు మాఱులు వచ్చుటచే యమకము. ఇక్కడ హృదయకమలమాధారము. అనేక బ్రహ్మాండస్థితి, దయాపీయూషాంభోనిధి యాధేయములు. లక్ష్మీదేవి హృదయకమలము (ఆధారము)లో ననేక బ్రహ్మాండములు, పీయూషాంభోనిధి (ఆధేయములు) ఉన్నవని యాధారము కంటె నాధేయముల కాధిక్యమును జెప్పుటచే నధికాలంకారము.

శ్లో॥ అధికమ్ బోధ్యమాధారాదాధేయాధిక్యవర్ణనమ్ ।
యయా వ్యాప్తం జగత్తస్యాం వాచి మాంతి న తే గుణాః ॥ (5–83)

ఆధారము కంటె నాధేయ మధికమైనదని వర్ణించినచో నధికాలంకారము. ఏ వాక్కుచే నీ జగత్తంతయు వ్యాపించి యున్నదో యా వాక్కునందు నీ గుణము లిముడుటలేదు – అని చంద్రాలోకలక్షణోదాహరణములు.

## 24

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి బాహువులను వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ మృణాలీనాం లీలాః సహజలవణిమ్నా లఘయతాం**
**చతుర్ణాం సౌభాగ్యం తవ జనని! దోష్ణాం వదతు కః? ।**
**లుఠన్తి స్వచ్ఛన్దమ్ మరకతశిలామాంసలరుచః**
**శ్రుతీనాం స్పర్ధాం యే దధత ఇవ కణ్ఠే మధురిపోః ॥** ౨౪

**ప్రతిపదార్థము :** జనని! = తల్లీ! లక్ష్మీదేవీ!; మృణాలీనామ్ = తామర తూండ్లయొక్క; లీలాః = విలాసములను; సహజలవణిమ్నా = పుట్టుకతోడనే వచ్చిన లావణ్యముచే; లఘయతామ్ = తక్కువ చేయునవి యగు; తవ = నీయొక్క; చతుర్ణాం దోష్ణామ్ = నాలుగు భుజములయొక్క; సౌభాగ్యమ్ = సుభగత్వమును (శ్రేష్ఠత్వమును); కః = ఎవ్వఁడు?; వదతు = చెప్పఁగలఁడు; అమ్మవారి చేతులు తామరతూండ్లకంటెను మెత్తనివి, కాంతిమంతములు నగుటచే వాని సౌభాగ్యము నెవ్వఁడు వర్ణింపఁ జాలఁడు. ఆ చేతులెట్టివో చెప్పుచున్నాఁడు. యే = ఏ చేతులు; మరకతశిలా = గరుడపచ్చ ఱాలయొక్క; మాంసల = దట్టమైన; రుచః = కాంతిగల; మధురిపోః = విష్ణుమూర్తియొక్క; కంఠే = గళమునందు; శ్రుతీనామ్ = నాల్గు వేదములయొక్క; స్పర్ధామ్ = పోటీని; దధత ఇవ = వహించువాని వలె; లుఠంతి = చుట్టుకొను చున్నవో; (తే = అట్టివని శేషము). యచ్ఛబ్దముచేఁ దచ్ఛబ్దమును గ్రహింపవలెను.

**తాత్పర్యము :** తామరపూవు కాఁడల విలాసములను నిసర్గలావణ్యముచే లఘూకరించు లక్ష్మీదేవి నాలుగు చేతుల సౌభాగ్యము నే మహాకవి వర్ణింపఁగలఁడు? ఆ నాలుగు చేతులు మరకతమణికాంతులతో నొప్పుచున్న విష్ణుమూర్తి కంఠమును స్వేచ్ఛగాఁ గౌఁగిలించుకొనుటకై చుట్టుకొనుచున్నవి. విష్ణుమూర్తి కంఠములో నాలుగు వేదములు నున్నవి. ఆ నాలుగు వేదములతోఁ బోటి పడుచున్నట్లుగా లక్ష్మి నాలుగు చేతులు విష్ణుకంఠమును జుట్టుకొని పొరలుచున్నవని భావము.

విష్ణుమూర్తి యింద్రనీలశ్యాముఁడు. ఇంద్రనీలకాంతులవలెనే మరకత కాంతులు కూడ శ్యామలములని వర్ణించుట కవిసమయము.

ఇక్కడ విష్ణుమూర్తి కంఠమును గౌఁగిలించుకొనుచున్న లక్ష్మీదేవి నాల్గు భుజములు వాని కంఠములో నున్న నాల్గువేదములతో స్పర్ధపూనినట్లుగాఁ బొరలు చున్నవని కవి యూహించుటచే నుత్ప్రేక్షాలంకారము.

## 25

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి చేతిలో నున్న పద్మమును వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ అలభ్యం సౌరభ్యం కవికులనమస్యా రుచిరతా**
**తథాపి త్వద్ధస్తే నివసదరవిన్దం వికసితమ్ ।**

కలాపే కావ్యానామ్ ప్రకృతి కమనీయస్తుతివిధౌ
గుణోత్కర్షాధానమ్ ప్రథితముపమానం సమజని ॥ ౨౫

**ప్రతిపదార్థము :** ఓ పద్మహస్తా! లక్ష్మీదేవీ! అలభ్యమ్ = ఎచ్చటను లభింపని; సౌరభ్యమ్ = సువాసన (పద్మమునందుఁ గలదు). కవికులనమస్యా = కవుల వంశములచే నమస్కరింపఁదగిన; రుచిరతా = సౌందర్యము (పద్మమునందుఁ గలదు). తథా + అపి = అట్లయినప్పటికిఁ గూడ; త్వత్ = నీయొక్క; హస్తే = చేతియందు; నివసత్ = నివసించుచున్న; అరవిందమ్ = పద్మము; వికసితమ్ = వికసించినదైనది. తక్కిన పద్మములు రాత్రులందు ముడుచుకొని పగటివేళలయందు వికసించును. లక్ష్మీదేవి హస్తమునందలి పద్మము మాత్రమెప్పుడును వికసించియే యుండును. కావ్యానాం కలాపే = రఘువంశము, కుమారసంభవము మొదలగు కావ్యముల సమూహమునందు; ప్రకృతి = ప్రకృతియొక్క; కమనీయ = రమణీయమైన; స్తుతివిధౌ = స్తోత్రవిధానము నందు; గుణ = గుణములయొక్క; ఉత్కర్ష = గొప్పతనమును; ఆధానమ్ = ఉంచుటలో; ప్రథితమ్ = ప్రఖ్యాతి గాంచిన; ఉపమానమ్ = పోలిక; పద్మమునకే; సమజని = పుట్టినది (కలిగినది).

సమ్ + అజని = సమజని. జనీ – ప్రాదుర్భావే. దివాదిధాతువు.

**చ్లిలుఙి** (3–1–43); **చిణ్ భావకర్మణోః** (3–1–66)

చ్లి స్థానములో భావకర్మములందు చిణ్ ప్రత్యయము వచ్చి 'అజని' యని యగును. పుట్టఁబడినదని యర్థము.

**తాత్పర్యము :** లక్ష్మీదేవి పేరు పద్మ. ఆమెకుఁ బద్మములన్నచో నెక్కువ యిష్టము. పద్మములయందే నివసించును. నిత్యము పద్మమునే చేతియందు ధరించును. కవులకుఁ గూడఁ బద్మమన్నచో నెక్కువ యిష్టము. లోకములో ననేకోపమాన వస్తువులున్నను స్త్రీల ముఖమును బద్మముతోఁ బోల్తురు. అట్లే కన్నులను, చేతులను, పాదములను బద్మములతోడనే పోల్తురు. స్త్రీల స్తనములను దామరమొగ్గలతోఁ బోల్తురు. పద్మమునకీ గొప్పతనము లక్ష్మీదేవిచేతియందు ధరించుటవల్లనే వచ్చినదని జగన్నాథకవి యీ శ్లోకములోఁ జెప్పుచున్నాఁడు.

ఎక్కడను బొందశక్యము కాని సౌగంధ్యము (సువాసన), కవుల సమూహములచే నమస్కరింపఁ దగిన సౌందర్యము పద్మమునందు సహజముగానే

కలవు. అయినను లక్ష్మీదేవి చేతిలో నుండు పద్మమున కొక విశేషము గలదు. తక్కిన పద్మములవలెఁ గాక పద్మాదేవి హస్తపద్మము నందున్న పద్మ మెప్పుడును వికసించియే యుండును. మహాకవుల కావ్యకలాపమునందు, సహజప్రకృతి రామణీయకత్వమును స్తోత్రము చేయుటయందు; గొప్ప గుణములను జెప్పుట యందు, ఖ్యాతి పొందిన యుపమానత్వము పద్మమునకే లభించుటకు లక్ష్మీదేవి నిత్యము హస్తమునందు ధరించుటయే కారణము.

కాళిదాస మహాకవి కుమారసంభవకావ్యములో శ్రీపార్వతీదేవి ముఖమునిట్లు వర్ణించినాఁడు –

శ్లో॥ చంద్రం గతా పద్మగుణాన్నభుంక్తే
పద్మాశ్రితా చాంద్రమసీమభిఖ్యామ్ ।
ఉమాముఖం తు ప్రతిపద్యలోలా
ద్విసంశ్రయామ్ ప్రీతిమవాప లక్ష్మీః ॥ (కు.సం. 1–43)

చంచలయైన లక్ష్మీదేవి చంద్రుని దగ్గఱకు వెళ్ళి పద్మమునందలి సౌగంధ్యము మొదలగు గుణములను బొందలేక పోయినది. పద్మము నాశ్రయించినదై చంద్రుని యందలి శోభను, చల్లఁదనమును బొందలేకపోయినది. పార్వతీదేవి ముఖమును జేరి పద్మ చంద్రుల యందలి రెండు గుణములను బొందఁ గల్గినదని భావము. పార్వతీదేవి పద్మముఖి, చంద్రముఖియని తాత్పర్యము.

రఘువంశములో గర్భిణియైన సుదక్షిణనిట్లు వర్ణించినాఁడు –

శ్లో॥ దినేషు గచ్ఛత్సు నితాంతపీవరం
తదీయమానీలముఖం స్తనద్వయమ్ ।
తిరశ్చకార భ్రమరాభిలీనయోః
సుజాతయోః పంకజకోశయోః శ్రియమ్ ॥ (రఘు–3–8)

సుదక్షిణ గర్భవతి యైనది. ఆమె స్తనములు పెద్దవియైనవి. కుచచూచుకములు నల్లఁబడినవి. నీలముఖములతో నున్న యామె చన్నుదోయి తుమ్మెదలతో నున్న తామరమొగ్గల శోభను దిరస్కరించినదని భావము.

మేఘసందేశములో –

హస్తే లీలాకమలమలకే బాలకుందానువిద్ధమ్ (మేఘ–2–2)

అలకాపట్టణము నందలి స్త్రీలు చేతులయందుఁ గమలములను ధరింతురని వర్ణించినాఁడు.

ఈ విధముగా మహాకవుల కావ్యకలాపములలోఁ బద్మమునకు ఖ్యాతి లభించుటకు లక్ష్మీదేవి హస్తములో నుండుటయే కారణము.

లక్ష్మీదేవి నిత్యము పద్మమును ధరించుననుటకు –

శ్లో॥ పద్మప్రియే! పద్మిని! పద్మహస్తే!
పద్మాలయే! పద్మదలాయతాక్షి! ।
విశ్వప్రియే! విష్ణుమనోఽనుకూలే
త్వత్పాదపద్మమ్ మయి సన్నిధత్స్వ ॥ అను **శ్రీసూక్తము**

శ్లో॥ సరసిజనిలయే! సరోజహస్తే!
ధవళతమాంశుకగంధమాల్యశోభే! ।
భగవతి! హరివల్లభే! మనోజ్ఞే!
త్రిభువనభూతికరి! ప్రసీద! మహ్యమ్ ॥

అను శ్రీ శంకరభగవత్పాదాచార్యుల కనకధారాస్తోత్రము ప్రమాణములు.

**26**

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి కరముల సౌభాగ్యమును వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ అనల్పం జల్పన్తు ప్రతిహతధియః పల్లవతులాం**
**రసజ్ఞామజ్ఞానాం క ఇవ కమలే మన్థరయతు ।**
**త్రపన్తే శ్రీభిక్షావితరణవశీభూతజగతాం**
**కరాణాం సౌభాగ్యం తవ తులయితుం తుఙ్గరసనాః ॥** ౨౬

**ప్రతిపదార్థము :** కమలే! = ఓలక్ష్మీదేవీ!; ప్రతిహతధియః = అడ్డగింపఁబడిన బుద్ధి గలవారు – మందబుద్ధులు; పల్లవతులామ్ = (నీ చేతులకు) చిగుళ్ళతో సామ్యమును; అనల్పమ్ = న + అల్పమ్ = ఎక్కువగా; జల్పంతు = జల్పింతురుగాక! ప్రేలుదురు గాక!; అజ్ఞానామ్ = మూర్ఖులయొక్క; రసజ్ఞామ్ = నాలుకను; ఇది జాత్యేకవచనము. నాలుకల నని యర్థము. 'రసజ్ఞా రసనా జిహ్వా' – యని యమరము. క ఇవ = ఎవఁడు మాత్రము; మంథరయతు = చొరవలేని దానిగాఁ జేయఁ గలఁడు? మూఢుని

నాలుక నెవ్వఁడు నడ్డుకొనలేఁడని భావము. శ్రీ = సంపద, యైశ్వర్యము, ధర్మార్థ–కామములు మొదలగు వానిని

> శ్రీర్వేషరచనా శోభా భారతీ సరలద్రుమే ।
> లక్ష్మ్యాం త్రివర్గసంపత్తివిధోపకరణేషు చ ॥

విభూతౌ చ మతౌ చ స్త్రీ – అని మేదినీ – విశ్వకోశములు.

భిక్షా = బిచ్చముగా; వితరణ = దానము చేయుటచే; వశీభూత = వశములైన; జగతామ్ = లోకములు గల, జగత్తులోని జనుల నందఱను శ్రీభిక్షావితరణముచే వశము చేసికొన్న; తవ = నీయొక్క; కరాణామ్ = చేతులయొక్క; సౌభాగ్యమ్ = సౌభాగ్యమును; తులయితుమ్ = తూఁచుటకు – చిగుళ్ళు మొదలగు వానితో సాటి చెప్పుటకు; తుంగరసనాః = ఎత్తుగాఁ బొడవైన నాలుకలు గల కవులు కూడ; త్రపంతే = సిగ్గుపడుచున్నారు.

**తాత్పర్యము :** ఓ లక్ష్మీదేవీ! మందగించిన బుద్ధిగల యజ్ఞానులు, నీ హస్తములకుఁ బల్లవములతో సామ్యమును జెప్పుట కనుపయుక్తములైన మాటలనెక్కువగా వాగుదురు గాక! ఆ మూఢుల నాలుకల నెవఁడు కట్టుబాటు చేయఁగలఁడు?

సంపద, యైశ్వర్యము, త్రివర్గములు మొదలగు వానిని బిక్షగా దానముచేసి సమస్తలోకములను వశము చేసికొన్న నీ కరముల సౌభాగ్యమునకుఁ బల్లవాదుల నుపమానముగాఁ జెప్పుటకుఁ బైకిలేచిన పొడవైన నాలుకలు గల మహాకవులే సిగ్గుపడుచున్నారు.

ఇక్కడఁ గవిపరంపరా ప్రసిద్ధమైన పల్లవమున కుపమానత్వమును నిషేధించుటచేఁ బ్రతీపాలంకారము.

శ్లో॥ వర్ణ్యే నాన్యస్యోపమాయా అనిష్పత్తివచశ్చ తత్ ।
మిథాపవాదో ముగ్ధాక్షి! త్వన్ముఖాభం కిలామ్బుజమ్ ॥

వర్ణింపఁదగిన వస్తువున కుపమానము నిష్పన్నము గాదని చెప్పినచో నొక విధమగు ప్రతీపము. ఓ ముగ్ధనయనా! పద్మము నీ ముఖమునకు సాటియైదని చెప్పుట వృథాపవాదము – అని కువలయానందము.

ఆకర్ణయ సరోజాక్షి! వచనీయమిదమ్ భువి ।
శశాంకస్తవ వక్త్రేణ పామరైరుపమీయతే ॥

ఓ జలజనయనా! నా మాట వినుము. నీ ముఖముతోఁ జంద్రుఁడు పామరులచేఁ బోల్పఁ బడుచున్నాఁడు. నీ ముఖమునకుఁ జంద్రుఁడు సమానము గాఁడని భావము – ఇది కువలయానందోదాహరణము.

పై శ్లోకములో లక్ష్మీదేవి హస్తములకుఁ బల్లవము సాటియని మూఢులు చెప్పుచున్నారు. కాని పల్లవము సాటిగాదని యుపమానానిష్పత్తి చెప్పఁబడుటచేఁ బ్రతీపాలంకారము. జల్పంతు – జల్పము కూడ నొక విధమైన వాద విశేషమే.

సూ : యథోక్తోపపన్నశ్ఛలజాతినిగ్రహస్థానసాధనోపాలంభో జల్పః (న్యా.ద. 1–2–2) అని గౌతమమహర్షి న్యాయసూత్రము. వాదకథాలక్షణములతోఁ గూడినది, ఛల – జాతి – నిగ్రహస్థానములచే స్వపక్షమును స్థాపించి పరపక్షమును ఖండించునది జల్పము.

## 27

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి కంఠహారమును వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ సమాహారః శ్రీణాం విరచితవిహారో హరిదృశామ్**
**పరీహారో భక్తప్రభవభవసన్తాపసరణేః ।**
**ప్రహారః సర్వాసామపి చ విపదాం విష్ణుదయితే!**
**మమోద్ధారోపాయం తవ సపది హారో విమృశతు ॥** ౨౭

**ప్రతిపదార్థము :** విష్ణుదయితే! = శ్రీమన్నారాయణ ప్రేయసీ!; శ్రీణామ్ = సంపదలకు; సమాహారః = సమీకరణము (ప్రోఁగు); హరిదృశామ్ = శ్రీవిష్ణుమూర్తి చూపులకు; విరచిత విహారః = రచింపఁబడిన విహారము గలది; భక్త = భక్తులకు; ప్రభవ = పుట్టుచున్న; భవ = సంసారముయొక్క; సంతాప = దుఃఖములయొక్క; సరణేః = పద్ధతికి; పరీహారః = పోఁగొట్టునది; అపి చ = ఇంకను; సర్వాసాం విపదామ్ = సమస్తములైన యాపదలకు; ప్రహారః = దెబ్బ (కొట్టునది) యైన; తవ = నీయొక్క; హారః = కంఠమునందలి రత్నమాల; మమ = నాకు; ఉద్ధార + ఉపాయమ్ = కష్టములనుండి పైకి లేవఁదీయు వెరవును; సపది = వెంటనే; విమృశతు = విమర్శించుఁగాక! ఆలోచించుఁగాక!

**తాత్పర్యము :** సకల సంపదలకుఁ బ్రోవైనది, శ్రీ విష్ణుమూర్తి చూపులకు విహార స్థానమైనది, నిన్ను నమ్ముకొన్న భక్తులకుఁ గలుగు సంసారసంతాపవిధానమునకుఁ బరిహారమైనది; మఱియు సకలవిపత్తులను బోఁగొట్టునది యగు నీ కంఠహారము నన్నుద్ధరించు నుపాయమును వెంటనే విమర్శించుఁ గాక!

పరీహార : 'పరి + హార' – అనియుండఁగా **ఉపసర్గస్య ఘఞమనుష్యే బహులమ్** (6–3–122) అను సూత్రముచేఁ 'బరి' యను నుపసర్గమునందలి చివరి యచ్చునకు దీర్ఘము వచ్చి పరీహార మని యేర్పడినది.

ఈ శ్లోకమునందు సమాహార – విహార – పరీహార – ప్రహార – హార ములను తుదిహల్లులు సమానముగా వచ్చుటచే నంత్యానుప్రాసము. హార శబ్దమే యర్థభేదముతో ననేక పర్యాయము లావృత్తమగుటచే యమకము.

ఇక్కడ శ్రీల సమాహారమునకు హేతువైన హారమునందే సమాహారత్వమును వ్యపదేశించుటచే హేత్వలంకారము.

'హేతోర్హేతుమతా సార్థం వర్ణనం హేతురుచ్యతే।' హేతు హేతుమంతములను గలిపి వర్ణించినచో హేత్వలంకార మని కువలయానందము.

ఒకే హారమునందు సమాహారత్వ – విహారత్వ – పరీహారత్వ – ప్రహారత్వముల నారోపించుటచే మాలా రూపకము.

ఇటువంటి శ్లోకమే జగన్నాథుని గంగాలహరి యందును గలదు –

శ్లో॥ నిధానం ధర్మాణాం కిమపి చ విధానం నవముదామ్
ప్రధానం తీర్థానామమల పరిధానం త్రిజగతః ।
సమాధానమ్ బుద్ధేరథ ఖలు తిరోధానమధియాం
శ్రియామాధానం నః పరిహరతు తాపం తవ వపుః ॥ (గం.ల–18)

## 28

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి చేతివ్రేళ్ళను వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ అలఙ్కుర్వాణానామ్ మణిగణఘృణీనాం లవణిమా**
**యదీయాభిర్భాభిర్భజతి మహిమానం లఘురపి ।**

**సుపర్వశ్రేణీనాం జనితపరసౌభాగ్యవిభవా-**
**స్తవాఙ్గుల్యస్తా మే దదతు హరివామేఽభిలషితమ్ ॥ ౨౮**

**ప్రతిపదార్థము :** హరివామే! = ముకుంద సుందరీ! ఇందిరాదేవీ!; అలంకుర్వాణానామ్= నీ చేతి వ్రేళ్ళ నలంకరించుచున్న యుంగరములు, గొలుసులు మొదలగు నాభరణములయొక్క; మణిగణఘృణీనామ్ = రత్నముల సమూహముల కిరణముల యొక్క; లవణిమా = లావణ్యము (కాంతితోఁ గూడిన సౌందర్యము); లఘురపి = తక్కువదైనను; యదీయాభిః = ఏ చేతివ్రేళ్ళయొక్క; భాభిః = కాంతులచే; మహిమానమ్= గొప్పతనమును (ఎక్కువ కాంతిని); భజతి = భజించుచున్నదో – పొందుచున్నదో; సుపర్వశ్రేణీనామ్ = దేవతల వరుసలకు; జనిత = కలిగించిన; పరసౌభాగ్య = గొప్ప సౌభాగ్యముయొక్క; విభవాః = వైభవము గలవి యగు; తవ = నీయొక్క; తాః = ఆ; అంగుళ్యః = చేతివ్రేళ్ళు; మే = నాకు; అభిలషితమ్ = కోరికను; దదతు = ఇచ్చుఁగాక!

**తాత్పర్యము :** అమ్మవారి చేతివ్రేళ్ళు సహజముగా నెఱ్ఱని కాంతి గలవి. ఆ వ్రేళ్ళకు నుంగరములు, మురిడీ గొలుసులు మొదలగు నలంకారములు గలవు. ఆ యలంకారములు మణులు (కెంపులు) పొదిగినవి. ఆ మణుల కాంతులు చేతివ్రేళ్ళ కాంతుల ముందు వెలవెలఁ బోవుచున్నవి. లక్ష్మీదేవి చేతివ్రేళ్ళ యందలి వస్తువులలోని కెంపుల కాంతులు తక్కువయైనను, వ్రేళ్ళకాంతులు పడి లావణ్యముతో నొప్పుచున్నవి. మఱియు నా వ్రేళ్ళు దేవతల పంక్తులకు మిక్కిలి సౌభాగ్యవైభవములు గూర్చుచున్నవి. అటువంటి లక్ష్మీదేవి చేతివ్రేళ్ళు నాకు వాంఛితము లొసఁగుఁగాక! నా కోరికలు తీర్చుఁగాక యని భావము.

ఇక్కడ సహజముగా మెఱయు మణులు లక్ష్మీదేవి వ్రేళ్ళ కాంతులు పడి యింకను గాంతిమంతములైనవని వర్ణించుటచే ననుగుణాలంకారము.

శ్లో॥ ప్రాక్సిద్ధస్వగుణోత్కర్షోఽనుగుణః పరసన్నిధేః ।
కర్ణోత్పలాని దధతే కటాక్షైరపి నీలతామ్ ॥ (5–106)

స్వతఃసిద్ధముగానున్న గుణమున కింకొక వస్తుసన్నిధివలన నుత్కర్షమును వర్ణించినచో ననుగుణము. ఆమె చెవుల యందలి నల్లకలువ లామె చూపులు పడుటచే నింకను నల్లనైనవి – అని చంద్రాలోకము.

## 29

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి కంఠమును వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ తపస్తప్త్వా తీవ్రం కిమపి పరితప్య ప్రతిదినం**
**తవ గ్రీవాలక్ష్మీలవపరిచయాదాప్తవిభవమ్ ।**
**హరిః కమ్బుం చుమ్బత్యధివహతి పాణౌ కిమధికం**
**వదామస్తత్రాయమ్ ప్రణయవశతోఽస్యై (స్మై) స్పృహయతి ॥** ౨౯

**ప్రతిపదార్థము :** ఓ లక్ష్మీదేవీ!; తీవ్రమ్ = ఎక్కువ గాఢముగా; తపః తప్త్వా = తపస్సు చేసి; ప్రతిదినమ్ = నిత్యము; కిమ్ + అపి = కిమపి = చెప్పలేని రీతిలో; పరితప్య = పరితపించి; తవ = నీయొక్క; గ్రీవాలక్ష్మీ = కంఠశ్రీయొక్క; లవ = కొంచెము; పరిచయాత్ = పరిచయమువలన; ఆప్తవిభవమ్ = పొందిన వైభవము కల; కంబుమ్ = శంఖమును; అయమ్ = ఆ; హరిః = విష్ణుమూర్తి; చుంబతి = ముద్దు పెట్టుకొను చున్నాఁడు; పాణౌ = చేతిలో; వహతి = మోయుచున్నాఁడు; ప్రణయవశతః = నీ ప్రేమమునకు వశుఁడగుట వలన; అస్యై = ఆ కంఠలక్ష్మికై; స్పృహయతి = మోజు పడుచున్నాఁడు; తత్ర = నీ కంఠసౌభాగ్యవిషయములో; అధికమ్ = ఇంతకంటె నెక్కువగా; కిం వదామః? = ఏమి చెప్పఁగలము?. 'అస్మై' అను పాఠములో నా శంఖమునే యాకాంక్షించు చున్నాఁడని యర్థము. విష్ణుమూర్తి శంఖము పేరు పాంచజన్యము.

**తాత్పర్యము :** స్త్రీల కంఠము శంఖమువలె నుండుట సౌభాగ్యలక్షణము. కవులు కంఠమును శంఖముతోడనే పోల్తురు. అట్టి శంఖముకూడ నెక్కువ తపస్సు చేసి, ప్రతిదినము నెంతో పరితపించి లక్ష్మీదేవి కంఠలక్ష్మితోఁ గల కొంచెము పరిచయము వలన వైభవము నొందినది. లక్ష్మీదేవి కంఠమువలె నుండుట వల్లనే విష్ణుమూర్తి శంఖమును జేతిలో ధరించి మాటిమాటికి ముద్దు పెట్టుకొనుచున్నాఁడు. శంఖసామ్యము వల్లనే ప్రణయపరవశుఁడై లక్ష్మీదేవి కంఠలక్ష్మి నాకాంక్షించుచున్నాఁడు.

ఇక్కడ నుపమానమైన శంఖముకంటె నుపమేయమైన కంఠమున కాధిక్యము చెప్పుటచేఁ బ్రతీపాలంకారము.

శ్లో॥ ప్రతీపముపమానస్య హీనత్వముపమేయతః ।
దృష్టం చేద్వదనం తస్యాః కిం పద్మేన కిమిందునా? ॥ (5-100)

ఉపమేయముకంటె నుపమానము తక్కువదని చెప్పినచోఁ బ్రతీపాలంకారము. ఆమె ముఖమును జూచినచోఁ బద్మముతోఁ గాని, చంద్రునితోఁ గాని పనియేమున్నది – అని చంద్రాలోకము.

## 30

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి ముఖమును వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ అభూదప్రత్యూహః సకలహరిదుల్లాసనవిధి-**
**ర్విలీనో లోకానాం స హి నయనతాపోఽపి కమలే! ।**
**తవాస్మిన్ పీయూషం కిరతి వదనే రమ్యవదనే!**
**కుతో హేతోశ్చేతో విధురయముదేతిస్మ జలధేః ॥** ౩౦

**ప్రతిపదార్థము :** రమ్యవదనే! = అందమైన ముఖము గలదానా!; కమలే! = లక్ష్మీదేవీ!; తవ = నీయొక్క; అస్మిన్ వదనే = ఈ ముఖములో; పీయూషమ్ = అమృతము; కిరతి = కురియుచుండఁగా; సకలహరిత్ = సమస్తదిక్కులయందు; 'దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చ తాః' – అని యమరము. ఉల్లాసనవిధిః = ఉల్లాసముతోఁ బ్రకాశించు విధానము; అప్రత్యూహః = నిర్విఘ్నముగా; 'విఘ్నోఽన్తరాయః ప్రత్యూహః' – అని యమరము. అభూత్ = అయినది; లోకానామ్ = జనులయొక్క; 'లోకస్తు భువనే జనే' – అని యమరము. సః = ఆ; నయనతాపః + అపి = నేత్రసంతాపము కూడ; హి = నిశ్చయముగా; విలీనః అభూత్ = లయము పొందినది. ఇతః + చ = ఇతశ్చ = ఇది యిట్లుండఁగా; కుతః + హేతోః = ఇంక నేకారణముచే; జలధేః = సముద్రము నుండి; అయం విధుః = ఆ చంద్రుఁడు; ఉదేతి స్మ = ఉదయించినాఁడు?

**తాత్పర్యము :** ఓ లక్ష్మీదేవీ! నీ ముఖమునందే యమృతము వర్షించుచుండఁగా సకలదిక్కులు నిర్విఘ్నముగాఁ బ్రకాశించినవి. లోకుల నయనతాపము కూడఁ జల్లారినది. ఇట్టి నీ ముఖమే యుండఁగా సముద్రమునుండి చంద్రుఁడేల పుట్టెనో తెలియకున్నది. చంద్రజననమువలనఁ బ్రయోజనములేదని భావము.

ఈ శ్లోకము రసగంగాధరము నందలి యాక్షేపాలంకార ప్రకరణములో నించుక పాఠభేదముతో నుదాహరింపఁ బడినది. **'ఉపమేయస్యోపమానసంబంధి సకల ప్రయోజన నిష్పాదన క్షమత్వాదుపమానకైమర్థ్య ముపమానాధిక్షేపరూపమాక్షేపః'** – ఇతి కేచిదాహుః । తన్మతే చేత్థముదాహరణం నిర్మాణీయమ్ –

శ్లో॥ అభూదప్రత్యూహః కుసుమశరకోదణ్డమహిమా
విలీనో లోకానాం సహ నయనతాపోఽపి తిమిరైః ।
తవాస్మిన్ పీయూషం కిరతి పరితస్తన్వి వదనే
కుతో హేతోః శ్వేతో విధురయముదేతి ప్రతిదినమ్ ॥

ఉపమానమునకు సంబంధించిన సకలప్రయోజనములను నిష్పన్నము చేయుటలో సామర్థ్యమంతయు నుపమేయమునందే యుండుటవలన నుపమానము వలన నేమి ప్రయోజనమని యుపమానము నధిక్షేపించుచు వర్ణించుట యాక్షేపమని కొందఱు చెప్పిరి. వారి లక్షణము ననుసరించి యుదాహరణ శ్లోకము నిట్లు నిర్మింప వలెను - అభూద ప్రత్యూహః ... ... ... ఇక్కడఁ గొందఱనఁగా వామనాది ప్రాచీనాలంకారికులు. ఉపమానాక్షేపశ్చాక్షేపః । ఉపమానస్యాక్షేపః ప్రతిషేధ ఉపమానాక్షేపః । తుల్యకార్యార్థస్య నైరర్థక్య వివక్షాయామాక్షేపః । (కా.సూ. 4-3-27) వామనాదుల మతములో నీ శ్లోకమునం దాక్షేపాలంకారము కలదు. ఉపమేయమైన వదనముచే నుపమానమైన చంద్రునియొక్క నిష్ప్రయోజనత్వమును జెప్పుటచేఁ బ్రతీపాలంకార మని జయదేవ - అప్పయ్యదీక్షితాదుల మతము. లక్ష్మీలహరిలోని యీ శ్లోకము రసగంగాధరములో సామాన్య స్త్రీ పరముగాఁ జెప్పఁబడినది. ఈ రసగంగాధర శ్లోకమే భామినీవిలాసము నందలి శృంగారవిలాసములోఁ గలదు.

కిరతి - కౄ - విక్షేపే (1409) తుదాది ధాతువు.

విక్షేపము = ఎగురవేయుట, విసరుట

ఉదేతి స్మ : లట్ స్మే (3-2-118) వర్తమానక్రియారూపమునకు 'స్మ' చేరినచో భూతార్థము నిచ్చును. ఉదేతి స్మ = ఉదయించెను.

## 31

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి దంతపంక్తిని వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ ముఖామ్భోజే మన్దస్మితమధురకాన్త్యా వికసతాం**
**ద్విజానాం తే హీరావలివిహితనీరాజనరుచామ్ ।**
**ఇయం జ్యోత్స్నా కాఽపి స్రవదమృతసన్దోహసరసా**
**మమోద్యద్దారిద్ర్యజ్వరతరుణతాపం తిరయతు ॥** ౩౧

**ప్రతిపదార్థము :** ఓ లక్ష్మీదేవీ!; తే = నీయొక్క; ముఖ + అంబుజే = పద్మము వంటి ముఖమునందు; మందస్మిత = చిఱునవ్వుయొక్క; మధురకాంత్యా = తియ్యనైన వెలుఁగుచే (మనోహరద్యుతిచే); వికసతామ్ = వికసించుచున్నవి; హీర + ఆవలి = వజ్రముల వరుసచే; విహిత = చేయఁబడిన; నీరాజనరుచామ్ = హారతి పట్టిన కాంతులు గల; ద్విజానామ్ = దంతములయొక్క; 'దంతవిప్రాండజాద్విజాః' – అని యమరము. ఇయమ్ = ఈ; కా + అపి = ఒకానొక; జ్యోత్స్నా = వెన్నెల; స్రవత్ = ప్రవహించుచున్న; అమృత = అమృతముయొక్క; సందోహ = సమూహముచే – ప్రవాహముచే; సరసా = కూడుకొన్న రసము గలది; మమ = నాయొక్క; ఉద్యత్ = పుట్టుచున్న, దారిద్ర్య = పేదతనమను; జ్వర = జ్వరముయొక్క; తరుణతాపమ్ = దట్టమైన వేఁడిమిని; తిరయతు = కనఁబడకుండఁ జేయుఁగాక! పోఁగొట్టుఁ గాక!

**తాత్పర్యము :** లక్ష్మీదేవియొక్క దంతకాంతియను వెన్నెల నా దారిద్ర్య జ్వర తాపమును నశింపఁజేయుఁగాక! అమ్మవారి ముఖపద్మమునందు మందహాస మనెడు మధుర కాంతిచే వికసించినవి; వజ్రముల పంక్తి పట్టిన హారతుల కాంతి గలవి దంతములు. దంతములను వజ్రములతోఁ బోల్తురు. ఇక్కడ వజ్రముల పంక్తియే లక్ష్మీదేవి దంతావళికి హారతి యిచ్చుచున్నది. ఆ దంతకాంతి వెన్నెలవలె నున్నది. అమృతధారలను స్రవించుచు సరసముగా నున్నది. అట్టి లక్ష్మీదేవి దంతశోభాచంద్రిక నాయందుఁ బుట్టుచున్న లేమియను వేఁకి వలనఁ గల్గిన వేఁడిని నశింపఁజేయుఁగాక!

'ముఖమంభోజమివ' – ముఖము పద్మము వంటిదని చెప్పినచో నుపమిత సమాసము. ముఖమనెడి యంభోజమని చెప్పినచో రూపకము. దారిద్ర్యమనెడు జ్వరమనుచోట రూపకము. ఉపమేయమైన దంతకాంతిని నిగీర్ణము చేసి (కప్పిపుచ్చి) యుపమానమైన జ్యోత్స్నను జెప్పుటచే నతిశయోక్తి.

తిరయతు : జగన్నాథుఁడీ ధాతురూపముల నెక్కువగా వాడినాఁడు. త్వం తాపం తిరయాధునా (గం.ల–50); మమ స్వాంతధ్వాంతం తిరయతు (భా.వి– శాం.వి – 34); హరినవతమాలస్తిరయతు (శాం.వి–36); తిరయత్వాశు సంతాపమ్ (శాం.వి–38) మొదలగునవి. తిరధాతువు పాణినీయ ధాతుపాఠములో లేదు. కాని భట్టమల్లుఁ డాఖ్యాతచంద్రికలో – 'స్పృణోతి తిరయత్యేవం స్పృణుతే గోపయత్యపి' అని పఠించినాఁడు. ఇక్కడఁ బూర్ణిమావ్యాఖ్యలో మనోజపండితులు తిరయతీత్యత్ర ధాతుర్మార్గణీయః । అథవా తిర ధాతుః ॥ అని చెప్పినారు.

కంసం ధ్వంసయతే మురం తిరయతే (విశ్వ-232)

అని వేంకటాధ్వరి కూడఁ బ్రయోగించినాఁడు. ఇక్కడఁ జంద్రికావ్యాఖ్యాత 'తిరయతే = తిరోహితం కుర్వతే' యని యర్థము చెప్పినాఁడు. 'తిరయతే' యనునది చతుర్థీ విభక్త్యంత రూపము. 'కృష్ణాయ తుభ్యం నమః' అని శ్లోకశేషము. తిరధాతువు పరస్మైపదియే.

## 32

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి శ్వాసమారుతసౌరభమును వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ కులైః కస్తూరీణామ్ భృశమనిశమాశాస్యమపి చ**
**ప్రభాతప్రోన్మీలన్నలిననివహైరశ్రుతచరమ్ ।**
**వహన్తః సౌరభ్యమ్ మృదుగతివిలాసా మమ శివం**
**తవ శ్వాసా నాసాపుటవిహితవాసా విదధతామ్ ॥** ౩౨

**ప్రతిపదార్థము :** కస్తూరీణామ్ = కస్తూరీద్రవ్యములయొక్క; కులైః = వంశములచే (సమూహములచే); అనిశమ్ = ఎల్లప్పుడు; భృశమ్ = ఎక్కువగా; ఆశాస్యమ్ = ప్రార్థింపఁ దగినది; ఇది సౌరభ్యమునకు విశేషణము. అపి చ = మఱియును; ప్రభాత = సూర్యోదయ కాలమునందు; ప్ర + ఉత్ + మీలత్ = ప్రోన్మీలత్ = ఎక్కువగా వికసించుచున్న; నలిన నివహైః = పద్మముల సమూహముచే; అశ్రుతచరమ్ = అంతకు ముందు విననిది యగు; సౌరభ్యమ్ = సువాసనను; వహంతః = తాల్చునవి; మృదుగతి విలాసాః = మెత్తని గమనలీలలు గలవి; నాసాపుటవిహితవాసాః = నీ ముక్కు సోణములందు నివాసముండునవి యగు; తవ = నీయొక్క; శ్వాసాః = ఊర్పులు; మమ = నాకు; శివమ్ = శుభమును; 'శ్వఃశ్రేయసం శివమ్ భద్రం కల్యాణమ్ మఙ్గళం శుభమ్' - అని యమరము. విదధతామ్ = చేకూర్చుఁ గాక!

**తాత్పర్యము :** కస్తూరి సువాసనలను, పద్మపరిమళములను మించిన సౌరభము గల లక్ష్మీదేవి శ్వాసమారుతములు నాకు మంగళము గలిగించుఁ గాక! మృగమదద్రవ్యముల సమూహముచే నెల్లప్పుడు నెక్కువగా వేఁడఁదగినది; ప్రాతఃకాలములో బాగుగా వికసించుచున్న తమ్మిపూల గుంపులచేఁ గూడ నంతకు ముందు విననిది యగు సౌగంధ్యమును ధరించునవి, మెల్లగా విలాసముతో వెలువడునవి యగు నీ శ్వాసానిలములు నాకు మంగళములు గలిగించుఁ గాక!

అశ్రుతచరమ్ : భూతపూర్వే చరట్ (5-3-53) అను సూత్రముచే వచ్చిన చరట్ ప్రత్యయము. అంతకు ముందు విననిది యని యర్థము.

'భృశమనిశమాశాస్య' మనుచోట శకారావృత్తిచే వృత్త్యనుప్రాసము. 'లాసా - శ్వాసా - నాసా - వాసా' యనుచోట నంత్యానుప్రాసము.

ఇక్కడ నుపమాన వస్తువులగు కస్తూరీ పద్మగంధములకంటె నుపమేయము లైన శ్వాసముల కాధిక్యము చెప్పుటచేఁ బ్రతీపాలంకారము.

**33**

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి చెంపసరములను వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ కపోలే తే డోలాయితలలితలోలాలకవృతే**
**విముక్తా ధమ్మిల్లాదభిలసతి ముక్తావలిరియమ్ ।**
**స్వకీయానామ్ బన్దీకృతిమసహమానైరివ బలా-**
**న్నిబధ్యోర్ధ్వం కృష్టా తిమిరనికురుమ్బైర్విధుకలా ॥** 33

**ప్రతిపదార్థము :** ఓ లక్ష్మీదేవీ! స్వకీయానామ్ = తనవారిని; బందీకృతిమ్ = బందీకరించుటను (నిర్బంధించుటను); అసహమానైః = సహింపలేకున్న; తిమిరనికురుంబైః = చీఁకట్ల గుంపులచే; బలాత్ = బలాత్కారముగా; నిబధ్య = బంధించి; ఊర్ధ్వమ్ = పైకి; కృష్టా = లాగి కట్టఁబడిన; విధుకలా + ఇవ = చంద్రకళ వలె; తే = నీయొక్క; డోలాయిత = ఊఁగుచున్న; లలిత = మెత్తని; లోల = వ్రేలాడుచున్న; అలక = ముంగురులచే; వృత = ఆవరింపఁబడిన; కపోలే = బుగ్గయందు; ధమ్మిల్లాత్= కొప్పునుండి; విముక్తా = జాఱిన; ఇయమ్ = ఈ; ముక్తా + ఆవలిః = ముత్యముల పంక్తి (చెంపసరము); అభిలసతి = బాగుగాఁ బ్రకాశించుచున్నది.

**తాత్పర్యము :** లక్ష్మీదేవి ముఖముపైనున్న ముంగురు లూఁగుచు నామె చెక్కిళ్ళపై వ్రేలాడుచున్నవి. అనఁగా లక్ష్మీదేవి చెక్కులామె చూర్ణకుంతలములచే నావృతములై యున్నవి. లక్ష్మీదేవి కేశపాశము చీఁకటివలె నల్లగా నున్నది. ఆ కేశపాశములను బిగించి చుట్టిన కొప్పు చీఁకట్ల గుంపువలెనున్నది. ఆ కొప్పుపై నుండి జాఱుచు నామె కపోలములపైఁ బడిన ముత్యముల చెంపసర మామె తలపై ధరించిన చంద్రకళ వలె నున్నది. స్త్రీలు చంద్రవంక నాభరణముగాఁ దలపై ధరించుట ప్రసిద్ధమే. ఈ విషయమును గవి యిట్లుత్ప్రేక్షించుచున్నాఁడు.

తమ చుట్టములైన నల్లని కేశపాశములను బందీలుగాఁ జేసి కొప్పుగా బంధించుటవలనఁ గోపించిన చీఁకట్ల గుంపుచేఁ బైకిలాగి కట్టఁబడిన చంద్రకళవలె నామె కొప్పునుండి జాతి బుగ్గలపైఁ బడిన ముత్యముల చెంపసరమున్నది. ముక్తావళికాంతి చంద్రకళవలె నెక్కువగాఁ బ్రకాశించుచున్నదని భావము.

ఇక్కడ 'డోలాయిత లలితలోలాలక' – అనుచోట లకారావృత్తిచే వృత్త్యనుప్రాసము. లక్ష్మీదేవి కేశపాశమును జీఁకటిగా; నామె కొప్పును దిమిర నికురంబముగా; నామె తలపై నన్ను చంద్రవంకను జంద్రకళగాఁ గవి యూహించి వర్ణించుటచే నుత్ప్రేక్షాలంకారము.

## 34

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి నేత్రమును వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ ప్రసాదో యస్యాయం నమదమితగీర్వాణమకుట–**
**ప్రసర్పజ్జ్యోత్స్నాభిశ్చరణతలపీఠార్చనవిధిః ।**
**దృగమ్భోజం తత్తే గతిహసితమత్తేభగమనే!**
**వనే లీనైర్దీనైః కథయ! కథమీయాదిహ తులామ్ ॥** ౩౪

**ప్రతిపదార్థము :** గతి = నడకచే; హసిత = నవ్వఁబడిన; మత్త + ఇభ = మదించిన యేనుఁగుయొక్క; గమనే! = నడకగలదానా! మదించిన యేనుఁగు నడక నవహేళనము చేయు నడక గల లక్ష్మీదేవీ!; నమత్ = వంగి నమస్కరించుచున్న; అమిత = మితములేని, (అసంఖ్యాకులైన); గీర్వాణ = దేవతలయొక్క; మకుట = కిరీటముల యందు; ప్రసర్పత్ = చుట్టలు చుట్టలుగా విరఁజిమ్ముచున్న; జ్యోత్స్నాభిః = వెన్నెలలచే (కాంతులచే); చరణతలపీఠ = పాదతలముల క్రిందనున్న పీఁటయొక్క; అర్చనవిధిః = పూజా విధానము; యస్య = ఏ నేత్రపద్మముయొక్క; అయమ్ = ఈ; ప్రసాదః = ప్రసాదమో; తత్ = ఆ; తే = నీయొక్క; దృక్ + అంభోజమ్ = పద్మమువంటి కన్ను; వనే = నీళ్ళలో; 'వనే సలిలకాననే' – అని యమరము, లీనైః = మునిఁగిన; దీనైః = దైన్యము నొందిన పద్మములతో; తులామ్ = పోలికను; కథమ్ = ఎట్లు?; ఇహ = ఇక్కడ; ఈయాత్ = పొందఁగలదో; కథయ = చెప్పుము.

**తాత్పర్యము :** మదగజగమనమువంటి నడక గల యో లక్ష్మీదేవీ! నీ కటాక్షవీక్షణ మెవ్వరిపైఁ బడునో వారి యఁబకాలి క్రిందనున్న పీఠమును ముప్పదిమూఁడు కోట్ల

దేవతలు వంగి నమస్కరించుచు, వారి శిరస్సులపైనున్న కిరీటములనుండి వెలువడుచున్న కాంతులతో నీరాజనమిచ్చి యర్చింతురు. అట్టి యోగము వారికిఁ బట్టుట నీ నేత్రప్రసాదము. అటువంటి నీ నయన జలజములతో నిత్యము నీటిలో మునిఁగి దైన్యముతో నున్న పద్మము లెట్లు పోలఁగలవో చెప్పుము. నీ నయన పద్మములకు సామాన్యపద్మములు సాటిగావని భావము.

ఇక్కడఁ బ్రసాదమే యర్చనవిధి యని కారణముతోఁ గార్యమును గలిపి వర్ణించుటచే హేత్వలంకారము.

శ్లో॥ హేతుహేతుమతోరైక్యం హేతుం కేచిత్ ప్రచక్షతే ।
లక్ష్మీవిలాసా విదుషాం కటాక్షా వేంకటప్రభోః ॥ (కువ-168)

అని కువలయానందము.

ఉపమానమైన పద్మముపమేయమైన లక్ష్మీదేవి నయనపద్మముతో సాటిగాదని వర్ణించుటచేఁ బ్రతీపాలంకారము.

## 35

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి కటాక్షదృష్టి నా దురదృష్టమును బాఱఁద్రోలి రక్షించుఁ గాక! యని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ దురాపా దుర్వృత్తైర్దురితదమనే దారుణభరా**
**దయార్ద్రా దీనానాముపరి దలదిన్దీవరనిభా ।**
**దహన్తీ దారిద్ర్యద్రుమకులముదారద్రవిణదా**
**త్వదీయా దృష్టిర్మే జనని! దురదృష్టం దలయతు ॥** ३५

**ప్రతిపదార్థము :** జనని! = అమ్మా! లక్ష్మీదేవీ!; దుర్వృత్తైః = దుశ్శీలము గలవారిచే; దురాపా = పొందశక్యము కానిది; దురితదమనే = పాపములను నాశనము చేయుటలో; దారుణభరా = ఘోరమైన భారము గలది; దీనానామ్ + ఉపరి = పేదవారిపై; దయా + ఆర్ద్రా = కరుణతోఁ జెమరించినది; దలత్ = విచ్చుకొనుచున్న; ఇందీవర = కలువలతో; నిభా = సమానమైనది; దారిద్ర్యద్రుమకులమ్ = బీదతనమనెడి చెట్ల సమూహమును; దహంతీ = కాల్చివేయునది; ఉదార ద్రవిణదా = గొప్పగా ధనము నిచ్చునది యగు; త్వదీయా = నీయొక్క; దృష్టిః = చూపు; మే = నాయొక్క; దురదృష్టమ్ = దౌర్భాగ్యమును; దలయతు = చీల్చివేయుఁగాక!

**తాత్పర్యము :** ఓ తాయీ! లక్ష్మీదేవీ! దుష్టశీలురు పొందలేనిది, కలుషములను గాలరాయుటలో నెక్కువ భారము వహించునది, లేమిచే దైన్యము నొందు భక్తులను జూచినంతనే కృపతోఁ జెమరించిన హృదయము కలది, వికసించుచున్న నల్లకలువల కాంతి కలది, దారిద్ర్యమను చెట్ల గుంపును గాల్చి బూడిద చేయునది, యెంతో యౌదార్యముతో భక్తులకు ధనము నిచ్చునది యగు నీ కటాక్షవీక్షణము నా దురదృష్టమును నాశనము చేసి నా కదృష్టమును బండించుఁ గాక!

ఈ పద్యమునందలి పదముల మొదటి యక్షరములు దకారముతో నారంభమగుటచే శ్లోకసౌందర్య మినుమడించినది. ఇటువంటి శ్లోకమే జగన్నాథుని గంగాలహరియందును గలదు –

శ్లో॥ దరిద్రాణాం దైన్యం దురితమథ దుర్వాసనహృదాం
ద్రుతం దూరీకుర్వన్ సకృదపి గతో దృష్టిసరణిమ్ ।
అపి ద్రాగావిద్యాద్రుమదలనదీక్షా గురురిహ
ప్రవాహస్తే వారాం శ్రియమయమపారాం దిశతు నః ॥ (గం.ల –2)

**36**

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి కర్ణములను వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ తవ శ్రోత్రే ఫుల్లోత్పలసకలసౌభాగ్యజయినీ**
**సదైవ శ్రీనారాయణగుణగణౌఘప్రణయినీ ।**
**రవైర్దీనాలీనామనిశమవధానాతిశయినీ**
**మమాప్యేతాం వాచం జలధితనయే! గోచరయతామ్ ॥** ౩౬

**ప్రతిపదార్థము :** జలధితనయే! = సముద్రునకుఁ గొమార్తెవైన లక్ష్మీదేవీ!; ఫుల్ల = వికసించిన; ఉత్పల = కలువలయొక్క; సకల = సమస్తమైన; సౌభాగ్య = సౌభాగ్యములను; జయినీ = జయించునవి; సదా + ఏవ = ఎల్లప్పుడును గూడ; శ్రీనారాయణ = మంగళసంపన్నుఁడైన విష్ణుమూర్తియొక్క; గుణ = గుణముల; గణ = సమూహముల; ఓఘ = పరంపర యందు; ప్రణయినీ = ప్రేమము కలిగి యుండునవి; దీన + ఆలీనామ్ = దీనుల వరుసలయొక్క; 'వీథ్యాలిరావలిః పంక్తి శ్రేణీ' – అని యమరము. రవైః = శబ్దములచే; అనిశమ్ = ఎల్లప్పుడు; అవధాన = అప్రమాదముగా నుండుటలో; 'ప్రమాదోఽనవధానతా' – అని యమరము.

అతిశయినీ = అతిశయించునవి యగు; తవ = నీయొక్క; శ్రోత్రే = చెవులు; 'కర్ణశబ్దగ్రహౌ శ్రోత్రం శ్రుతిః స్త్రీ శ్రవణం శ్రవః' – అని యమరము. మమ = నాయొక్క; ఏతామ్= ఈ; వాచమ్ = ప్రార్థన వాక్కును గూడ; గోచరయతామ్ = గోచరింపఁజేసికొనుఁ గాక! నా వాక్కులు కూడ నీ శ్రవణగోచరములగుఁ గాక!

**తాత్పర్యము :** ఓ సముద్రపుత్రీ! లక్ష్మీ! వికసించిన నల్లకలువల సకలసౌభాగ్యములను జయించునవి, శ్రీమన్నారాయణుని గుణగణసమూహమును వినుటయందే ప్రేమ గలవి, దీనుల యార్తనాదములను వినుటలో నెల్లప్పుడు ప్రమాదములేనివి యైన నీ చెవులు నాయొక్క రచనమునుగూడ గోచరము చేసికొనుఁగాక! లక్ష్మీలహరీస్తోత్ర మెల్లప్పుడు నీ శ్రవణములకు వినఁబడు గాక! యని భావము.

**విశేషము :** ఈ శ్లోకమునందలి మూఁడవ పాదములో 'రవైర్దీనాం లీనామ్' అని యన్ని ప్రతుల యందుఁ బాఠము. అప్పుడు : రవైః = హాహాకార శబ్దములతో; దీనామ్ = దైన్యము నొందినది; లీనామ్ = క్షీణించినది లేక లయమునొందినది యగు; వాచమ్ = వాక్కునని యర్థము చెప్పుకొనవలయును. 'రవైర్దీనా లీనామ్' అని నాగరాజశర్మగారి పాఠము. ఈ పాఠమే సరసముగా నుండుటచే నిచ్చటఁ గైకొనఁ బడినది. 'దీన + అలీనామ్ = దీనులనెడి తుమ్మెదలయొక్క' – యని నాగరాజవ్యాఖ్య. ఇక్కడఁ దుమ్మెదలకు సందర్భము లేదు గావున నా వ్యాఖ్య సరియైనది కాదు. దీనుల శ్రేణులనుటయే సందర్భోచితమైన యర్థము.

## 37

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి చెవి దుద్దులను వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ ప్రభాజాలైః ప్రాభాతికదినకరాభాపనయనం**
**తవేదం ఖేదమ్ మే విఘటయతు తాటఙ్కయుగలమ్ ।**
**మహిమ్నా యస్యాయమ్ ప్రలయసమయేఽపి క్రతుభుజాం**
**జగత్ పాయమ్ పాయం స్వపితి నిరపాయం తవ పతిః ॥** ౩౭

**ప్రతిపదార్థము :** ఓ లక్ష్మీదేవీ! ప్రభాజాలైః = కాంతుల సమూహముచే; ప్రాభాతిక = ప్రభాతకాలమునందున్న; దినకర = సూర్యునియొక్క; ఆభా = కాంతిని; అపనయనమ్ = దూరముగాఁ దొలఁగించుచున్నదో యట్టి; తవ = నీయొక్క; తాటంకయుగలమ్ = చెవికమ్మల జంట; మే = నాయొక్క; ఖేదమ్ = దుఃఖమును; విఘటయతు = పోఁగొట్టుఁ

గాక! ఆ తాటంకయుగల మెట్టిదో చెప్పుచున్నాఁడు. యస్య = ఏ దుద్దుల జంటయొక్క; మహిమ్నా = గొప్పతనముచే; అయమ్ = ఈ; తవ = నీయొక్క; పతిః = భర్తయగు విష్ణుమూర్తి; క్రతుభుజామ్ = దేవతలయొక్క; ప్రలయసమయే + అపి = ప్రళయ కాలములోఁ గూడ; జగత్ = లోకమును; పాయమ్పాయమ్ = రక్షించి రక్షించి; నిః + అపాయమ్ = అపాయము లేకుండ; స్వపితి = నిద్రించుచున్నాఁడు; తత్ = అట్టి తాటంకయుగలమని శేషము.

**తాత్పర్యము :** దేనియొక్క ప్రభావముచే విష్ణుమూర్తికూడ దేవతలందఱు ప్రళయకాలములో నశించినప్పుడు కూడ విశ్వమును రక్షించి రక్షించి యే యపాయము లేకుండ నిద్రించుచున్నాఁడో యట్టి నీ చెవాకుదోయి - తన కాంతులచే నుదయించుచున్న సూర్యుని కాంతిని గూడ వెనుకకు నెట్టునది - నా శోకమును బోఁగొట్టుఁ గాక!

పింగళిసూరన కళాపూర్ణోదయములో విష్ణుమూర్తి కుండలముల నిట్లే వర్ణించినాఁడు -

సీ॥ మకరకుండల రుచిప్రకర కుంఠితములై
దినకర ప్రభలు వెన్వెనుక కొదుగ (కళా-2-98)

'పాయమ్పాయమ్' అనునది 'పా-రక్షణే' యను ధాతువునకు ణము లంతరూపము.

ఇటువంటి భావమే శ్రీ శంకరభగవత్పాదుల సౌందర్యలహరిలోఁ గలదు-

శ్లో॥ సుధామప్యాస్వాద్య ప్రతిభయజరామృత్యుహరిణీం
విపద్యన్తే విశ్వే విధిశతమఖాద్యా దివిషదః ।
కరాలం యత్ క్ష్వేలం కబలితవతః కాలకలనా
న శమ్భోస్తన్మూలం తవ జనని! తాటఙ్కమహిమా ॥ (సౌం.ల-28)

## 38

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి కొప్పును వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ నివాసో ముక్తానాం నిబిడతరనీలామ్బుదనిభ-**
**స్తవాయం ధమ్మిల్లో విమలయతు మల్లోచనయుగమ్ ।**

**భృశం యస్మిన్ కాలాగురు బహులసౌరభ్యనివహైః**
**పతన్తి శ్రీభిక్షార్థిన ఇవ మదాన్ధా మధులిహః ॥ ౩౮**

**ప్రతిపదార్థము :** ఓ లక్ష్మీదేవీ! ముక్తానామ్ = మంచిముత్యములకు; నివాసః = నివసించు స్థానము, లక్ష్మీదేవి కొప్పు మౌక్తికములతోఁ జేసిన యాభరణములతో నిండియున్నదని భావము. నిబిడతర = మిక్కిలి దట్టమైన; నీల + అంబుదనిభః = కాఱుమబ్బులవలె నల్లనైనది యగు; అయమ్ = ఈ; తవ = నీయొక్క; ధమ్మిల్లః = కొప్పు; మత్ = నాయొక్క; లోచనయుగమ్ = కన్నుదోయిని; విమలయతు = నిర్మలముగాఁ జేయుఁగాక! ఆ కొప్పెట్టిదో చెప్పుచున్నాఁడు – యస్మిన్ = దేనియందు; శ్రీభిక్షా + అర్థినః + ఇవ = శోభనే భిక్షగా యాచించువాని వలె; మద + అంధాః = మదముచే గ్రుడ్డివియైన; మధులిహః = తుమ్మెదలు; కాల + అగురు = నల్లని యగురు ద్రవ్యముయొక్క; బహుల = ఎక్కువయైన; సౌరభ్య = సువాసనలయొక్క; నివహైః = సమూహములతో; భృశమ్ = ఎక్కువగా; పతంతి = పడుచున్నవో; అట్టి నీ కొప్పని యర్థము. ఇక్కడ 'నివహైః' అనుచోట 'నివహే' యని చంద్రప్రభా పాఠము. అప్పుడు కాలాగురు ద్రవ్యముల సౌగంధ్యసమూహముగల కొప్పు నందని యర్థము.

**తాత్పర్యము :** లక్ష్మీదేవి కొప్పు ముత్యములు పొదిగిన యాభరణములకు నిలయమైనది. దట్టముగాఁ బట్టిన మబ్బులవలె నల్లనైనది. ఆఁడువారు తమ కేశపాశములకు సాంబ్రాణి, యగురు మొదలగు సుగంధద్రవ్యములతోఁ బొగవేసికొందురు. లక్ష్మీదేవి కొప్పాయగురు ద్రవ్యముల సువాసనలను వెదఁజల్లుచున్నది. పార్వతీదేవివలెనే లక్ష్మీదేవికూడ సౌగంధికలసత్కచ. లక్ష్మీదేవి కొప్పునందలి నల్లని రంగునకు, సుగంధమునకు నాకర్షింపఁబడినవై మదించిన తుమ్మెదలు కొప్పునందలి శోభ నర్థించువానివలె వ్రాలుచున్నవి. ఓ లక్ష్మీదేవీ! అట్టి నీ కొప్పు నా కన్నుల జంటను స్వచ్ఛముగాఁ జేయుఁగాక! అంజనద్రవ్యాదులవలన కన్నులు శుభ్రపడుట లోకప్రసిద్ధమే.

## 39

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి కిరుప్రక్కల నిలఁబడి తొండములతో నభిషేకము చేయు నేనుఁగులను వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ విలగ్నౌ తే పార్శ్వద్వయపరిసరే మత్తకరిణౌ**
**కరోన్నీతైరచ్ఛన్మణికలశముగ్ధాస్యగలితైః ।**

**నిషిఞ్చన్తౌ ముక్తామణిగణసమైస్త్వాం జలకణై-**
**ర్నమస్యామో దామోదరగృహిణి! దారిద్ర్యదలితాః ॥** ౩౮

**ప్రతిపదార్థము :** దామోదరగృహిణి! = శ్రీ విష్ణుమూర్తికి ధర్మగేహినివైన యో లక్ష్మీదేవీ!; కర = తొండములచే; ఉన్నీతైః = పైకెత్తఁబడిన; అంచత్ = ప్రకాశించుచున్న; మణి = రత్నములు పొదిగిన; కలశ = (బంగారు) కుండలయొక్క; ముగ్ధ = అందమైన; ఆస్య = ముఖము నుండి; గలితైః = జాఱిన; ముక్తామణి = మంచి ముత్యముల; గణ = గుంపులతో; సమైః = సమానమైన; జలకణైః = నీటిబిందువులతో; నిషించంతౌ = అభిషేకము చేయుచున్న; తే = నీయొక్క; పార్శ్వద్వయపరిసరే = రెండువైపుల నున్న సమీపభూమిలో; విలగ్నౌ = చక్కఁగా నిలిచిన; మత్తకరిణౌ = మదించిన రెండేనుఁగులను; దారిద్ర్యదళితాః = పేదతనముచే దళితులమైన మేము; నమస్యామః= నమస్కరించుచున్నాము.

**తాత్పర్యము :** శ్రీ విష్ణుమూర్తి గృహస్థురాలవైన లక్ష్మీదేవీ! నీకు రెండు ప్రక్కల దగ్గఱలో బాగుగా నిలఁబడి తొండములతోఁ బైకెత్తిన రత్నఖచితసువర్ణకుంభమోహన ముఖముల నుండి జాలువాఱుచు మంచిముత్యముల గణములవలె నున్న జలబిందు ధారలతో నీకభిషేకము చేయుచున్న రెండు మత్తగజములను లేమిచేఁ బీడింపఁబడిన మేము నమస్కరించుచున్నాము.

లక్ష్మీదేవి కిరువంకల రెండు దివ్యగజేంద్రములు మణిగణఖచిత హేమకుంభములతో స్నానము చేయించుననుటకు -

శ్లో॥ యా సా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ
గంభీరావర్తనాభిస్స్తనభరనమితా శుభ్రవస్త్రోత్తరీయా ।
లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైర్మణిగణఖచితైః స్నాపితా హేమకుంభై-
ర్నిత్యం సా పద్మహస్తా మమ వసతు గృహే సర్వమాంగల్యయుక్తా ॥

అను శ్రీసూక్తము

శ్లో॥ దిగ్ఘస్తిభిః కనకకుంభముఖావసృష్ట-
స్వర్వాహినీ విమలచారుజలప్లుతాంగీమ్ ।
ప్రాతర్నమామి జగతాం జననీమశేష-
లోకాధినాథ గృహిణీమమృతాబ్ధిపుత్రీమ్ ॥

అను శ్రీ శంకరభగవత్పాదుల కనకధారాస్తోత్రము ప్రమాణములు.

**40**

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి నోదార్పుమని ప్రార్థించుచున్నాఁడు -

**శ్లో॥ అయే! మాతర్లక్ష్మి! త్వదరుణపదామ్భోజనికటే**
**లుఠన్తమ్ బాలమ్ మామవిరలగలద్బాష్పజటిలమ్ ।**
**సుధాసేకస్నిగ్ధైరతిమసృణముగ్ధైః కరతలైః**
**స్పృశన్తీ మారోదీరితి వద! సమాశ్వాసయసి కదా? ॥** ౪౦

**ప్రతిపదార్థము :** అయే మాతః! = ఓయంబా! లక్ష్మి! = లక్ష్మీదేవీ!; త్వత్ = నీయొక్క; అరుణ = ఎఱ్ఱని; పద + అంభోజనికటే = పాదపద్మముల చెంగట; లుఠంతమ్ = దొరలుచున్నవానిని; అవిరల = ఎడతెగకుండ; గలత్ = కాఱుచున్న; బాష్ప = కన్నీళ్ళతో; జటిలమ్ = కరడుగట్టిన శోకము గలవానిని; బాలమ్ = పసిపిల్లవానిని; మామ్ = నన్ను; సుధా = అమృతమును; సేక = చిలుకుటచే; స్నిగ్ధైః = జిడ్డైనవి; అతి = మిక్కిలి, మసృణ = నున్నతనముచే; ముగ్ధైః = మోహమైనవి యగు; కరతలైః = అఱచేతులచే; స్పృశంతీ = ముట్టుకొని రాయుచు; మా + రోదీః + ఇతి = ఏడువకుమని; కదా = ఎప్పుడు?; సమ్ + ఆశ్వాసయసి = బాగుగా నూఱడింతువో, వద = చెప్పుము.

**తాత్పర్యము :** ఓ యమ్మా! లక్ష్మీదేవీ! ఎఱ్ఱనైన నీ యడుగు తమ్ముల దగ్గఱఁ బడి యిటునటు దొరలుచు నాఁగకుండఁ గాఱుచున్న కన్నీళ్ళతోఁ గలఁత నొందిన పసిబిడ్డను నన్ను (జగన్నాథుని లేక యీ స్తోత్రము నెవరు పఠింతురో వారిని) నమృతబిందువులు చల్లుచు జిడ్డుగా, నున్నగా, మెత్తగా నున్న నీ యఱచేతులతో నన్ను లేవనెత్తి నిమురుచు బాబూ! యేడువకురా! నాయనా! యని పలుకుచు నన్నెప్పు డోదార్తువో చెప్పుము.

ఇక్కడఁ జంటిపిల్లవాఁడు కన్నీరు కార్చుచుఁ దల్లి పాదములయొద్దఁ బొరలుచు నేడ్చుట, యా పసిశిశువును లేవనెత్తి తల్లి తన మెత్తని చేతులతో నిమురుచుఁ గన్నీళ్ళు తుడిచి యోదార్చుట కన్నులకుఁ గట్టినట్లు చమత్కారముగా వర్ణించుటచే స్వభావోక్తి యలంకారము.

**'స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిషు చ వర్ణనమ్'** (చంద్రా. 5-112)

జాతి మొదలగు వానియందలి స్వభావము నున్నదున్నట్లుగా వర్ణించినచో స్వభావోక్తి యని చంద్రాలోకము.

**విశేషము :** జగన్నాథ పండితరాయల తల్లికూడ లక్ష్మియే.

శ్లో॥ పాషాణాదపి పీయూషం స్యందతే యస్య లీలయా ।
తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతమ్ మహాగురుమ్ ॥

అని రసగంగాధరము.

## 41

**అవతారిక :** ఇప్పుడు లక్ష్మీదేవి నామస్మరణముతో నీ స్తోత్రకావ్యమును ముగించుచున్నాఁడు –

**శ్లో॥ రమే! పద్మే! లక్ష్మి! ప్రణతజనకల్పద్రుమలతే!**
**సుధామ్భోధేః పుత్రి! త్రిదశనికరోపాత్తచరణే! ।**
**పరే! నిత్యమ్ మాతర్గుణమయి! పరబ్రహ్మమహిలే!**
**జగన్నాథస్యాకర్ణయ మృదులవర్ణావలిమిమామ్ ॥** ౪౧

**ప్రతిపదార్థము :** రమే! = 'రమయతీతి రమా' లోకములను రమింపఁ జేయుదానా!; పద్మే = 'పద్మమస్యాః కరేஉస్తీతి' పద్మము చేతియందుఁ గలదానా!; లక్ష్మి! = 'లక్ష్యతే సర్వోஉనయేతి' సర్వము నవలోకించుదానా!; ప్రణత = వంగి నమస్కరించిన; జన = భక్తజనులకు; కల్పద్రుమలతే! = కల్పవృక్షముయొక్క తీఁగవైనదానా!; సుధా + అంభోధేః + పుత్రి! = అమృతసముద్రమునకుఁ గుమారివైనదానా!; త్రిదశ = దేవతలయొక్క; 'అమరా నిర్జరా దేవా స్త్రిదశా విబుధాః సురాః' – అని యమరము. నికర = సమూహముచే; 'స్తోమౌఘనికరవ్రాతవారసంఘాతసంచయాః' – అని యమరము. ఉప + ఆత్త = పొందఁబడిన – ఆశ్రయింపఁబడిన; చరణే! = పాదములు గలదానా! పరే! = పరాదేవతా!; మాతః! = మాతి వర్తతే గర్భోஉత్రమాతా = కడుపు చలువ గలదానా! 'జనయిత్రీ ప్రసూర్మాతా జననీ' – అని యమరము. గుణమయి = మంచి గుణములతో నిండినదానా!; పరబ్రహ్మమహిలే! = పరబ్రహ్మస్వరూపుఁడైన శ్రీవిష్ణుమూర్తి కర్ధాంగివైనదానా!; జగన్నాథస్య = జగన్నాథునియొక్క; ఇమామ్ = ఈ; మృదులవర్ణ + ఆవలిమ్ = మెత్తని యక్షరముల పంక్తిని; ఆకర్ణయ = వినుము.

**తాత్పర్యము :** రమా! పద్మా! లక్ష్మీ! ప్రణతజనకల్పద్రుమలతా! సుధాంభోధిపుత్త్రీ! త్రిదశనికరోపాత్తచరణా! పరాత్పరా! మాతా! గుణమయీ! పరబ్రహ్మమహిలా! ఈ జగన్నాథకవి చెప్పిన మెత్తని యక్షరముల శ్రేణితోఁ గూడిన యీ లక్ష్మీలహరీ స్తోత్రమును నిత్యము వినుము.

**విశేషము :** జగన్నాథకవి యీ లక్ష్మీలహరిలోఁ గాని; వేంకటాధ్వరి లక్ష్మీసహస్రములోఁ గాని లక్ష్మీదేవి కోలాసురుని వధించి లోకములను రక్షించిన విషయమును బ్రస్తావింపకపోవుట విడ్డూరముగా నున్నది.

నమస్తే గరుడారూఢే! కోలాసురభయంకరి! ।
సర్వపాపహరే! దేవి! మహాలక్ష్మి! నమోఽస్తు తే ॥

గ్రంథాంతగద్యము

**ఇతి శ్రీపండితరాజ జగన్నాథ విరచితా లక్ష్మీలహరీ సమాప్తా.**

ఇతి = ఈ విధముగా; ఇతి శబ్దము గ్రంథసమాప్తిని సూచించును. 'ఇతి హేతు ప్రకరణ ప్రకాశాది సమాప్తిషు' - అని యమరము. శ్రీ = లక్ష్మీసంపన్నుఁడైన; పండితరాజ = పండితరాజను షాజహాన దత్త బిరుదముగల; జగన్నాథ = జగన్నాథ మహాకవిచే; విరచితా = విరచింపఁబడిన; లక్ష్మీలహరీ = లక్ష్మీలహరి యను స్తోత్ర కావ్యము; సమాప్తా = ముగిసినది.

తే॥గీ॥ పుష్పగిరి శంకరాచార్య పూజ్యపాద
దత్త విద్యావిభూషణోద్దండ బిరుద
శాలి గరిమెళ్ళశర్మ లక్ష్మీలహరికి
నమృతధారాఖ్య టీక నాంధ్రమునఁ జెప్పె.
శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు.

శ్రీ శార్వరీ శ్రావణ బహుళ దశమీ శుక్రవారము

14-08-2020

శ్రీశార్వరీ శ్రావణవరలక్ష్మీదేవత విశ్వవ్యాప్తమైన కరోనా రోగమును శాంతింపఁజేసి సకలజనులకు సమస్త సన్మంగళములను బ్రసాదించుఁగాక!

శ్రీ శ్రీ శ్రీ

శ్రీః

శ్రీరామచన్ద్రాయ నమః

మహాకవిశ్రీపణ్డితరాజజగన్నాథవిరచితా

# సుధాలహరీ

## (సూర్యస్తుతిః)

అమృతధారావ్యాఖ్య : **శ్రీ గరిమెళ్ళ సోమయాజులు శర్మ**



శ్రీః

శ్రీరామచన్ద్రాయ నమః

మహాకవి శ్రీపణ్డితరాజ జగన్నాథవిరచితా

# సుధాలహరీ

## (సూర్యస్తుతిః)

### 1

శ్లో॥ ఉల్లాసః ఫుల్లపఙ్కేరుహపటలపతన్మత్తపుష్పన్ధయానాం
నిస్తారః శోకదావానలవికలహృదాం కోకసీమన్తినీనామ్ ।
ఉత్పాతస్తామసానాముపహతమహసాం చక్షుషామ్ పక్షపాతః
సఞ్జాతః కోఽపి ధామ్నామయముదయగిరిప్రాన్తతః ప్రాదురాసీత్॥ ౧

**అమృతధారావ్యాఖ్య**

కం॥ శ్రీమత్పుష్పగిరీశ
స్వామిపదాబ్జములు గొలిచి పండితరాజ
శ్రీమత్సుధాలహరికిన్
శ్రీమదమృతధార యనఁగఁ జేసెదఁడీకన్.

శ్రీ జగన్నాథపండితరాయలు సూర్యస్తోత్రరూపమైన సుధాలహరియను భక్తికావ్యమును రచియింపఁగోరినవాఁడై **'ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాపి తన్ముఖమ్'** ఆశీర్వాదముతోఁగాని, నమస్కారముతోఁగాని, వస్తునిర్దేశముతోఁ గాని కావ్యము నారంభింపవలె ననెడి దండ్యాచార్యుని వచనము ననుసరించి సూర్యకాంతి యను వస్తునిర్దేశముతో మంగళము నాచరించుచుఁ గావ్యము నారంభించు చున్నాఁడు –

**ప్రతిపదార్థము :** ఫుల్ల = వికసించిన; పంకేరుహ = పద్మములయొక్క; పటల = సమూహమునందు; పతత్ = పడుచున్న; మత్త = మదించిన; పుష్పంధయానామ్ = తుమ్మెదలకు, ఉల్లాసః = సంతోషమైనది; శోక = దుఃఖమను; దావ + అనల =

దావాగ్నిచే; వికల = ఎడఁబాటుచేఁ గలఁత చెందిన; హృదామ్ = హృదయములు గల; కోకసీమన్తినీనామ్ = చక్రవాకస్త్రీలకు; నిస్తారః = తరింపఁజేయునది – దుఃఖముల నుండి దాఁటించునది; తామసానామ్ = తమోగుణము గల దుష్టులకు (చీఁకటి యందు సంచరించువారికి); ఉత్పాతః = హఠాత్తుగా వచ్చిన యపశకునమైనది; ఉపహత– మహసామ్ = కోల్పోయిన కాంతిగల; చక్షుషామ్ = కన్నులకు; పక్షపాతః = పక్షపాతము గలది – చూపుల ననుగ్రహించునది యగు; కోఽపి = ఒకానొక; అయమ్ = ఈ; ధామ్నామ్ = కాంతులయొక్క; 'తేజో ధామ మహో విభా' – అని యమరము. సంఘాతః = సమూహము; ఉదయగిరిప్రాంతతః = తూర్పుకొండ సమీపమునుండి; ప్రాదుః + ఆసీత్ = ప్రాదురాసీత్ = పుట్టినది.

**తాత్పర్యము :** సూర్యుఁడుదయించినంతనే పద్మములు వికసించును. వికసించిన పద్మములపై వ్రాలి తుమ్మెదలు మకరందమును గ్రోలి మదించును. కాఁబట్టి సూర్యకాంతి తుమ్మెదలకు సంతోషకారణమైనది. చక్రవాకమిథునములు రాత్రి విడిపోయి పగటివేళఁ గలియును. మగపక్షులనుండి విడిపోయి విరహాగ్నితో నుడుకుచున్న జక్కవపిట్టలకు సూర్యోదయము ప్రియసంగమము కలిగించి శోకమును బోఁగొట్టును. తమోగుణము గలవారికి సూర్యకాంతి పీడ కలిగించును. కంటి వెలుఁగు పోయినవారికి మఱలఁ గాంతినిచ్చి చూపుల ననుగ్రహించును. అటువంటి సూర్యకాంతి పొడుపుఁ గొండపైఁ బొడచూపినదని భావము.

**పుష్పంధయము : 'ధేట్ – పానే' 'ధేట్'** ధాతువునకుఁ బానము చేయుటయని యర్థము. 'పుష్పాణి ధయంతి' పూవుల యందలి తేనెను ద్రాగునవి యను నర్థమున **'పాఘ్రాధ్మా ధేట్ దృశః'(3–1–137)** అను సూత్రముచే ముమాగమము వచ్చి 'పుష్పంధయ' – అని యగును. తుమ్మెదయని యర్థము.

శ్రీరామచంద్రుఁ డడవిలో సీతనన్వేషించుచుఁ గనఁబడిన చెట్టులను; గుట్టలను; పుట్టలను; పశువులను, పక్షులను సీతను గూర్చి యడుగుచుండఁగా జక్కవ జంటలు శ్రీరామచంద్రునిఁ బరిహసించినవి. అప్పుడు రాముఁడు కోపించి 'మీకు రాత్రివేళల వియోగము కల్గుఁగాక!' యని శపించెను. అప్పటి నుండి కోకమిథునములు రాత్రి విడిపోయి పగలు కలిసికొనుచున్నవి.

(చక్రవాకీమివైకామ్ (మే.సం-2-20); వైద్యనాథునిందుకళావ్యాఖ్య - 209పుట)

ఈ శ్లోకములో 'ల్ల-ప' మొదలగు వర్ణములెక్కువ మాఱు లావృత్త మగుటచే **వృత్త్యనుప్రాసమను** శబ్దాలంకారము.

సూర్యకాంతి యందు - ఉల్లాసము, నిస్తారము, ఉత్పాతము, పక్షపాతము - అను లక్షణముల నారోపించుటచే రూపకాలంకారము. సూర్యకాంతి యని చెప్పకుండ నొకానొక కాంతి సమూహము - **కోఽపి ధామ్నాం సంఘాతః**' - అని చెప్పుటచే నతిశయోక్తి యలంకారము. 'విషయిణా విషయస్య నిగరణమతిశయః । తస్యోక్తిః' ॥ విషయి (ఉపమానము)చే విషయము (ఉపమేయము)ను గప్పి పెట్టి వర్ణించుట యతిశయము. అతిశయమైన యుక్తి యతిశయోక్తి యని రసగంగాధరము. ఉపమేయమును జెప్పకుండ నుపమానమును జెప్పి వస్తువును సూచించుట యతిశయోక్తి యని ఫలితము.

**విశేషము :** జగన్నాథుఁడు రసగంగాధరములో నీ శ్లోకమును రెండు మాఱు లుదాహరించినాఁడు.

(అ) సమప్రాధాన్యే తు మధ్యమతైవ - యథా -
ఉల్లాసః ఫుల్లపంకేరుహ ... ... ...

అత్ర వృత్త్యనుప్రాసప్రాచుర్యాదోజోగుణప్రకాశకత్వాచ్చ శబ్దస్య; ప్రసాదగుణయోగా-దనన్తరమేవాధిగతస్య రూపకస్య హేత్వలఙ్కారస్య వా వాచ్యస్య చమత్కృత్యోస్తుల్య-స్కన్ధత్వాత్ సమమేవ ప్రాధాన్యమ్.

ఇక్కడ వృత్త్యనుప్రాసప్రాచుర్యము, ఓజోగుణప్రకాశత్వము నుండుటచే శబ్దచమత్కారము; ప్రసాదగుణయోగముతో రూపకాలంకారముగాని, హేత్వలంకారము గాని వాచ్యముగా నుండుటచే నర్థచమత్కారము సమముగా నుండుటచే నిది మధ్యమ కావ్యమున కుదాహరణము.

మమ్మటాది ప్రాచీనాలంకారికులు (1) ఉత్తమము (2) మధ్యమము (3) అధమము నని కావ్యమును మూఁడు విధములుగా విభజించినారు. రసగంగాధరములో జగన్నాథపండితరాయలు మాత్రము (1) ఉత్తమోత్తమము (2) ఉత్తమము (3) మధ్యమము (4) అధమము నని కావ్యమును నాలుగు విధములుగా విభజించినాఁడు.

**(1) శబ్దార్థౌ యత్ర గుణీభావితాత్మానౌ కమప్యర్థమభివ్యంక్తస్తదాద్యమ్'** – శబ్దార్థములు రెండు నప్రధానములై చమత్కారాత్మకమైన యొకానొక యనిర్వాచ్యమైన యర్థమును వ్యంగ్యమర్యాదచే వ్యక్తము చేయునో యది యుత్తమోత్తమ కావ్యము.

**(2) 'యత్ర వ్యంగ్యమప్రధానమేవ సచ్చమత్కారకారణం తద్ద్వితీయమ్'** – ఎక్కడ వ్యంగ్య మప్రధానమై చమత్కారము ప్రధానముగా నుండునో యది యుత్తమ కావ్యము.

**(3) 'యత్ర వ్యంగ్యచమత్కారాసమానాధికరణో వాచ్యచమత్కారస్తతృతీయమ్'** – ఎక్కడ వ్యంగ్యచమత్కారము కంటె వాచ్యచమత్కారము ప్రధానముగా నుండునో యది మధ్యమకావ్యము.

**(4) 'యత్రార్థచమత్కృత్యుపస్కృతా శబ్దచమత్కృతిః ప్రధానం తదధమం చతుర్థమ్'** – ఎక్కడ నర్థచమత్కారము కంటె శబ్దచమత్కారమే ప్రధానముగా నుండునో యది యధమకావ్యము. ఇక్కడ నర్థచమత్కారము పూర్తిగా శబ్దచమత్కారములో లీనమై శబ్దచమత్కారమే ప్రధానముగా భాసించును.

(5) ఈ నాలుగు విభాగములే కాక యేకాక్షరి, ద్వ్యక్షరి మొదలగు పద్యములు, యమకములు, పద్మబంధము మొదలగు చిత్రకవిత్వము నధమాధమకావ్యమని జగన్నాథుని సిద్ధాంతము.

**'యత్రార్థ చమత్కృతి సామాన్యశూన్యా శబ్దచమత్కృతిస్తత్పఞ్చమ–మధమాధమమపి కావ్యవిధాసు గణయితుముచితమ్'** – ఎక్కడ నర్థ చమత్కారము కొంచెము కూడ లేక కేవలము శబ్దచమత్కారమే యుండునో యది యధమాధమ కావ్యము.

ఈ కావ్యవిభాగములో 'ఉల్లాసః ఫుల్ల...' అను శ్లోములో శబ్దచమత్కారము, నర్థచమత్కారము సమానముగా నుండుటచే నిది మధ్యమకావ్యమే.

(అ) ఈ శ్లోకమే రసగంగాధరమునందలి రూపకాలంకారప్రకరణములో నుదాహరింపఁ బడినది.

ఉల్లాసః ఫుల్లపఙ్కేరుహ... ... ..

అత్రోపమేయ ఉపమానస్య నారోపః । అపి తు కారణే కార్యస్యేతి రూపకం న భవతీతి ప్రాఞ్చః । ఏతన్మతానుసారేణైవాస్మాభిరపి లక్షితమ్ । ఉచ్ఛృఙ్ఖలాః పునరారోపమాత్రం రూపకం వదన్త ఇహాపి రూపకమేవాచక్షత ఇతి ప్రాగేవ నిరూపితమ్ ॥ ఇక్కడ నుపమేయమునం దుపమాన మారోపింపఁ బడలేదు. కాఁబట్టి యిక్కడ రూపకాలంకారము లేదని ప్రాచీనులు చెప్పుచున్నారు. ప్రాచీనుల మతము ననుసరించియే మేమును లక్షణము చెప్పినాము. సంకెళ్ళులేక నిరంకుశులుగా నున్న యాధునికులారోప మాత్రమే రూపకమని యిక్కడ రూపకాలంకారము చెప్పుచున్నారు. ఇక్కడ హేత్వలంకారమని ప్రాచీనుల మతము. ఇదియే జగన్నాథునకుఁ గూడ సమ్మతము.

అది యట్లుండనిండు. ఈ శ్లోకము మయూరుని సూర్యశతకములోనిదని రసగంగాధర – హిందీ చంద్రికావ్యాఖ్యాతలగు మదనమోహనపండితులు చెప్పుట కేవలము ప్రామాదికము.

శ్లో॥ నిర్మాయ నూతనముదాహరణానురూపం
కావ్యమ్ మయాత్ర నిహితం న పరస్య కిఞ్చిత్ ।
కిం సేవ్యతే? సుమనసామ్ మనసాఽపి గన్ధః
కస్తూరికాజననశక్తిభృతా మృగేణ ॥

'ఈ రసగంగాధరములోని లక్షణముల కన్నింటికి నుదాహరణానురూపములైన శ్లోకముల నన్నింటిని నేనే రచించి చూపుచున్నాను గాని యితరకవుల శ్లోకములను గైకొనను. కస్తూరిని సృష్టింపఁగల జవాదిపిల్లి పూలవాసనను మనస్సుతోనైన నాఘ్రాణించునా?' – యను జగన్నాథకవి ప్రతిజ్ఞకు విరోధము. రసగంగాధరము నందలి యుదాహరణ శ్లోకములన్నియు జగన్నాథకవి సొంతముగా రచించినవే. విమర్శించుటకు మాత్రమే పరుల శ్లోకములను గైకొనినాఁడు. కాఁబట్టి 'ఉల్లాసః ఫుల్ల పఙ్కేరుహ... ... అనునది జగన్నాథకవి సుధాలహరీ శ్లోకమే కాని మయూరమహాకవి సూర్యశతకశ్లోకము గాదు.

ఈ స్తోత్రకావ్యము నందలి పద్యములన్నియు స్రగ్ధరావృత్తములు. **'మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిముని యతియుతా స్రగ్ధరా కీర్తనీయా'** అని కేదారభట్టు వృత్తరత్నాకర లక్షణము.

స్రగ్ధరా వృత్తములోఁ బ్రతిపాదమునందును **'మ-ర-భ-న-య-య-య'** - యను గణములుండును.

**2**

**అవతారిక :** ఈ శ్లోకమునుండి 7వ శ్లోకము వఱకు సూర్యకిరణములనే వర్ణించు చున్నాఁడు -

**శ్లో॥ పద్మద్రోహోద్ధురాణాం ధవళితహరితామైన్దవీనాం ద్యుతీనాం**
**దర్పం ద్రాగ్ద్రావయన్తో విదలదరుణిమోద్రేకదేదీప్యమానాః ।**
**దూరాదేవాన్ధకారాన్ధితధరణితలద్యోతనే బద్ధదీక్షా-**
**స్తే దైన్యధ్వంసదక్షా ముదముదయదినోద్వేలదుస్రా దిశన్తు ॥** ౨

**ప్రతిపదార్థము :** పద్మద్రోహ + ఉద్ధురాణామ్ = పద్మములకు ద్రోహము చేయుటలో దట్టమైనవి; ధవళిత = తెలుపుగాఁ జేయఁబడిన; హరితామ్ = దిక్కులు గల; **'దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చ తాః'** - అని యమరము. ఐందవీనామ్ = చంద్రసంబంధమైన; ద్యుతీనామ్ = కాంతులయొక్క; అనఁగా వెన్నెలలయొక్క; **'హిమాంశుశ్చన్ద్రమాశ్చన్ద్ర ఇన్దుః కుముదబాన్ధవః', 'శోభా కాంతిర్ద్యుతిశ్ఛవిః'** అని యభయత్ర యమరము; దర్పమ్ = గర్వమును; ద్రాక్ = వెంటనే; ద్రావయంతః = నీరుకార్చునవి - పోఁగొట్టునవి; విదలత్ = వికసించుచున్న; అరుణిమ = ఎఱ్ఱని కాంతియొక్క; ఉద్రేక = విజృంభణముచే; దేదీప్యమానాః = బాగుగాఁ బ్రకాశించునవి; దూరాత్ + ఏవ = దూరముగా నుండియే; అంధకార = చీఁకటిచే; అంధిత = గ్రుడ్డిగాఁ జేయఁబడిన; ధరణితల = భూభాగమును; ద్యోతనే = ప్రకాశింపఁ జేయుటలో; బద్ధదీక్షాః = దీక్షావ్రతమును బూనినవి; దైన్య = భక్తులయొక్క దీనత్వమును; ధ్వంస = నాశనము చేయుటలో; దక్షాః = సమర్థములైనవి యగు; తే = ఆ; ఉదయదిన = తెల్లవాఱు సమయమునందు; ఉద్వేలత్ = గొప్ప యాధిక్యము నొందుచున్న; ఉస్రాః = (సూర్య) కిరణములు; **'కిరణోస్రమయూఖాంశుగభస్తిఘృణిఘృష్టయః'** - అని యమరము. ముదమ్ = సంతోషమును; 'ముత్ ప్రీతిః ప్రమదో హర్షః' - అని యమరము. దిశతు = ఇచ్చుఁగాక!

**తాత్పర్యము :** సూర్యుఁడు పద్మినీ వల్లభుఁడు. సూర్యుఁడుదయించినంతనే పద్మములు వికసించును. చంద్రుఁడుదయించినంతనే పద్మములు ముడుచుకొనిపోవును. పద్మములు

ముకుళించుకొనునట్టు చేయుటలో సమర్థములైనవి; దిక్కులను దెల్లcగాc జేయునవి యగు చంద్రుని కాంతుల గర్వమును వెంటనే యణcచివేయునవి; వ్యాపించుచున్న యెఱ్ఱతనముయొక్క యతిశయముచే మిక్కిలి ప్రకాశించునవి; చీcకట్లలముకొనుటచే గ్రుడ్డితనముతోనున్న భూతలమును వెలుcగులతోc బ్రకాశింపcజేయు వ్రతమును గైకొన్నవి, దీనులయొక్క శోకమును బటాపంచలు చేయుటలో నిపుణములైనవి, ప్రభాతకాలమునందుc బ్రసరించుచున్నవి యగు నా సూర్యకిరణములు మీకు మోదమును గల్గించుcగాక!

సూర్యుcడు పద్మములకు మిత్త్రుcడు. కలువలకు శత్రువు. చంద్రుcడు కలువలకు మిత్త్రుcడు. పద్మములకు శత్రువు. కాcబట్టి సూర్యకిరణములు పద్మద్రోహి యగు చంద్రునియొక్క కాంతుల గర్వము నణcగ ద్రొక్కుచున్నవని భావము.

ఈ శ్లోకములో దకార – ధకారములు రెండు పెక్కుమాఱులు వచ్చుటచే వృత్త్యనుప్రాసము. 'దీక్షాః దక్షాః' – అనుచోట నంత్యానుప్రాసము.

ఇది మయూరుని యీ క్రింది శ్లోకమున కనుకరణము.

శ్లో॥ సాద్రిద్యూర్వీనదీశా దిశతి దశదిశో దర్శయన్ ద్రాగ్ దృశో యః
సాదృశ్యం దృశ్యతే నో సదశశతదృశి త్రైదశే యస్య దేశే ।
దీప్తాంశుర్వః స దిశ్యాదశివయుగదశాదర్శితద్వాదశాత్మా
శం శాస్తృశ్వాంశ్చ యస్యాశయవిదతిశయాద్దందశూకాశనాద్యః ॥
(సూ.శ–94)

**3**

**అవతారిక :** కిరణవర్ణనము –

**శ్లో॥ త్రాతామీవార్తలక్షాః ప్రతిదినవిహితానేకగీర్వాణరక్షా**
**భక్తానాం కల్పవృక్షాః స్ఫురదనలగతస్వర్ణభాసాం సదృక్షాః ।**
**లోకక్షేమాత్తదీక్షా నలినపరిషదాం దత్తసౌభాగ్యలాక్షా**
**దుర్వృత్తధ్వంసదక్షా మమ రవికిరణాః సన్త్వఘానాం విపక్షాః ॥** 3

**ప్రతిపదార్థము :** త్రాత = రక్షింపcబడిన; అమీవా = రోగముచే; ఆర్త = దుఃఖము నొందిన వారియొక్క; లక్షాః = లక్షల సంఖ్యలు గలవి; ప్రతిదిన = నిత్యము; విహిత=

చేయఁబడిన; అనేక = ఎక్కువ సంఖ్యగల; గీర్వాణ = దేవతలయొక్క; రక్షాః = రక్షణము గలవి; భక్తానామ్ = భక్తులకు; కల్పవృక్షాః = ఏది కోరిన దానినిచ్చు కల్పవృక్షములైనవి; స్ఫురత్ = వెలుఁగుచున్న; అనల = నిప్పులో; గత = ఉంచఁబడిన – నిప్పులోఁ గాల్చిన; స్వర్ణ = బంగారముయొక్క; భాసామ్ = కాంతులతో; సదృక్షాః = సమానములైనవి; లోక = లోకమునందలి సమస్తజనులకు; **'లోకస్తు భువనే జనే'** – అని యమరము. క్షేమ = కుశలము గూర్చుటలో; ఆత్త = పొందిన; దీక్షాః = దీక్ష గలవి; నలినపరిషదామ్ = పద్మసమూహములకు – పద్మినులకు; దత్త = ఈఁబడిన; సౌభాగ్య = మంగళప్రదమైన; లాక్షాః = లత్తుక పూఁత గలవి; పద్మినీ కాంతల కాళ్ళకు సౌభాగ్యసూచకముగా లాక్షారసమును బారాణిపూఁతగాఁ బూసినట్లున్నవి; దుర్వృత్త = దుష్టశీలురను; ధ్వంస = నాశనము చేయుటలో; దక్షాః = సమర్థములైనవి యగు; రవికిరణాః = సూర్యకిరణములు; మమ = నాయొక్క; అఘానామ్ = పాపములకు; విపక్షాః = శత్రువులై; సంతు = ఉండుఁగాక!

**తాత్పర్యము :** రోగములతో దుఃఖించెడు లక్షల మంది యార్తులను సంరక్షించునవి, ప్రతిదినము ముప్పదిమూఁడు కోటుల దేవతలను రక్షించునవి, భక్తులకుఁ గల్పవృక్షములై యేది కోరిన దాని నిచ్చునవి, పుటము పెట్టిన బంగారు కాంతులతో సమముగా మెఱయునవి, లోకములకు క్షేమమును గల్గించుటయే వ్రతముగాఁ గలవి; పద్మినుల పాదములకు సౌభాగ్యసూచకముగా లక్క రంగును ప్రసాదించునవి, దుశ్శీలురను నాశనము చేయుటలో సమర్థములైనవి యగు సూర్యుని కిరణములు నా పాపములకు శత్రువులగుఁగాక! నాయొక్క పాపములను బోఁగొట్టుఁగాక! యని భావము.

దుర్వృత్తధ్వంసదక్షాః – పరద్రవ్యముల నపహరించు చోరులు, పరస్త్రీలను బాడుచేయు జారులు చీఁకటి యందే విజృంభించి వెలుఁగు వచ్చినంతనే దాఁగియుందురు. కావున సూర్యకిరణములు దుర్వృత్తధ్వంసదక్షములైనవి. అందువల్లనే పోతనగారు –

కం॥ దురితము తలఁపరు గానరు
జరుగుదు రెటకైన నిమిషసౌఖ్యంబునకై
పరవనితాసక్తులకును
బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే? (భాగ–9స్క–310)

అని యుపదేశించినారు. పరవనితాసక్తి వలన రావణుఁడు నశించినాఁడు. పరధన–

రక్తివలన దుర్యోధనుఁడు నశించినాఁడు. మానవుల కివి రెండును గూడవని రామాయణ – భారతముల ప్రధానోపదేశము.

ఈ శ్లోకములో సర్వత్ర 'లక్షాః – రక్షాః – వృక్షాః ...' అని యీవిధముగా నంత్యవర్ణము సమానముగా వచ్చుటచే నంత్యానుప్రాసము.

**విశేషము :** అమీవ – ఇది వైదికపదము. అమీవ – త్రి. అమ+వన్. ని. ఈడాగమః। రోగే॥ అని వాచస్పత్యములో నన్నియు వైదికోదాహరణములే చూపఁబడినవి. అమరకోశమువంటి లౌకికనిఘంటువులలోనీ పదము లేదు. 'అమీవేన = పాపేన, రోగేణ వా' – అని కావ్యమాలా టిప్పణి.

**4**

**అవతారిక :** కిరణవర్ణనము.

**శ్లో॥ ప్రాలేయానాం కరాలాః కవలితజగతీమణ్డలధ్వాంతజాలా–**
**స్త్రాతస్వర్లోకపాలా విదలదరుణిమక్షిప్తబాలప్రవాలాః ।**
**విశ్లిష్యత్ కోకబాలాజ్వరహరణభవత్కీర్తిజాలైర్జటాలా**
**వ్యోమవ్యాప్తౌ విశాలాస్త్వయి దధతు శివమ్ భాస్వతో భానుమాలాః॥** ౪

**ప్రతిపదార్థము :** ప్రాలేయానామ్ = మంచుగడ్డలకు; **'అవశ్యాయస్తు నీహారస్తుషార స్తుహినం హిమమ్ । ప్రాలేయమ్ మిహికాచ'** – అని యమరము. కరాలాః = భయంకరమైనవి; కవలిత = కబళింపఁబడిన; జగతీ మండల = విశ్వగోళముల యందలి; ధ్వాంత = చీఁకటుల; జాలాః = సమూహములు గలవి; త్రాత = రక్షింపఁ బడిన; స్వః + లోకపాలాః = స్వర్గలోక పాలకులు – ఇంద్రుఁడు మొదలగు దిక్పాలకులు గలవి; విదలత్ = ప్రసరించుచున్న; అరుణిమ = ఎఱ్ఱఁదనముచే; క్షిప్త = దూరముగాఁ ద్రోయఁబడిన; బాలప్రవాలాః = చిన్నచిన్న పగడములు గలవి; లేక = లేఁజిగుళ్ళు గలవి; విశ్లిష్యత్ = విడిపోవుచున్న; కోకబాలా = చక్రవాకస్త్రీలయొక్క; జ్వర = దేహతాపమును; హరణ = హరించుటవలన; భవత్ = కలిగిన; కీర్తిజాలైః = యశస్సమూహములచే; జటాలాః = దట్టమైనవి; వ్యోమవ్యాప్తౌ = ఆకాశమం దంతట వ్యాపించుటలో; విశాలాః = విరివియైనవి యగు; భాస్వతః = సూర్యునియొక్క; భానుమాలాః = కిరణమాలికలు; త్వయి = నీయందు; శివమ్ = శుభమును; దధతు = ఉంచుఁగాక!

**తాత్పర్యము :** గట్టిగాఁ బేరుకొనిపోయిన మంచుగడ్డలకు భయంకరమైనవి యనఁగా మంచురాళ్ళను నీళ్ళగాఁ గరఁగించునవి, లోకములందలి చీఁకటిగుంపులను కడిముద్దలుగాఁ జేసికొని తినునవి, స్వర్గలోకపాలకులను రక్షించునవి, మిక్కిలి యెఱుపు రంగుచేఁ జిన్నచిన్న పగడములను, లేఁత చిగుళ్ళను గూడ జయించునవి, జక్కవ పిట్టల విరహతాపమును బోఁగొట్టుట వలన వచ్చిన దట్టమైన కీర్తిగలవి, యాకాశము నిండ విరివిగా వ్యాపించునవి యగు సూర్యుని కిరణమాలికలు నీయందు (ఈ స్తోత్ర పాఠకుఁడగు భక్తునియందు) మంగళము నుంచుఁగాక!

స్వర్గలోకపాలకులనఁగా నష్టదిక్పాలకులు.

శ్లో॥ ఇంద్రో వహ్నిః పితృపతిర్నైర్ఋతో వరుణో మరుత్।
కుబేర ఈశః పతయః పూర్వాదీనాం దిశాం క్రమాత్॥ అని యమరము.

(1) తూర్పునకు – ఇంద్రుఁడు (2) ఆగ్నేయమునకు – అగ్ని (3) దక్షిణమునకు – యముఁడు (4) నైరృతికి – నిరృతి (5) పడమరకు – వరుణుఁడు (6) వాయవ్యమునకు – వాయుదేవుఁడు (7) ఉత్తరమునకు – కుబేరుఁడు (8) ఈశాన్యమునకు – ఈశానుఁడు – వరుసఁగా దిక్పతులు.

ఈ దిక్పాలకులను గూడ రక్షించునవి సూర్యకిరణములు.

ఈ శ్లోకములో – కరాలాః – జాలాః – పాలాః – అని యన్నిచోట్ల నంత్యాక్షరములు సమానముగా నుండుటచే నంత్యానుప్రాసము.

శ్రీరామచంద్రుని శాపముచే రాత్రివేళల జక్కవ జంటలు విడిపోవుట ప్రథమ–శ్లోకమునందే చెప్పఁబడినది.

జగన్నాథునకు 'జటాల' శబ్దముపై మక్కువ యెక్కువ.

శ్లో॥ సరణిశ్రేణి జటాలజానుకమ్. (వి.ల–49)
శ్లో॥ జటాలం తే జంఘాయుగలమఘభంగాయ భవతు. (ల.ల–14)
శ్లో॥ క్రూరక్లేశమహీరుహోమురుభరజ్వాలా జటాలః శిఖీ (భా.వి–శా.వి–8)
శ్లో॥ దుర్నీతిం తవ వీక్ష్య కోపదహన జ్వాలా జటాలోఽపి సన్. (భా.వి–శా.వి–25)

జటాలము = జడలు గట్టినది, బలిసినది.

**5**

**అవతారిక :** కిరణవర్ణనము –

**శ్లో॥ నిర్భిద్య క్ష్మారుహాణామతిఘనముదరం యేషు గోత్రాం గతేషు**
**ద్రాఘిష్ఠస్వర్ణదణ్డభ్రమభృతమనసః సన్నిధత్సన్తి పాదాన్ ।**
**యైః సమ్భిన్నే దలాగ్రప్రచలహిమకణే దాడిమీబీజబుద్ధ్యా**
**చఞ్చూచాఞ్చల్యమఞ్చన్తి చ శుకశిశవస్తేఽంశవః పాన్తు భానోః॥** ౫

**ప్రతిపదార్థము :** క్ష్మారుహాణామ్ = చెట్లయొక్క; అతిఘనమ్ = మిక్కిలి దట్టమైన; ఉదరమ్ = కడుపును; నిర్భిద్య = బాగుగా ఛేదించి; యేషు = ఏ కిరణములు; గోత్రామ్ = భూమిని; గతేషు = వెళ్ళినవి కాఁగా; ద్రాఘిష్ఠ = మిక్కిలి పొడవైన; స్వర్ణదండ = బంగారు కఱ్ఱలను; భ్రమ = భ్రాంతితో; భృత = నిండిన; మనసః = మనస్సు కలవై – దీనికి శుకశిశువులతో నన్వయము. పాదాన్ = కాళ్ళను; సన్నిధత్సంతి = మోపుచున్నవో; యైః = ఏ కిరణములచే; సంభిన్నే = విడఁదీయఁబడిన; దల = ఆకుల; అగ్ర = చివరి భాగములందు; ప్రచల = కదలుచున్న; హిమకణే = మంచు బిందువునందు; ఇది జాత్యేకవచనము. మంచు బిందువులందని యర్థము. దాడిమీ–బీజబుద్ధ్యా = దానిమ్మగింజ యనెడు తలఁపుతో; ఇక్కడఁగూడ దానిమ్మగింజలని యర్థము. చంచూ = ముక్కులయొక్క; చాంచల్యమ్ = కదలికలను; శుకశిశవః = చిలుకపిల్లలు; అంచంతి = ఉంచుచున్నవో; తే = అట్టి; భానోః = సూర్యునియొక్క; అంశవః = కిరణములు; పాంతు = రక్షించుఁగాక! (అస్మాన్ = మమ్ములనని శేషము).

**తాత్పర్యము :** చిలుకలు దండెములపై వ్రాలుట; దానిమ్మ గింజలను ముక్కులతోఁ బొడుచుకొని తినుట లోకప్రసిద్ధమైన విషయములు. ఉదయించుచున్న సూర్యుని కిరణములు, కొమ్మలతో నాకులతో దట్టముగా నున్న చెట్ల మధ్యభాగములో సందుచేసికొని దూఱి భూమిపైఁ బడుచున్నవి. ఆ చెట్ల నడిమిభాగమునఁ బడుచున్న సూర్యకిరణములను బొడవైన బంగారు దండములుగా భావించి వానిపై వ్రాలుటకై చిలుకపిల్లలు కాళ్ళనానుచున్నవి. ఆ యెఱ్ఱని కిరణములు చెట్ల యాకుల కొనభాగము లందు వ్రేలాడుచున్న మంచుబిందువులపైఁ బడినవి. ఆ కిరణముల యెఱ్ఱని కాంతులలో మెఱయుచున్న మంచుకణములను జూచి దానిమ్మగింజలని భ్రాంతిపడి తినుటకై చిలుకపిల్లలు ముక్కులు సాచి నోళ్ళు తెఱచి పట్టుకొనుచున్నవి. అట్లు చెట్లపై నెఱ్ఱగాఁ బ్రసరించుచున్న సూర్యుని కిరణములు మమ్ములను రక్షించుఁగాక!

ఇక్కడఁ జెట్ల కొమ్మల సందులనుండి భూమిపైఁ బడుచున్న సూర్యుని యెఱ్ఱని కిరణములను జూచి స్వర్ణదండములని; యెఱ్ఱని కిరణములు పడిన మంచుబిందువులను జూచి దానిమ్మ గింజలని చిలుకపిల్లలు భ్రాంతిపడుటచే **భ్రాంతిమంతమలంకారము**.

శ్లో॥ స్యాత్ స్మృతిభ్రాంతిసందేహైస్తదేవాలంకృతిత్రయమ్ ।
అయమ్ ప్రమత్తమధుపస్త్వన్ముఖం వేత్తి పంకజమ్ ॥ (చంద్రా. 5-32)

ఒక వస్తువును జూచి మఱియొక వస్తువుగా భ్రమించుట భ్రాంతి. ఈ మదించిన తుమ్మెద నీ ముఖమును బద్మమనుకొనుచున్నది. - అని చంద్రాలోకము.

శ్లో॥ పలాశముకులభ్రాంత్యా శుకతుండే పతత్యలిః ।
సోఽపి జంబూఫలభ్రాంత్యా తమలిం ధర్తుమిచ్ఛతి ॥

మోదుగ మొగ్గయను భ్రాంతిచేఁ దుమ్మెద చిలుకముక్కుపై వ్రాలుచున్నది. ఆ తుమ్మెదను జూచి నేరేడుపండను భ్రాంతితోఁ జిలుక పట్టుకొనుచున్నది - అని కువలయానందోదాహరణము.

ఈ భ్రాంతి పశుపక్ష్యాదిగతమై యుండునని రసగంగాధరము. అథ భ్రాంతిమాన్ - సదృశే ధర్మిణి తాదాత్మ్యేన ధర్మ్యంతర ప్రకారకోఽనాహార్యో నిశ్చయః। సాదృశ్యప్రయోజ్యశ్చమత్కారీ ప్రకృతే భ్రాంతిః । సా చ పశుపక్ష్యాదిగతా యస్మిన్ వాక్యసందర్భే స భ్రాంతిమాన్ ॥

ఈ యలంకారము పేరు భ్రాంతియే కాని భ్రాంతిమంతము కాదని రసగంగాధరము.

అత్ర చ భ్రాంతిమాత్రమలంకారః । భ్రాంతిమానలంకార ఇతి వ్యవహారస్త్వౌపచారికః ।

ఈ సుధాలహరీ శ్లోకము రసగంగాధరములో **నర్థశక్తిధ్వని**ప్రకరణములో నుదాహరింపఁబడినది.

యథా వా - నిర్భిద్య క్ష్మారుహాణామ్ .... .... ....

అత్ర భ్రాంతిభృతాం తిరశ్చామప్యేవమానందం జనయతీతి జగదానందహేతు ర్భగవానితి వ్యజ్యతే। ఏవంభూతాయా భ్రాంతేర్లోకేఽపి సంభవాత్ స్వతః సంభవిత్వమ్॥

ఇక్కడ భ్రాంతి నొందిన పశుపక్ష్యాది తిర్యక్కులకుఁ గూడ నానందము గలిగించు సూర్యభగవానుఁడు జగదానంద హేతువను విషయము ధ్వనించుచున్నది. ఇది యర్థశక్తిమూలకమగు ధ్వని. స్వతఃసంభవి.

ఇక్కడ **నాగేశభట్టు** – చెట్టు కొమ్మల సందులనుండి పడుచున్న సూర్య కిరణములను స్వర్ణదండములని భ్రమించి జనులు పాదములుంచుచున్నారని **మర్మప్రకాశములో** వ్యాఖ్యానించినాఁడు. ఇది సమంజసమైన యర్థము కాదు. ఎఱ్ఱని సూర్యకిరణములను జూచి స్వర్ణదండములని; యెఱ్ఱ కాంతులు పడిన మంచుబిందువులను జూచి దాడిమీ బీజములని భావించినవి చిలుకపిల్లలే. రెండు విషయములకుఁ గర్తలు శుకశిశువులే. శ్లోకములో జనులను మాటలేదు. లోకములో సామాన్యజనులు కూడ సూర్యకిరణములను జూచి స్వర్ణదండములని భ్రాంతి పొందుట యసంభవము. ఈ నాగేశవ్యాఖ్యను సరళా టిప్పణీ కర్తలగు **మంజునాథ** (మధురానాథ) శాస్త్రిగారు బహుధా దూషించినారు. భట్టనాగేశుఁడు సుధాలహరికిఁ గూడ వ్యాఖ్య రచించినట్లు కొందఱు చెప్పుచున్నారు. అది యింతవఱకును బ్రకటింపఁ బడలేదు. ఇది విషయాంతరము.

ఈ శ్లోకములో **'సన్నిధత్సంతి'** యనుచోట **'హంత! ధిత్సంతి'** యని రసగంగాధరపాఠము. అప్పుడు 'హంత! = ఆశ్చర్యము' అని యర్థము.

**6**

**అవతారిక :** కిరణవర్ణనము.

**శ్లో॥ అహ్ని క్రీడోచితానాం సరసిరుహలసన్మన్దిరాణామ్ ప్రభాతే**
**ప్రోద్ఘాట్య ద్రాక్కపాటాన్యథ కుముదగృహాన్ ముద్రయన్తో విముక్తాన్ ।**
**సిఞ్చన్తః కిఞ్చ భూమీతలమఖిలమపి క్షుణ్ణకాశ్మీరనీరైః**
**పాయాసుః శ్రీసపర్యా విరచనపటవః పద్మబన్ధోః కరా నః ॥ ౬**

**ప్రతిపదార్థము :** (లక్ష్మీదేవికి); అహ్ని = పగటివేళ; క్రీడా + ఉచితానామ్ = క్రీడించుటకు యోగ్యములైన; సరసిరుహ = పద్మములనెడి; లసత్ = ప్రకాశించుచున్న; మందిరాణామ్ = గృహముల యొక్క; కపాటాని = కవాటములను (ఱేకులనెడు తలుపులను); ప్రభాతే = ప్రాతఃకాలమునందు; ద్రాక్ = శీఘ్రముగా; ప్ర + ఉద్ఘాట్య = బాగుగాఁ దెఱచిపెట్టి;

విముక్తాన్ = లక్ష్మిచే విడిచిపెట్టఁ బడిన; కుముదగృహాన్ = కలువలనెడి యిండ్లను; ముద్రయన్తః = మూసివేయునవి (ముకుళింపఁ జేయునవి); కిం చ = మఱియును; అఖిలమ్ = సమస్తమైన; భూమీతలమ్ అపి = భూమండలమును గూడ; క్షుణ్ణ = ముద్దగాఁ జేసి కలిపిన; కాశ్మీరనీరైః = కుంకుమపూల నీటిచే; సించంతః = తడుపుచున్నవి; శ్రీ = లక్ష్మీదేవియొక్క; సపర్యా విరచన = పూజ చేయుటలో; పటవః = చతురములైనవి యగు; పద్మబంధోః = సూర్యునియొక్క; కరాః = కిరణములు (చేతులు); 'బలిహస్తాంశవః కరాః' – అని యమరము. నః = మమ్ములను; పాయాసుః = రక్షించుఁగాక!

**తాత్పర్యము :** లక్ష్మీదేవి పద్మాలయ. పద్మములయందే క్రీడించునది. పద్మములు లక్ష్మీదేవికి విహారగృహములు. ఆమె కలువలనుండి వైతొలఁగును. అందువలన సూర్యకిరణములు పద్మగృహకవాటములను తెఱచి కుముదగృహముల తలుపులు మూయుచున్నది. గొప్పవారు వచ్చినప్పుడు, పండుగుదినములందు వీథులందుఁ గలయంపి చల్లి ముగ్గులు పెట్టుట లోకాచారము. లక్ష్మీదేవి బయటకు వచ్చుచున్నది గావున సూర్యకిరణములు కుంకుమపూవుల రసముతోఁ గలాపి చల్లినట్లుగా భూతలము నంతట నెఱ్ఱగాఁ జేయుచున్నవి. లక్ష్మీదేవి వికసించిన పద్మములనుండి బయటకు వచ్చినంతనే సూర్యుని కరములు (చేతులు – కిరణములు) ఆమెను భక్తితోఁ బూజించుచున్నవి. లక్ష్మీదేవి పద్మాలయ యైనట్లే సూర్యుఁడు పద్మబంధువు. అట్టి సూర్యుని కిరణములు మమ్ముఁ గాపాడుఁ గాక!

ఇక్కడ – లక్ష్మీదేవి పగటివేళలఁ బద్మముల యందు, రాత్రివేళలఁ గలువల యందు నివసించునని ప్రసిద్ధి – అని కావ్యమాలా టిప్పణిలోఁ గలదు.

రాత్రివేళలఁ గలువల యందు లక్ష్మి నివసించునని కవి భావించియుండఁడు. అప్పుడు కలువలను మూసివేయుట సంభవింపదు. లేదా రాత్రివేళలఁ గలువలలో నివసించిన లక్ష్మీదేవి పగటివేళలఁ గలువలను విడిచిపెట్టి ప్రభాతకాలములోఁ బద్మములందుఁ బ్రవేశించుచున్నదని చెప్పుకొనవలెను.

## 7

**అవతారిక :** కిరణవర్ణనము –

**శ్లో॥ ఆలేపా హిఙ్గులానామివ ధరణిభుజామచ్ఛసౌధాగ్రమౌలి–**
**ష్వగ్రేషు క్ష్మారుహాణామభినవవిదలత్పల్లవోల్లాసలీలాః ।**
**ప్రౌఢప్రాలేయపుఞ్జోపరి చితఖదిరాఙ్గారభారా ఇవారాత్**
**పారావారాత్ ప్రయాన్తో దినకరకిరణా మఙ్గలం నః కృషీరన్॥** ౭

**ప్రతిపదార్థము :** ధరణిభుజామ్ = మహారాజులయొక్క; అచ్ఛ = స్వచ్ఛమైన; సౌధ = మేడలయొక్క; అగ్రమౌళిషు = పైనున్న శిరోభాగములపై; హింగులానామ్ = ఇంగిలీకమను ద్రవ్యముల యొక్క; ఆలేపా ఇవ = పూఁతలవలె నున్నవి; క్ష్మారుహాణామ్ = చెట్లయొక్క; అగ్రేషు = పైభాగములపై; అభినవ = క్రొత్తగా; విదలత్ = చిగురించిన; పల్లవ = లేఁత చిగురుటాకులయొక్క; ఉల్లాస = ఆనందముతోఁ గూడిన; లీలాః = విలాసములైనవి; ప్రౌఢ = గట్టిపడిన; ప్రాలేయ = మంచుముక్కల; పుంజ = సమూహములయొక్క; ఉపరి = పైభాగములపై; చిత = సొదగాఁ బేర్చిన; ఖదిర + అంగార + భారాః + ఇవ = చంద్రనిప్పుల బారువులవలె, ఆరాత్ = దూరముగానున్న; పారావారాత్ = సముద్రమునుండి; 'సముద్రోఽబ్ధిరకూపారః పారావారస్సరిత్పతిః' – అని యమరము. ప్రయాంతః = వచ్చుచున్నవి యగు; దినకరకిరణాః = సూర్యుని కిరణములు; నః = మాకు; మంగళమ్ = భద్రమును; కృషీరన్ = చేయుఁగాక!

**తాత్పర్యము :** చక్రవర్తులుండు మేడల పైభాగముల యందున్న శిఖరములందు నింగిలీకపుఁ బూఁతలవలె నున్నవి; చెట్లయొక్క కొమ్మలపైఁ జిగుర్చుచున్న లేఁత చిగుళ్ళయొక్క సంతోషములకు విలాసములైనవి, పేరుకొని గట్టిపడిన మంచుగడ్డల సమూహములపైఁ బేర్చిన చంద్రనిప్పుల బారువులవలె నున్నవి, దూరముగానున్న సముద్రమునుండి వచ్చుచున్న సూర్యకిరణములు మాకు సమస్త మంగళముల నొసఁగుఁ గాక!

ఇక్కడ రాజసౌధముల కింగిలీకపు రంగు పూఁతలు పెట్టినట్లు, మంచుగడ్డలపై బరువైన చంద్రనిప్పులు పఱచినట్లు సూర్యకిరణములున్నవని కవి యూహించుటచే నుత్ప్రేక్షాలంకారము. చెట్ల పైభాగములపైఁ గిరణములు పల్లవోల్లాసలీలలై యున్నవని యారోపించుటచే రెండవ పాదమునందు రూపకాలంకారము.

భారమనఁగా బరువైనదనియే కాక యొక తూనిక – 'బారువు' అని కూడ నర్థము.

**ప్రాచీనకాలము నందలి తూనికలు**

| | |
|---|---|
| 1 వెండి రూపాయి యెత్తు | = 1 తులము |
| 30 తులములు | = 1 ఏబులము |
| 2 ఏబులములు | = 1 పదలము |
| 2 పదలములు | = 1 వీసె (120 తులములు) |
| 8 వీసెలు | = 1 మణుగు |
| 8 మణుగులు | = 1 పుట్టి |
| 20 మణుగులు | = 1 బారువు (భారము) |

'భారః స్యాద్విංశతిస్తులాః' – అని యమరకోశము.

20 తులములు = 1 భారము

ఇది యమరసింహుని కాలమునాఁటి మానము.

తులాపలశతం తాస్తు దశర్క్షం ధటికోఽ స్త్రియామ్

తౌద్వౌ శకటో భారః – అని వైజయంతీకోశము.

100 పలములు = 1 తుల

10 తులములు = 1 ధటికము

2 ధటికములు = 1 శకటభారము

ఇది యాదవప్రకాశుని కాలమునాఁటి మానము.

సూర్యుఁడు సత్రాజిత్తున కిచ్చిన శమంతకమణి ప్రతిదినము 8 భారముల బంగారము పెట్టెడిది.

శ్లో॥ దినే దినే స్వర్ణభారానష్టౌ స సృజతి ప్రభో! (భాగ–10స్క–56–11శ్లో) అని వ్యాసభాగవతము.

వ॥ అది ప్రతిదినంబును నెనిమిది బారువుల సువర్ణంబు గలిగించుచుండు. (భాగ–10స్క–ఉత్తర–51) అని పోతనగారి యాంధ్రభాగవతము. ప్రస్తుతము మన

సుధాలహరీ శ్లోకములో 'ఖదిరాంగారభారము' లనఁగా బారువుల కొలఁది నున్న చంద్రనిప్పుల గుండములని యర్థము. బరువైన చంద్రనిప్పులని సామాన్యార్థము.

**8**

**అవతారిక :** ఇప్పుడు సూర్యోదయమును వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ కీలాలైః కుఙ్కుమానాం నిఖిలమపి జగజ్జాలమేతన్నిషిక్తమ్**
**ముక్తాశ్చోన్మత్త భృఙ్గా విదలితకమలక్రోడకారాగృహేభ్యః ।**
**ఉత్సృష్టం గోసహస్రమ్ బహులకలకలః శ్రూయతే చ ద్విజానామ్**
**భాగ్యైర్బృన్దారకాణాం హరిహయహరితా సూయతే పుత్త్రరత్నమ్॥** ౮

**ప్రతిపదార్థము :** కుంకుమానామ్ = కుంకుమపూలయొక్క; కీలాలైః = రసములచే; ఏతత్ = ఈ; జగత్ + జాలమ్ = లోకముల సమూహము; నిఖిలమ్ + అపి = సమస్తము కూడ; నిషిక్తమ్ = తడుపఁబడినది; విదలిత = విచ్చుకొన్న; కమల = పద్మములయొక్క; క్రోడ = ఒడియనెడు; కారాగృహేభ్యః = చెఱసాల యిండ్లనుండి; ఉత్ + మత్త = బాగుగా మదించిన; భృంగాః = తుమ్మెదలు; ముక్తాః చ = విడిచి పెట్టఁబడినవి కూడ; గోసహస్రమ్ = కిరణముల సహస్రము లేక యావుల సహస్రము, వేల సంఖ్యలలో నున్న యావులని యర్థము. ఉత్ + సృష్టమ్ = విడువఁ బడినవి; ద్విజానామ్ = పక్షులయొక్క లేక బ్రాహ్మణులయొక్క; బహుల = మిక్కుటమైన; కలకలః = కలకలధ్వని లేక వేదధ్వని; శ్రూయతే చ = వినఁబడుచున్నది కూడ; బృందారకాణామ్ = దేవతలయొక్క; భాగ్యైః = భాగ్యములచే; హరిహయ = ఇంద్రునియొక్క; హరితా = దిక్కుచే - తూర్పు దిక్కుచే; పుత్త్రరత్నమ్ = రత్నమువంటి కొడుకు - సూర్యుఁడు; సూయతే = కనఁబడుచున్నాఁడు; ఈ శ్లోకమునందుఁ గర్మణి ప్రయోగము లెక్కువగా నున్నవి.

**తాత్పర్యము :** సూర్యోదయము కాఁగానే విశ్వమంతయు నెఱ్ఱగా నైనది. అది యెట్లున్నదనఁగాఁ గుంకుమపూవుల రసములో ముంచి తీసినట్లున్నది. రాత్రివేళల యందుఁ బద్మములలోఁ జిక్కుకొని తేనెత్రాగుటచే బాగుగా మదించిన కొదమతుమ్మెదలు పద్మముల మధ్యభాగములనెడి కారాగృహములనుండి విడిచిపెట్టఁబడి బైటకు వచ్చినవి. వేయి సూర్యకిరణములు విజృంభించినవి. వేల సంఖ్యలలో నున్న యావుల గుంపులు మేఁతకై బయలుదేరినవి. వెలుఁగు వచ్చినంతనే పక్షుల కలకలారావములు

మిన్నంటినవి. ప్రభాతవేళలో సంధ్యావార్చిన బ్రాహ్మణులయొక్క వేదపాఠధ్వనులు నలుదిక్కులఁ బ్రతిధ్వనించినవి. దేవతల పుణ్యములు పండుటవలనఁ దూర్పుదిక్కనెడు కాంత రత్నమువంటి సూర్యునిఁ బ్రసవించినది. ఇక్కడఁ 'గీలాల – కుంకుమ; జగజ్జాల, బహుల కలకల' అనుచోట వృత్త్యనుప్రాసము. సూర్యకిరణముల యెఱ్ఱని రంగు కుంకుమ రసములో ముంచినట్లుగా జగజ్జాలమున కంటినదని వర్ణించుటచేఁ దద్గుణాలంకారము.

శ్లో॥ తద్గుణః స్వగుణత్యాగాదన్యతః స్వగుణోదయః ।
పద్మరాగారుణం నాసామౌక్తికం తే౽ధరాశ్రితమ్ ॥ (చంద్రా. 5–102)

తన గుణము తన్ను విడిచిపెట్టి తక్కిన దానికి సంక్రమించినదని చెప్పినచోఁ దద్గుణాలంకారము. నీ ముక్కునందలి నత్తులో నున్న ముత్యము నీ పెదవి రంగుచే నెఱ్ఱనై కెంపుగా నున్నదని చంద్రాలోకము. కమల క్రోడములే కారాగృహములని చెప్పుటచే రూపకాలంకారము. గోశబ్దమునకు (1) కిరణము (2) ఆవునని రెండర్థములు.

'స్వర్గేషు పశువాగ్వజ్రదిఙ్నేత్రఘృణిభూజలే ।
లక్ష్యదృష్ట్యా స్త్రియామ్ పుంసి గౌః' – అని యమరకోశము.

ద్విజశబ్దమునకు (1) పక్షి (2) బ్రాహ్మణుఁడు నని రెండర్థములు.

'దంతవిప్రాండజా ద్విజాః' – అని యమరము.

కాఁబట్టి శ్లేషాలంకారము. ఇట్లు శబ్దార్థాలంకారములకు సంసృష్టి.

## 9

**అవతారిక :** ఇప్పుడు సూర్యప్రభను వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ యా సూతే సర్వభూతేష్వనుదినముదయే చేతనాయా విలాసాన్**
**యాన్తీ సాయం నికాయం జలనిధిజఠరం సంజరీహర్తి సద్యః ।**
**అత్యర్థం వర్ధయన్తీ మణిగణసుషమాసమ్పదం రత్నసానోః**
**సా నో భానోః ప్రభా నో నయనసరణితో దూరతో జాతు యాతు ॥** ౯

**ప్రతిపదార్థము :** యా = ఏది; సర్వభూతేషు = సకలభూతములయందు – సమస్త జీవులయందు; అనుదినమ్ = ప్రతిదినము; ఉదయే = సూర్యోదయకాలములో;

చేతనాయాః = చైతన్యముయొక్క; విలాసాన్ = లీలలను; సూతే = ప్రసవించుచున్నదో – పుట్టించుచున్నదో; యా = ఏది; సాయమ్ = సాయంకాలమునందు; నికాయమ్ = తన నివాసగృహమైన; జలనిధిజఠరమ్ = సముద్రగర్భమును; యాంతీ = ప్రవేశించినదై; సద్యః = వెంటనే; చేతనాయా విలాసాన్ = చైతన్యలీలలను; సంజరీహర్తి = ఎక్కువగా సంహరించుచున్నదో; యా = ఏది; రత్నసానోః = మేరుపర్వతముయొక్క; మణిగణ సుషమాసమ్పదమ్ = రత్నసమూహముల శోభాసంపత్తిని; అతి + అర్ధమ్ = మిక్కుటముగా; వర్ధయంతీ = వృద్ధిచేయుచున్నదో; సా = ఆ; భానోః = సూర్యునియొక్క; ప్రభా = కాంతి; నః = మాయొక్క; నయనసరణితః = కంటి మార్గమునుండి; దూరతః = దూరముగా; జాతు = ఎప్పుడును; 'కదాచిజ్జాతు' – అని యమరము. నో యాతు = వెళ్ళకుండుఁగాక!

**తాత్పర్యము :** సూర్యుఁడుదయించినంతనే ప్రతిదినము సర్వభూతములకుఁ జైతన్యము కలిగి సంచరించును. సాయంత్రము సూర్యుఁడు సముద్రములోనికిఁ బ్రవేశించి యస్తమించినంతనే లోకమంతయు నంధకార బంధురమగుటవలన సమస్త జీవకోటి చూపుకాని, వస్తుజ్ఞానముకాని, కదలిక కాని లేక నిద్రించును. మఱియు నిత్యము సూర్యుఁడు మేరుపర్వతమునకుఁ బ్రదక్షిణము చేయును గావున సూర్యకాంతులా బంగారు పర్వతముపైఁబడి యిందలి రత్నసమూహముల శోభనింకను వృద్ధి పొందునట్లు చేయును. అట్టి సూర్యుని కాంతి నా కంటి చూపుల దారినుండి యెప్పుడు దూరము కాకుండ నిలుచుఁగాక!

సమస్త జీవకోటికి జ్ఞానము సూర్యునివల్లనే కలుగుచున్నదనియు, సూర్యుఁడు లేనిచోఁ జైతన్యము కూడ నుండదనియు, సూర్యుని వల్లనే సమస్త వస్తువులు ప్రకాశించు చున్నవనియు నట్టి సూర్యకాంతి నా కంటికి వెలుఁగును బ్రసాదింప వలయుననియు భావము.

ఇక్కడ 'సానోః సానో', 'భానోః భానో', 'సరణితో – దూరతో', 'జాతు యాతు' – అను ప్రాసము పద్యమునకు ముక్తాయింపువలె నున్నది.

సంజరీహర్తి : హృఞ్ – హరణే (899) భ్వాది ధాతువు.

సమ్ పూర్వక హృఞ్ ధాతువునకు భృశార్థములో యఙ్ ప్రత్యయము చేరి **'సంజరీహర్తి'** – అను రూప మేర్పడును. ఎక్కువగా నాశనము చేయుచున్నదని యర్థము.

శ్లో॥ విశ్వేశం సచ్చిదానందం వందేఽహం యోఽఖిలం జగత్ ।
చరీకర్తి బరీభర్తి సంజరీహర్తి లీలయా ॥

అని శ్రీ భట్టోజీదీక్షితుల శబ్దకౌస్తుభమంగళశ్లోకము. మాధవాచార్యుఁడు (విద్యారణ్యస్వామి) మొదలగువారు లౌకికభాషయందుఁగూడ యఙ్లుగంత రూపములను వాడుట కంగీకరించిరి. ఇది మహాభాష్యకారులకు సమ్మతము గాదని పాయగుండే వైద్యనాథుఁడు **'శబ్దకౌస్తుభ - ప్రభావ్యాఖ్య'**లోఁ జెప్పినాఁడు. కాని కవులు, పండితులు యఙ్ లుగంతములను యథేచ్ఛముగా వాడుచున్నారు. వందల కొలఁది ప్రయోగములు గలవు.

సరణితః - పంచమ్యాస్తసిల్ (5-3-7) పంచమీవిభక్త్యర్థములో వచ్చిన 'తసిల్' ప్రత్యయము.

## 10

**అవతారిక :** మఱల సూర్యప్రభనే వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ నీహారైర్నీరజానాం నిబిడతమతమోరాశిభిర్లోచనానాం**
**శ్రౌతస్మార్తక్రియాణామపి ఖలు నిశయా నాశమాలక్ష్య దూరాత్ ।**
**సద్యః సిన్ధోః సకాశాదధికతరజవేనాగతా వాసవాశా-**
**మాశాపాశానశేషానపహరతుతరాం తీక్ష్ణభానోః ప్రభా నః ॥ ౧౦**

**ప్రతిపదార్థము :** నీహారైః = మంచుధారలచే; నీరజానామ్ = పద్మములయొక్క; నిబిడతమ = మిక్కిలి దట్టమైన; తమః + రాశిభిః = చీఁకటి గుంపులచేత; లోచనానామ్ = కన్నులయొక్క; శ్రౌత = శ్రుతుల (వేదముల)చే విధింపఁబడిన; స్మార్త = స్మృతుల (ధర్మశాస్త్రముల)చే విధింపఁబడిన; క్రియాణామ్ = కార్యకలాపములకు; ఖలు = నిశ్చయముగా; నాశమ్ = నాశనమగుటను; ఆలక్ష్య = ఆకళించి; ఈ **'నాశమాలక్ష్య'** యనునది మూఁడు వాక్యములకు నన్వయించును. దూరాత్ = దూరముగా నుండియే; సద్యః = వెంటనే; సింధోః = సముద్రముయొక్క; సకాశాత్ = దగ్గఱనుండి; అధికతర జవేన = మిక్కిలి వేగముతో; ఆగతా వాసవ + ఆశామ్ = తూర్పుదిక్కునకు వచ్చినదగు; తీక్ష్ణభానోః = వాఁడి వెలుఁగులు గల సూర్యునియొక్క; ప్రభా = కాంతి; నః = మాయొక్క; అశేషాన్ = సమస్తమైన; ఆశాపాశాన్ = ఆశలనెడి పాశములను; అపహరతు తరామ్ = ఎక్కువగా నపహరించుఁగాక!

**తాత్పర్యము :** మంచుధారలు బాగుగాఁ గురియుటచేఁ బద్మములు ముడుచుకొని వాడివత్తలగుచున్నవి. చీఁకటులెక్కువగాఁ గ్రమ్ముకొనుటచే సకల జీవుల నేత్రములు గ్రుడ్డివిగా నగుచున్నవి. సూర్యోదయము లేకపోవుటచే శ్రౌతయజ్ఞములు, స్మార్త యజ్ఞములు, సకల ధర్మములు నడుగంటుచున్నవి. ఈ విధముగాఁ బద్మములు, నేత్రములు, యజ్ఞాది క్రియలు నాశమొందుట దూరముగా నుండియే నిశ్చయముగాఁ బరికించి వెంటనే సముద్రసమీపమునుండి మిక్కిలి వేగముతోఁ దూర్పుదిక్కునకుఁ జేరుచున్న సూర్యునియొక్క కిరణములు మా యాశలనెడి త్రాళ్ళను బూర్తిగాఁ ద్రెంచుఁగాక!

మొదటి పాదములో 'నీ' వర్ణము, మూఁడు నాల్గు పాదములలో 'శా' వర్ణము నెక్కువగా వచ్చుటచే వృత్త్యనుప్రాసము. 'తమ–తమో' యనుచోట రెండేసి హల్లులర్థ భేదముతో నావృత్తమగుటచే ఛేకానుప్రాసము.

సూర్యకిరణములు తూర్పుదిక్కునకు వచ్చుటకుఁ బద్మముల, కన్నుల, యజ్ఞక్రియల నాశము కారణముగాఁ జెప్పుటచేఁ గావ్యలింగ మలంకారము.

శ్లో॥ **'సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్'** (కువలయా–121)

సమర్థింపఁదగిన యర్థమును సరియగు హేతువులతో సమర్థించినచోఁ గావ్యలింగాలంకారము. ఇక్కడ దూరముగా సముద్రప్రాంతమున నున్న సూర్యుని కిరణములు వేగముగాఁ దూర్పుదిక్కునకు వచ్చుట సమర్థనీయాంశము. నీరజములు, లోచనములు, శ్రౌతస్మార్తక్రియలు నాశమగుట హేతువు. లింగమనఁగా హేతువు. ఇట్లు శబ్దార్థాలంకారముల రెండింటికి సంసృష్టి.

అపహరతుతరామ్ = అతిశయార్థములో – **'తరప్'** ప్రత్యయము.

తరప్తమపౌ ఘః (1–1–22) అను సూత్రముచే **ఘసంజ్ఞ.**

కిమేత్తిఙవ్యయఘాదామ్వద్రవ్యప్రకర్షే (5–4–11) అను సూత్రముచే 'ఆము' ప్రత్యయము వచ్చి 'యపహరతుతరామ్' అయినది.

## 11

**అవతారిక :** ఇప్పుడు సూర్యభగవానుని వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ శీతే శోకం శశాఙ్కే కృశతమరుచితామాశు నాశం నిశాయాం**
**ధిక్కారం ధ్వాన్తవర్గే కుముదపరిషది ప్రోద్గమం దీనతాయాః ।**
**పాణ్డిత్యమ్ పుణ్డరీకేష్వనుదినమధికాం కాన్తిమాశాసు తన్వ–**
**న్నన్వఞ్చత్యన్వహం ద్యాముషసి కరుణయా విశ్వవన్ద్యో వివస్వాన్॥ ౧౧**

**ప్రతిపదార్థము :** ఈ శ్లోమునందలి వాక్యములకన్నింటికి – 'తన్వన్' విస్తరింపఁ జేయుచు – నను క్రియతో నన్వయము.

శీతే = చల్లఁదనమునందు; శోకమ్ = దుఃఖమును; శశాంకే = చంద్రుని యందు; కృశతమరుచితామ్ = కృశించిపోవు కాంతి కల్గి యుండుటను; నిశాయామ్= రాత్రియందు; ఆశు = వెంటనే; నాశమ్ = నశించిపోవుటను; ధ్వాంతవర్గే = చీఁకటుల సమూహములందు; ధిక్కారమ్ = తిరస్కరించుటను; కుముదపరిషది = కలువల సమూహమునందు; దీనతాయాః = దైన్యముయొక్క; ప్ర + ఉద్గమమ్ = పుట్టుకను; పుండరీకేషు = పద్మములయందు; పాండిత్యమ్ = వికాసమును; ఆశాసు = దిక్కులయందు; అధికామ్ = ఎక్కువయైన; కాంతిమ్ = వెలుఁగును; ఈ విధముగా; అనుదినమ్ = ప్రతిదినము; తన్వన్ = విస్తరింపఁజేయుచు; విశ్వవంద్యః = సమస్త జగత్తుచే నమస్కరింపఁబడు; వివస్వాన్ = సూర్యుఁడు; **'భాస్వద్వివస్వత్సప్తాశ్వ హరిదశ్వోష్ణరశ్మయః'** – అని యమరము. 'వివస్తే ప్రభయాచ్ఛాదయతీతి వివస్వాన్ – వస – ఆచ్ఛాదనే' తన కాంతిచే సమస్తమును గప్పువాఁడు వివస్వంతుఁడని గురుబాలప్రబోధిక. అను + అహమ్ = నిత్యము; కరుణయా = దయతో; ద్యామ్ = ఆకాశమును; అను + అంచతి = ఆరోహించుచున్నాఁడు.

**తాత్పర్యము :** సూర్యుఁడు చల్లఁదనమునకు దుఃఖమును విస్తరింపఁ జేయుచున్నాఁడు. సూర్యుఁడుదయించినంతనే శీతలము నశించును గాన శోకించుచున్నదని భావము. చంద్రునియందుఁ గాంతులు కృశించుటను విస్తరింపఁ జేయుచున్నాఁడు. సూర్యుఁ డుదయించినంతనే చంద్రుని వెన్నెలలు వెలవెలఁబోవు చున్నవని భావము. రాత్రికి నాశము విస్తరింపఁ జేయుచున్నాఁడు. సూర్యోదయమైనంతనే నిశావేళ నశించుచున్నదని భావము. చీఁకటుల సమూహమునందు సూర్యుఁడు ధిక్కారమును విస్తరింపఁ జేయు

చున్నాఁడు. సూర్యుఁడుదయించినంతనే కలువలు ముకుళించుకొనిపోవుచున్నవి గాన వానికి దైన్యమును విస్తరింపఁజేయుచున్నాఁడు. పుండరీకములందుఁ బాండిత్యమును విస్తరింపఁ జేయుచున్నాఁడు. పద్మములను వికసింపఁ జేయుచున్నాఁ డని భావము. దిక్కులయందు మిక్కుటమైన కాంతిని విస్తరింపఁ జేయుచున్నాఁడు. ఈ విధముగాఁ బ్రతిదినము విశ్వవంద్యుఁడగు వివస్వంతుఁడు లోకములపైనున్న కృపతో నాకాశముపై నధిరోహించి ప్రకాశించుచున్నాఁడు.

ఈ శ్లోకములో శవర్ణము మొదలగునవి యనేక పర్యాయములావృత్త మగుటచే వృత్త్యనుప్రాసము. 'తన్వన్' అను క్రియ శీతము, శశాంకుఁడు మొదలగు నన్ని పదార్థములలో సమానముగా నన్వయించుటచేఁ దుల్యయోగితాలంకారము.

శ్లో॥ క్రియాదిభిరనేకస్య తుల్యతా తుల్యయోగితా ।
సంకుచంతి సరోజాని స్వైరిణీ వదనాని చ ॥
ప్రాచీనాచలచూడాగ్రచుంబిబింబే సుధాకరే ॥ (చంద్రా. 5-52)

క్రియాదులచే ననేక పదార్థములకుఁ దుల్యత్వము చెప్పుట తుల్యయోగిత. చంద్రుఁ డుదయించినంతనే పద్మములు ముడుచుకొనుచున్నవి. జారకాంతల ముఖములు కూడ ముడుచుకొనుచున్నవి - అని చంద్రాలోకము. ఇట్లు శబ్దార్థాలంకారములు రెండింటికి సంసృష్టి.

**విశేషము :** ఈ శ్లోకములో - 'అనుదినము' అని; 'అన్వహము' - అని రెండు మాటలు వాడుట పునరుక్తి. అనుదినమను దానినే యన్నితావుల యందు నన్వయించు కొనవచ్చును.

## 12

**అవతారిక :** ఇప్పుడు సూర్యుని శుభము లిమ్మని ప్రార్థించుచున్నాఁడు -

**శ్లో॥ స్వాపం స్వాపాకులానాం గదమథ గదినామన్ధకారం త్రిలోక్యాః**
**పాపమ్ పాపావిలానాం సపది పరిహరన్నాగతో వాసవాశామ్ ।**
**నిత్యప్రస్థానలీలాకుపితకమలినీనర్మనిర్మాణకర్మా**
**విశ్వార్తిత్రాణధర్మా గగనమణిరసౌ పాతు శర్మానిశం వః ॥** ౧౨

**ప్రతిపదార్థము :** ఈ శ్లోకములోఁ 'బరిహరన్' (పరిహరించుచు) అనుక్రియ పూర్వార్థము

నందలి నాల్గు వాక్యములకు నన్వయించును. స్వాప = నిద్రచే; ఆకులానామ్ = వ్యాకులత్వము నొందిన జనులయొక్క; స్వాపమ్ = నిద్రను; పరిహరన్ = పోఁగొట్టుచు; అథ = ఇంకను; 'మంగళానంతరారంభ ప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ' – అని యమరము. గదినామ్ = రోగులయొక్క; గదమ్ = రోగమును; 'రోగవ్యాధిగదామయాః' – అని యమరము. పరిహరన్ = పోఁగొట్టుచు; త్రిలోక్యాః = స్వర్గ – మర్త్య – పాతాళములను మూఁడు లోకములయొక్క; అంధకారమ్ = చీఁకటిని; పరిహరన్ = పోఁగొట్టుచు; పాప + ఆవిలానామ్ = పాపములచేఁ గలఁత నొందిన జనులయొక్క; పాపమ్ = పాపమును; పరిహరన్ = పోఁగొట్టుచు; సపది = వెంటనే; 'స్రాగ్ఝటిత్యంజసాహ్నాయ ద్రాఙ్మంక్షు సపది ద్రుతే' – అని యమరము. వాసవ + ఆశామ్ = ఇంద్రుని దిక్కైన తూర్పునకు; ఆగతః = వచ్చినవాఁడును; నిత్య = ప్రతిదినము; ప్రస్థాన – లీలా = ప్రయాణ విహారములచే; కుపిత = కోపించిన; కమలినీ = పద్మినికి; నర్మనిర్మాణకర్మా = రత్యతిశయమును గలిగించు పరిహాస వాక్యములు పలుకుటయను వ్యాపారము గలవాఁడు; విశ్వ + ఆర్తి + త్రాణ ధర్మా = ఆర్తినొందిన జగత్తును రక్షించుటయే ధర్మముగాఁ గలవాఁడునగు; అసౌ = ఈ; గగనమణిః = ఆకాశమునకు మాణిక్యమైన సూర్యుఁడు; అనిశమ్ = ఎల్లప్పుడు; శర్మా = ఆనందమును గూర్చువాఁడై; వః = మిమ్ము; పాతు = రక్షించుఁగాక! లేక శర్మ = ఆనందమును గల్గఁజేయుఁగాక!

'స్యాదానందథురానందః శర్మశాతసుఖాని చ' – అని యమరము.

**తాత్పర్యము :** నిద్రచేఁ గలఁత చెందినవారి నిద్రను, రోగుల రోగములను, ముల్లోకముల యందలి చీఁకటిని, పాపకలుషాత్ముల పాపములను బరిహరించుచుఁ దూర్పుదిక్కునకు వచ్చినవాఁడును, నిత్యము తాను ప్రయాణములు చేయుటవలనఁ గోపగించిన పద్మినిని నర్మవాక్యములతో ననునయించువాఁడును, విశ్వమునందలి యార్తులను రక్షించుటయే ధర్మముగాఁ గలవాఁడు, నానందస్వరూపుఁడైన సూర్యుఁడు మిమ్మెప్పుడు రక్షించుఁగాక!

శ్లోకమునందంతట వృత్త్యనుప్రాసము స్ఫుటమే. ఇక్కడ నిద్రయందు, రోగమునందు, చీఁకటి యందు, పాపమునందుఁ 'బరిహరన్' అను నొకే క్రియ యన్వయించుటచేఁ దుల్యయోగితాలంకారము.

మూఁడవ పాదములో నిత్యము ప్రయాణించు సూర్యుఁడు కుపితయైన కమలినితో నర్మవాక్యములు పలుకుచున్నాఁడను ప్రస్తుతవాక్యముచే – నిత్యము

ప్రయాణముచేయు నొక నాయకుఁడు కోపించిన తన ప్రియురాలిని నర్మవాక్యములతో ననునయించు చున్నాఁడను నప్రస్తుతార్థము స్ఫురించుటచే సమాసోక్తియలంకారము.

శ్లో॥ సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్ ।
అయమైంద్రీముఖమ్ పశ్య రక్తశ్చుంబతి చంద్రమాః ॥ (చంద్రా. 5-62)

రక్తుఁడైన చంద్రుఁడు పూర్వదిశాముఖమును జుంబించుచున్నాఁడను వాక్యముచే రక్తుఁడైన కాముకుఁడు తన కాముకియొక్క ముఖమును ముద్దాడు చున్నాఁడను నర్థము స్ఫురించుటచే సమాసోక్తియని చంద్రాలోకము.

త్రిలోకి : 'త్రయాణాం లోకానాం సమాహారః' మూఁడు లోకముల సమాహారము త్రిలోకి. (1) స్వర్గలోకము (2) భూలోకము (3) పాతాళలోకము - మూఁడు లోకములు.

## 13

**అవతారిక :** ఇప్పుడు సూర్యకిరణములు తన మాంద్యమును బోఁగొట్టుఁగాక! యని ప్రార్థించుచున్నాఁడు -

**శ్లో॥ అంతర్నీరం నదీనామనుదినముదయే బింబితా యే సమన్తాద్**
**గీర్వాణాద్రేరుదఞ్చన్మణిగణజటిలామ్ మేదినీం దర్శయంతి ।**
**విప్రప్రోక్షిప్తసన్ధ్యాఞ్జలిజలకణికాజాలమాకాశమధ్యే**
**మాణిక్యవ్రాతయన్తో మమ మిహిరకరా మాన్ద్యమున్మూలయన్తు ॥** ౧౩

**ప్రతిపదార్థము :** యే = ఏ కిరణములు; నదీనామ్ = భూమిపైనున్న నదులయొక్క; అంతః + నీరమ్ = నీటిలోపల; అనుదినమ్ = ప్రతిదినము; ఉదయే = ప్రాతఃకాలమునందు; సమంతాత్ = సంపూర్ణముగా; బింబితాః = ప్రతిఫలించుచున్నవో; యే = ఏ కిరణములు; గీర్వాణాద్రేః = దేవతల పర్వతమైన మేరువుయొక్క; ఉదంచత్ = ప్రకాశించుచున్న; మణిగణ = రత్న సమూహముల (కాంతులచే) జటిలామ్ = అతిశయించిన; మేదినీమ్ = భూమిని; దర్శయంతి = చూపుచున్నవో; యే = ఏ కిరణములు; విప్ర = బ్రాహ్మణులచే; ప్ర + ఉత్ + క్షిప్త = పైకిఁ జిమ్మఁబడిన; సంధ్యా + అంజలి = సంధ్యావందనమునకు సంబంధించిన; జల = నీళ్ళయొక్క; కణికా = బొట్లయొక్క; జాలమ్ = సమూహమును; ఆకాశమధ్యే = ఆకాశ మధ్యభాగమునందు; మాణిక్యవ్రాతయంతః = కెంపుల గుంపులుగాఁ జేయుచున్నవో; (తే = అట్టి);

మిహిరకరాః = సూర్యుని కిరణములు; మమ = నాయొక్క; మాంద్యమ్ = జాడ్యమును; ఉన్మూలయంతు = పోఁగొట్టుఁగాక!

**తాత్పర్యము :** ప్రాతఃకాలమునందు సూర్యుని కిరణములు నదులయందలి నీళ్ళలోఁ బడి ప్రతిబింబించుటచే వాని కాంతులు పైకి విరఁజిమ్ము చున్నవి. ప్రదక్షిణము చేయుచున్న సూర్యుని కిరణములు మేరుపర్వతము నందలి నవరత్నముల సమూహములపైఁ బడి వాని కాంతులు భూమిపైఁబడి పరావర్తనము చెందుచున్నవి. లేక మేరుపర్వత మణిగణములపైఁ బడిన సూర్యకిరణములు పరావర్తనము చెంది భూమిపైఁ బడుటచే భూతలము కూడ మేరుపర్వతమువలె రత్నకాంతులతో భాసించుచున్నదని భావము. సూర్యోదయకాలములో బ్రాహ్మణులు సంధ్యకు నమస్కరించుచు నర్ఘ్యప్రదానము చేయుచున్నప్పుడు వారి దోసిళ్ళతోఁ బైకిఁ జిమ్మఁబడిన నీటిబిందువులపై సూర్యకిరణములు పడుటచేఁ గెంపుల రాశులవలెఁ గన్పట్టుచున్నవి. అట్టి సూర్యకిరణములు నాయొక్క యలసత్వమును, దేహజాడ్యమును, బుద్ధిమాంద్యమును నిర్మూలించుఁగాక!

ఇక్కడ సూర్యకిరణముల యెఱ్ఱని కాంతులు పడుటవలనఁ దెల్లని నీటి బిందువులు కెంపులుగా మాఱినవని కిరణకాంతుల యందలి యెఱుపు నీటిబిందువులకు సంక్రమించినట్లు వర్ణించుటచేఁ దద్గుణాలంకారము.

## 14

**అవతారిక :** ఇప్పుడు మఱల సూర్యభగవానునే వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ ప్రత్యగ్రోఢాః ప్రగల్భా యువతిపరిషదః ప్రోషితప్రాణనాథా**
**యస్మిన్నస్తాద్రిమౌలేరుపరి మణిమయచ్ఛత్రలీలాం దధానే ।**
**సత్రాసం సప్రసాదం పరిణతకరుణం లోచనాన్యుత్క్షిపన్తి**
**స్థేమానం స ప్రియాణాం ఘటయతు భగవాన్ పద్మినీవల్లభో వః॥** ౧౪

**ప్రతిపదార్థము :** ప్రతి + అగ్ర + ఊఢాః = ప్రత్యగ్రోఢాః = క్రొత్తగాఁ బెండ్లియైన స్త్రీలు – నవోఢలని యర్థము. ప్రగల్భాః = రతిచేయుటలో నైపుణ్యము గల స్త్రీలు – విశేష లక్షణములు గల నాయికలని యర్థము. ప్ర + ఉషిత + ప్రాణనాథాః = ప్రోషితప్రాణనాథాః = పొరుగూరికి వెళ్ళిన భర్తలు గల స్త్రీలు – ప్రోషితభర్తృకలని

యర్థము. యువతిపరిషదః = అట్టి యౌవనవతులైన స్త్రీల పరిషత్తులు (సమూహము); ఇది కర్తృపదము. యస్మిన్ = ఏ సూర్యుఁడు; అస్త + అద్రిమౌళేః = అస్తాచల శిఖరమునకు; ఉపరి = పైభాగమున; మణిమయచ్ఛత్రలీలామ్ = రత్నములు పొదిగిన బంగారు గొడుగుయొక్క విలాసమును; దధానే = వహించుచుండఁగా; సత్రాసమ్ = భయముతో; సప్రసాదమ్ = ప్రసన్నతతో; పరిణతకరుణమ్ = పరిణమించిన దయతో; లోచనాని = కన్నులను; ఉత్ + క్షిపన్తి = పైకెత్తి చూచుచున్నారో; సః = అట్టి; భగవాన్ = భగవంతుఁడైన; పద్మినీవల్లభః = కమలినీ భర్తయైన సూర్యుఁడు; వః = మీయొక్క; ప్రియాణామ్ = పతులకు; స్థేమానమ్ = స్థైర్యమును; ఘటయతు = కూర్చుఁగాక!

**తాత్పర్యము :** సాయంకాలమైనంతనే పడమటి కొండ శిఖరముపై మణులతో నిండిన బంగారు గొడుగువలె సూర్యుఁడస్తమించు చుండఁగా నవోఢలు, ప్రగల్భలు, ప్రోషిత భర్తృకలు; గుంపులుగా నున్న యౌవనవతులగు స్త్రీలు, భయముతోఁ, బ్రసన్నత్వముతో, దయతోఁ గన్నులు పైకెత్తి భర్తల రాకను బ్రార్థించుచు నేసూర్యుని జూచుచున్నారో యా భగవంతుఁడైన పద్మినీభర్త మీ ప్రియులకు శారీరక బలమును, మానసిక స్థైర్యము నిచ్చుఁగాక!

నాయిక (1) స్వీయ (2) పరకీయ (3) సామాన్య యని మూఁడు విధములు.

**'తత్ర స్వామిన్యేవానురక్తా స్వీయా'** భర్తయందు మాత్రమే యనురాగము గలది స్వీయ. 'స్వీయా త్రివిధా–ముగ్ధా, మధ్యా, ప్రగల్భా చ' (1) ముగ్ధ (2) మధ్య (3) ప్రగల్భ యని స్వీయ మూఁడు విధములు.

**'తత్రాఙ్కురితయౌవనా ముగ్ధా'** – అప్పుడే పొటమరించిన యౌవనము గలది ముగ్ధ. 'సా చ ద్వివిధా (1) జ్ఞాతయౌవనా (2) అజ్ఞాతయౌవనా చేతి' – వారిలో ముగ్ధ (1) జ్ఞాతయౌవన (2) అజ్ఞాతయౌవన యని రెండు విధములు.

**'సైవ క్రమశో లజ్జా భయపరాధీనరతిర్నవోఢా'** ఆ ముగ్ధయే సిగ్గునకు, భయమునకు లోఁబడిన రతిగలదియై నవోఢయగును. క్రొత్తగాఁ బెండ్లియై మొదటి సారి భర్త సంపర్కము నొందుచున్న స్త్రీ నవోఢయని భావము. పైశ్లోకములో నీమెయే 'ప్రత్యగ్రోఢ' యని చెప్పఁబడినది.

'పతిమాత్రవిషయకేలీకలాకలాపకోవిదా ప్రగల్భా'

భర్తయందు మాత్రమే సంభోగకేళీ కలాకలాపములలో నారితేరినది **'ప్రగల్భ'**

మఱల నా నాయిక (1) ప్రోషిత భర్తృక (2) ఖండిత (3) కలహాంతరిత (4) విప్రలబ్ధ (5) ఉత్కంఠిత (6) వాసకసజ్జిక (7) స్వాధీనపతిక (8) అభిసారిక యని యెనిమిది విధములు.

'దేశాంతరగతే భర్తరి సంతాపవ్యాకులా ప్రోషితభర్తృకా'

మగఁడు దేశాంతరమునకు వెళ్ళినప్పుడు సంతాపముతో వ్యాకులపాటు నొందినది ప్రోషితభర్తృక – అని **భానుదత్తుని రసమంజరి.** ఈమెయే పై శ్లోకములోఁ 'ప్రోషిత ప్రాణనాథ' యని చెప్పఁబడినది. ఇప్పుడీ శ్లోకము నిట్లర్థము చేసికొన వలయును –

సూర్యుఁడు పడమటి కొండ శిఖరముపై రత్నచ్ఛత్రమువలె నున్నాఁడు. అనఁగా నస్తమించుచున్నాఁడని యర్థము. అప్పుడు నవోఢలు, ప్రగల్భలు, ప్రోషిత–భర్తృకలగు యౌవనవతులగు స్త్రీలు తమ భర్తల రాకకై కన్నులు పైకెత్తి చూచుచున్నారు. వారిలో నవోఢలు భయముతోడఁజూచుచున్నారు. క్రొత్తగాఁ బెండ్లియైన వారు గావున వారి భర్తలు పడకగదిలో నేమిచేయుదురో! యని భయపడుచున్నారు. ప్రగల్భలు ప్రసన్నదృక్కులతోఁ బరికించుచున్నారు. వీరు రతికేళిలో నారితేరిన వారు గావున భర్తల ప్రసాదమును గోరి ప్రసన్నములైన కన్నులతో వారి రాకకై యెదురు చూచుచున్నారు. ప్రోషితభర్తృకలు పరిణమించిన కరుణతో భర్తలకై యెదురు చూచుచున్నారు. ఎప్పుడో దేశాంతరమేఁగిన భర్త యిప్పుడు వచ్చుచున్నాఁడు గావున వానిపైఁ గోపింపక దయతో రతికేళిలో నోలలాడింపవలయునను భావముతో వాని రాక కెదురు చూచుచున్నారు. ఈ విధముగా యౌవనములో నున్న స్త్రీల పరిషత్తులు భర్తల రాకకై యెదురు చూచుచున్నవి. భగవంతుఁడైన సూర్యుఁ డస్తమించి వారి భర్తలను రప్పించి యెదురు చూచుచున్న యువతులతోఁ గలిపి స్థైర్యమును గలిగించుఁగాక! యని భావము.

**భగవానుఁడు :**

శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః ।
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణామ్ భగ ఇతీరణా ॥

(1) సమగ్రమైన యైశ్వర్యము (2) ధర్మము (3) కీర్తి (4) సంపద (5) జ్ఞానము (6) వైరాగ్యము – వీని యాఱింటికి భగమని పేరు. ఈ యాఱు గుణములు గలవాఁడు భగవంతుఁడు.

శ్లో॥ ఉత్పత్తిమ్ ప్రలయం చైవ భూతానామాగతిం గతిమ్ ।
వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి ॥

విశ్వముయొక్క (1) పుట్టుక (2) ప్రలయము (3) పంచభూతముల రాక (4) పోక (5) జ్ఞానము (6) అజ్ఞానము – ఈ యాఱింటి నెఱిఁగినవాఁడు భగవంతుఁడని **విష్ణుపురాణము.**

భగశబ్దము స్త్రీ యోనివాచకమైనను భగినీ – భగవతీ – భగవదాది శబ్దముల కశ్లీలత్వ గ్రామ్యత్వాది దోషములు లేవు.

**'భగినీ – భగవత్యాది సర్వత్రైవానుమన్యతే'** (కావ్యా–1–63) అని దండి కావ్యాదర్శము.

ఈ శ్లోకమునందలి మొదటిపాదములో – 'ప్ర–ప్ర–ప్రో' – అని యుండుటచే వృత్త్యనుప్రాసము. ప్రత్యగ్రోఢలు త్రాసముతో, ప్రగల్భలు ప్రసాదముతో, ప్రోషితభర్తృకలు పరిణతకరుణతోఁ జూచుచున్నారని క్రమముగాఁ జెప్పుటచే యథాసంఖ్యాలంకారము.

శ్లో॥ యథాసంఖ్యం ద్విధార్థాశ్చేత్ క్రమాదేకైక మన్వితాః ।
శత్రుమ్ మిత్రం ద్విషత్పక్షం జయ! రంజయ! భంజయ! ॥ (చం.5–92)

శత్రువులను జయింపుము. మిత్రులను రంజింపుము. ద్విషత్పక్షమును భంజింపుము – అని క్రమముగా నన్వయించునట్లు చెప్పినచో యథాసంఖ్యాలంకారమని చంద్రాలోకము. దీనికే క్రమాలంకారమని నామాంతరము.

'పోకాలము దాఁపురించినవాఁ డరుంధతీ నక్షత్రమును, పెద్దల వాక్యమును, దీపనిర్వాణ గంధమును గనఁడు, వినఁడు మూర్కొనఁడని పెద్దలు చెప్పుదురు' – ఈ చిన్నయసూరి మిత్రలాభవాక్యము క్రమాలంకారమునకుఁ జక్కని యుదాహరణము.

రెండవ పాదములో నస్తమించుచున్న సూర్యుఁడు పశ్చిమాచలశిరస్సుపై మణిమయచ్ఛత్రలీలతో నున్నాఁడని కవి యూహించుటచే నుత్ప్రేక్షాలంకారము.

పద్మినీ వల్లభుఁడనుటచేఁ బద్మిని ప్రోషితభర్తృకవలె సూర్యుని రాకకై యెదురు

చూచుచున్నదని ధ్వనించుచున్నది. భగవానుఁడనుటచే సూర్యుఁడే ప్రత్యక్షదైవమని ధ్వనించుచున్నది.

యువతిః –

**యూనస్తిః** (4–1–77)
యువన్ శబ్దముపైఁ 'తి' ప్రత్యయము చేరి యువతి శబ్దమేర్పడినది. యౌవనవతి యగు స్త్రీ యని యర్థము.

**పరిణతకరుణమ్ :**

ఇది – 'ఉత్క్షిపంతి' యను క్రియకు విశేషణమగుటచే **నవ్యయత్వము** నొందినది.

## 15

**అవతారిక :** ఇప్పుడు సూర్యదేవతకు నమస్కరించుచున్నాఁడు –

**శ్లో॥ అన్తర్ద్యావాపృథివ్యోరధిరజని భృతానన్ధకారానుదారాన్**
**విద్రావ్య ద్రాక్ తదీయైరివ జగదరుణం శోణితైర్యద్విధత్తే ।**
**సాయమ్ ప్రాతశ్చ సన్ధ్యాఞ్జలిమవనిసురాః సమ్ప్రయచ్ఛన్తి యస్మై**
**తస్మై కస్మైచిదేతన్మమ పరమహసే దేవతాయై నమోఽస్తు ॥** ౨౫

**ప్రతిపదార్థము :** ద్యావాపృథివ్యోః = ఆకాశమునకు, భూమికి; అంతర్ = మధ్యభాగమున; అధిరజని = రాత్రి మధ్యవేళల యందు; భృతాన్ = భరింపఁబడిన; ఉదారాన్ = ఎక్కువయైన; అంధకారాన్ = చీఁకట్లను; ద్రాక్ = వెంటనే; విద్రావ్య = యుద్ధములో నోడించి; తదీయైః = ఆ చీఁకట్లకు సంబంధించిన; శోణితైః + ఇవ = రక్తధారలవలె; జగత్ = లోకమును; అరుణమ్ = ఎఱ్ఱగా; యత్ = ఏది; విధత్తే = చేయుచున్నదో; సాయమ్ = సాయంసంధ్యయందు; ప్రాతః + చ = ప్రాతఃసంధ్య యందును; అవనిసురాః = భూదేవతలైన బ్రాహ్మణులు; సంధ్యా + అంజలిమ్ = సంధ్యావందనము చేయునపుడు జోడించిన చేతులతో నమస్కారమును; యస్మై = ఏ; పరమహసే = పరమ తేజఃస్వరూపమైన; కస్మైచిత్ = ఒకానొక; దేవతాయై = దేవత కొఱకు; సంప్రయచ్ఛంతి = ఇచ్చుచున్నారో; ఆ సూర్యునకు; ఏతత్ = ఈ; నమః = నమస్కారము; అస్తు = అగుఁగాక!

**తాత్పర్యము :** నింగికి నేలకు మధ్యభాగములో రాత్రియంతయు నిండిన దట్టమైన చీఁకట్లతో యుద్ధముచేసి జయించి యా చీఁకట్ల రక్తప్రవాహముచే నన్నట్లుగా లోకము నెఱ్ఱగా నేకాంతి చేయుచున్నదో; సాయంకాలమునందుఁ బ్రాతఃకాలమునందును బ్రాహ్మణులు సంధ్యావందనము చేయుచు దేని కంజలి పట్టుచున్నారో యా తేజః-స్వరూపముతో నొకానొక దేవతయైన సూర్యునకు నమస్కరించుచున్నానని భావము.

సూర్యోదయమైనంతనే కిరణకాంతికి జగత్తంతయు నెఱ్ఱఁబడుట స్వాభావికమే. భూమ్యాకాశముల మధ్య నిండిన ఘోరాంధకారములను జీల్చి చెండాడి వాని యొంటి నుండి కాఱిన రక్తధారలతో నెఱ్ఱగాఁ జేయుదానివలె సూర్యతేజస్సు లోకము నెఱ్ఱగాఁ జేయుచున్నదని కవి యూహించి వర్ణించుటచే నుత్ప్రేక్షాలంకారము. ఇందలి 'ఇవ' (వలె) శబ్ద ముత్ప్రేక్షావాచకమేకాని యుపమావాచకము కాదు. అందువల్లనే దండిమహాకవి –

శ్లో॥ మన్యే శంకే ధ్రువమ్ ప్రాయో నూనమిత్యేవమాదిభిః ।
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివ శబ్దోఽపి తాదృశః ॥ (కావ్యా-2-234)

అని కావ్యాదర్శములోఁ జెప్పినాఁడు.

లింపతీవ తమోఽంగాని, వర్షతీవాంజనం నభః ।
అసత్పురుష సేవేవ దృష్టిర్విఫలతాంగతా ॥ (మృచ్ఛ. 1-34)

'చీఁకటి యంగములకుఁ బూయుచున్నదా యన్నట్లు, ఆకాశము కాటుకను వర్షించుచున్నదా యన్నట్లు – అను మృచ్ఛకటిక శ్లోకములోని యివ శబ్దము లుత్ప్రేక్షావాచకములే. అసత్పురుషసేవ వలె ననుచోట నివ శబ్ద ముపమావాచకమే.

ద్యావాపృథివి.

దివసశ్చ పృథివ్యామ్ (6-3-30)

అను సూత్రముచే 'దిక్' శబ్దమునకుఁ బృథివీ శబ్దము పరమైనప్పుడు దేవతాద్వంద్వములో 'దివస్' ఆదేశము, 'ద్యావా' ఆదేశము వచ్చి 'దివస్పృథివీ, 'ద్యావాపృథివీ' అను రెండు రూపములు నేర్పడును. పృథివీ శబ్దము పరమైనప్పుడే యీ యాదేశములు వచ్చునుగాని పృథివీ పర్యాయములైన 'పృథ్వి' – 'ధరణీ' ప్రభృతి శబ్దములు పరమైనప్పుడు 'ద్యావా పృథ్వి' 'ద్యావాధరణి' మొదలగు రూపములుండవు.

శా॥ ద్యావాపృథ్వ్యవకాశపేశలయశోధారానభస్సింధువై (కాశీ–1–23)
అను శ్రీనాథుని ప్రయోగము; దీనిననుసరించిన

శా॥ ద్యావాపృథ్వ్యవకాశపుంఖితనిజవ్యాపారపారీణతన్. (పాండు–1–33)
అను తెనాలి రామకృష్ణకవి ప్రయోగము చింత్యములే.

## 16

**అవతారిక :** ఇప్పుడు సూర్యతేజస్సు పాఠకులను రక్షింపవలెనని ప్రార్థించుచున్నాఁడు–

**శ్లో॥ త్రాణం త్రైవిష్టపానాం తరణమథ పయస్స్తోమతామ్యత్తనూనాం**
**నద్యన్తానామతర్క్యం త్రిగుణమయతయా యత్ త్రయాణాం తురీయమ్ ।**
**తత్తాదృక్ తున్దిలాయాస్తరుణతరతమస్సన్తతేరన్తకృత్ త్వాం**
**తేజస్త్రైలోక్యతామ్రీకరణచతురిమ త్రాయతాం తీక్ష్ణభానోః ॥** ౧౬

**ప్రతిపదార్థము :** 'విష్టపమ్' అనఁగా జగత్తు. 'విష్టపమ్ భువనం జగత్' అని యమరకోశము. 'భూర్భువఃస్వః' అను శ్రుతిచే మూఁడవదగు విష్టపము త్రివిష్టపము = స్వర్గలోకము. 'సురలోకో ద్యోదివౌ ద్వే స్త్రియాం క్లీబే త్రివిష్టపమ్' – అని యమరము. యత్ = ఏ తేజస్సు; త్రైవిష్టపానామ్ = స్వర్గలోకము నందుండు దేవతలను; త్రాణమ్ = రక్షణమైనదో; అథ = మఱియును; పయః = జలముయొక్క; 'ఆపః స్త్రీభూమ్ని వార్వారి సలిలం కమలం జలమ్। పయః కీలాలమమృతమ్' – అని యమరము; స్తోమ = సమూహముచేఁ (నీటి ప్రవాహముచే); తామ్యత్ = ఖేదమునొందుచున్న; తనూనామ్ = శరీరము గలవారికి; తరణమ్ = తరింపఁజేయునది (దాఁటించునది); నీటిచే వణఁకుచున్న శరీరము గలవారికి వెచ్చఁదనమును గూర్చునది యని భావము. 'పయస్స్తోమ' యనుచోటఁ 'దమస్స్తోమ' యని పాఠాంతరము గలదు. అప్పుడు చీఁకటిచే వణఁకుచు భయపడుచున్న వారికని యర్థము. 'హిమస్తోమ' యను పాఠాంతర మున్నచో నింకను బాగుండెడిది. మంచు కురియుటచే వణఁకిపోవుచున్న శరీరము గలవారి కని యర్థము వచ్చును. నది + అంతానామ్ = నదులకుఁ జివరివైన సముద్రములకు; అతర్క్యమ్ = తర్కించుటకు వీలులేనిది; ఇక్కడ సముద్రశబ్దముచే సముద్రజీవులను గ్రహింపవలెను. త్రిగుణమయతయా = (1) సత్త్వము (2) రజస్సు (3) తమస్సు నను మూఁడు గుణములతో నిండి యుండుటచే; త్రయాణామ్ = మూఁడు వేదములకు; 'ఇతి వేదాస్త్రయస్త్రయీ' – అని యమరము. తురీయమ్ = నాల్గవదైనది; తాదృక్ =

అటువంటి; తుందిలాయాః = బాగుగా బలిసిన; తరుణతర = మిక్కిలి దట్టమైన; తమః = చీఁకటియొక్క; సంతతేః = సంతానమునకు; అంతకృత్ = అంతము చేయునది; త్రైలోక్య = మూఁడు లోకములను; తామ్రీకరణ = రాగి (రంగు)గా మార్చుటలో; చతురిమ = చాతుర్యము గలది యగు; తీక్ష్ణభానోః = సూర్యునియొక్క; తత్ + తేజః = ఆ కాంతి; త్వామ్ = నిన్ను; (పాఠకుఁడగు భక్తుని); త్రాయతామ్ = రక్షించుఁగాక!

**తాత్పర్యము :** స్వర్గము నందలి దేవతలకు రక్షకమైనది (దీనివలన స్వర్గము చెప్పఁబడినది). నీటివలన (లేక) చీఁకటివలన (లేక) మంచువలనఁ బీడింపఁబడిన దేహములుగల జనులనుఁ గష్టములనుండి దాఁటించి గట్టెక్కించునది (దీనివలన భూలోకము చెప్పఁబడినది). 'నదీనాం సాగరో గతిః' అను వచనము ననుసరించి నదులకుఁ జివరనున్న సముద్రములకుఁ దర్కించుటకు వీలుకానిది, సూర్యునియొక్క గమనపరిధి పూర్వపశ్చిమదిక్కులందు వ్యాపించియున్న సముద్రములకుఁగూడఁ దెలియదని భావము. సముద్రములు పాతాళమువఱకు వ్యాపించి యుండును గానఁ బాతాళవాసులకుఁ గూడ సూర్యతేజస్సూహించుటకు శక్యము కానిదని భావము. (దీనవలనఁ బాతాళము చెప్పఁబడినది). ఈ విధముగా మూఁడు లోకములందు వ్యాపించి యున్నది సూర్యతేజస్సు. త్రిగుణము లనఁగా సత్త్వరజస్తమో గుణములు. ఈ మూఁడు గుణములను దాఁటి నాల్గవదగు నిర్గుణ స్వరూపమైనది సూర్యతేజస్సు.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః ॥ (భ.గీ-14-18)

అను భగవద్గీత యందలి గుణత్రయవిభాగశ్లోకము ననుసరించి సత్త్వగుణ ప్రధానమైనది స్వర్గము. రజోగుణ ప్రధానమైనది భూలోకము. తమోగుణ ప్రధానమైనది పాతాళము. ఈ మూఁడు లోకములకుఁ దురీయముగా నున్నది సూర్యలోకము. లేక (1) ఋగ్వేదము (2) యజుర్వేదము (3) సామవేదము త్రయము. ఈ మూఁడు వేదములకుఁ దురీయ స్వరూపముగా నున్నది యథర్వవేదము సూర్యాత్మకము. లేక

శ్లో॥ త్రైగుణ్యవిషయావేదా నిస్త్రైగుణ్యో భవార్జున! (భ.గీ. 2-45)

అను భగవద్గీతావాక్యముచే మూఁడు వేదములు త్రిగుణాత్మకములైనవి. నాల్గవదగు నుపనిషద్రూపము సూర్యతేజస్సు. లేక

శ్లో॥ రజో జుషే జన్మని సత్త్వవృత్తయే
స్థితౌ ప్రజానామ్ ప్రలయే తమః స్పృశే ।
అజాయ సర్గస్థితినాశహేతవే
త్రయీమయాయ త్రిగుణాత్మనే నమః ॥

అను కాదంబరీ మంగళశ్లోకము ననుసరించి జగత్తులను సృష్టించుటయందు రజోగుణము నాశ్రయించునది (బ్రహ్మస్వరూపము); రక్షించుట యందు సత్త్వగుణము నాశ్రయించునది (విష్ణుస్వరూపము); ప్రలయము చేయుటలోఁ దమోగుణము నాశ్రయించునది (శివస్వరూపము) త్రిగుణాత్మకము. ఈ త్రిమూర్తుల మూఁడు తత్త్వములకు నతీతమై తురీయావస్థలో నున్నది బ్రహ్మము. అట్టి పరబ్రహ్మస్వరూపము సూర్యతేజస్సు.

లేక ధర్మము సత్త్వగుణాత్మకము. అర్థము రజోగుణాత్మకము. కామము తమోగుణాత్మకము. ఈ మూఁడింటిని మించి నాల్గవదియైన నిర్గుణాత్మకమైనది మోక్షము. అట్టి మోక్షస్వరూపము సూర్యతేజస్సు.

మఱియు ఘనీభవించి నిబిడముగా లోకములందు వ్యాపించి యున్నది చీఁకటి సంతతి. దానిని నాశనము చేయునది సూర్యతేజస్సు. మఱియు మూఁడు లోకములను నెఱ్ఱగాఁ జేయుటలో నిపుణమైన యా సూర్యకాంతి నిన్ను రక్షించుఁగాక!

స్వర్గవాసులకుఁ **ద్రాణమని**, భూలోకవాసులకుఁ **దరణమని**, సముద్రవాసుల **కతర్యమని**, మూఁడు గుణములకుఁ దురీయమని, తమస్సంతతికి యముఁడని, యొకే సూర్యతేజస్సు ననేక విధములుగా నుల్లేఖించుటచే నుల్లేఖాలంకారము.

తుందిలము :

తుందము = కడుపు. 'పిచండకుక్షీ జఠరోదరం తుందమ్' – అని యమరము. తుంద శబ్దముపై 'ఇలచ్' ప్రత్యయము చేరి 'తుందిల' యని యగును. తుందిలుఁడనఁగా బొజ్జగలవాఁడు.

**'తుందిలస్తుందిభస్తుందీ బృహత్కుక్షిః పిచండిలః'** అని యమరము.

చతురిమ :

చతురశబ్దముపై **'ఇమనిచ్'** ప్రత్యయము చేరి 'చతురిమ' యని యగును. చతురిమము = చాతుర్యము.

తామ్రీకరణము :

తామ్ర + కరణ : 'కృభ్వస్తియోగే సంపద్యకర్తరి చ్విః' (5-4-50) చ్వౌచ (7-4-26) అను సూత్రముచే చ్వి ప్రత్యయము, అంత్యాచ్చున కీత్వము వచ్చి తామ్రీకరణమని యగును. **'అభూతతద్భావ ఇతి వాచ్యమ్'** అనువార్తికముచే నంతకు ముందెఱ్ఱగా లేని దాని నెఱ్ఱగాఁ జేయుట తామ్రీకరణము.

**17**

**అవతారిక :** ఇప్పుడు సూర్యుని కిరణవిలాసములను వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ గీర్వాణగ్రామణీభిర్గగనతలగతైర్గీభిరుద్గీథగాభి-**
**ర్గన్ధర్వైశ్చాపి గీతా గుణగణగరిమోద్గారిగాథాసహస్రైః ।**
**గాహం గాహం గృహాలీరగతికగదినాం గన్ధయన్తో గదార్తిం**
**గ్లానిగ్రామం గ్రసన్తాం గ్రహరుచిగురవో గోపతేర్గోవిలాసాః ॥** ౧౭

**ప్రతిపదార్థము :** గగనతలగతైః = ఆకాశమార్గమును బొందిన; గీర్వాణగ్రామణీభిః = దేవతాశ్రేష్ఠులచే; 'బర్హిర్ముఖాః క్రతుభుజో గీర్వాణా దానవారయః', 'గ్రామణీర్నాపితే పుంసి శ్రేష్ఠే గ్రామాధిపే త్రిషు॥' అని యుభయత్ర యమరము. ఉద్గీథగాభిః = సామవేద సూక్తములతోఁ గూడిన; గీర్భిః = వాక్కులచేత; గంధర్వైః + చ + అపి = గంధర్వులచేతఁ గూడ; గుణగణగరిమ = గుణగణముల గొప్పతనమును; ఉత్ + గారి = త్రేన్చుచున్న - పైకిఁ జాటి చెప్పుచున్న; గాథాసహస్రైః = వేలకొలఁది గాథలచే (గీతులచే); గీతాః = గానము చేయఁబడినవి; అగతిక = గతిలేని (రెండవ మార్గములేని); గదినామ్ = రోగులయొక్క; గృహ + ఆలీః = ఇండ్లవరుసలను; గాహం గాహమ్; ప్రవేశించి ప్రవేశించి; గద + ఆర్తిమ్ = రోగము వలనఁ గలిగిన దుఃఖమును; 'స్త్రీరుగ్రుజాచోప-తాపరోగవ్యాధిగదామయాః' - అని యమరము. గంధయంతః = గంధముగా నరుగఁదీయునవి (తగ్గించునవి); గ్రహ = తక్కిన గ్రహములయొక్క (చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, రాహు, కేతువుల యొక్క); రుచి = కాంతులకు; గురవః = పాఠము చెప్పు నుపాధ్యాయులైన; గోపతేః = కిరణములకు భర్తయైన సూర్యునియొక్క; గో = కిరణములయొక్క; విలాసాః = లీలలు, గ్లానిగ్రామమ్ = (మనయొక్క) వ్యాధుల సమూహమును; గ్రసంతామ్ = గ్రసించుఁగాక! నాశనము చేయుఁగాక!

**తాత్పర్యము :** ఆకాశమునందు సంచరించు దేవతాముఖ్యులచేత సామవేదసూక్తములతోఁ గూడిన వాక్కులతో, నట్లే గంధర్వులచేతఁ గూడ వేయివిధములైన గీతులచే గానము చేయఁబడిన గుణగణముల గౌరవము గలవి, వ్యాధిగ్రస్తులైన రోగులయొక్క యిండ్ల వరుసలో మాటిమాటికిఁ బ్రవేశించి వారి రోగముల నరగఁదీసి గంధపుఁ బొడివలెఁ జూర్ణము చేయునవియుఁ దక్కిన యష్టగ్రహములకుఁ గాంతుల నొసఁగునవియు నగు సూర్యుని కిరణములయొక్క విలాసములు భక్తుల రోగశోకములను నాశనము చేయుఁగాక!

శ్లోకమంతట గకారానుప్రాసము. ఈ శ్లోకము –

శ్లో॥ వ్యగ్రైరగ్ర్యగ్రహేన్దుగ్రసనగురుభరైరోైః సమగ్రైరుదగ్రైః
ప్రత్యగ్రై రీషదుగ్రై రుదయగిరిగతో గోగణైర్గౌరయన్ గామ్ ।
ఉద్గాథార్చిర్విలీనామరనగరనగగ్రావగర్భామివాహ్నో–
మగ్రే శ్రేయో విధత్తే గ్లపయతు గహనం స గ్రహగ్రామణీర్వః ॥ (98)

అను సూర్యశతకశ్లోకమున కనుకరణము.

మయూరమహాకవి 'గ్ర' సంయుక్తాక్షరము నెక్కువగా వాడుటచే శ్లోకము **గౌడీరీతి**లో నడచినది. జగన్నాథమహాకవి 'గ' యను సరళాక్షరము నెక్కువగా స్వీకరించుటచే శ్లోకము **పాంచాలీరీతి** విలసితమైనది. సూర్యశతకశ్లోకములో గకారము **5** మాఱులు కాఁగా, సుధాలహరీ శ్లోకములో **29** మాఱులావృత్తమైనది.

**విశేషము :**

ఉద్గారము = త్రేనుపు; ఉద్గారి = త్రేన్చునది.

ఉమియు, క్రక్కు, త్రేన్పు మొదలగునవి యుద్వేజకములు కానిచో గ్రామ్యత్వము లేక సుందరముగా నుండును.

శ్లో॥ నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాది గౌణవృత్తి వ్యపాశ్రయమ్ ।
అతిసుందరమన్యత్ర గ్రామ్యకక్షాం విగాహతే ॥ (కావ్యా–1–95)

అని దండి కావ్యాదర్శము.

సీ॥ వలమానతాటంకవజ్రాంకురచ్ఛాయ
లేఁతవెన్నెలఁ బుక్కిలించి యుమియ. (భీమ.1–105)

'అపాంగమాలికల్ మెఱుఁగులు గ్రక్క' – మొదలగు ప్రయోగము లిట్టివే.

## 18

**అవతారిక :** ఇప్పుడు సూర్యజ్యోతినిఁ బ్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ జీవాతుర్జాడ్యజాలాధికజనితరుజాం తప్తజామ్బూనదాభం**
**జఙ్ఘాలం జాఙ్ఘికానాం జలధిజఠరతో జృమ్భమాణం జగత్యామ్ ।**
**జీవాధానం జనానాం జనకమథ రుచో జీవజైవాతృకాదే–**
**ర్జ్యోతిర్జాజ్వల్యమానం జలజహితకృతో జాయతాం వో జయాయ॥** ౧౮

**ప్రతిపదార్థము :** జాడ్యజాల = జడత్వము మొదలగు జబ్బుల సమూహముచే; అధిక = ఎక్కువగా; జనిత = పుట్టిన; రుజామ్ = రోగముగలవారికి; జీవాతుః = జీవింపఁ జేసెడు మందు; 'జీవాతుర్జీవనౌషధమ్' – అని యమరము; తప్త = కాల్పఁబడిన (పుటముపెట్టిన); జాంబూనద = బంగారముతో; ఆభమ్ = సమానమైన కాంతి గలది;

చామీకరం జాతరూపమ్ మహారజతకాంచనే ।
రుక్మం కార్తస్వరం జాంబూనదమష్టాపదోఽ స్త్రియామ్ ॥

అని యమరకోశము. మేరుపర్వతమునకు సమీపమునందున్న నేరేడుపండ్ల రసముతో నిండి ప్రవహించు నదియందుఁ బుట్టినది జాంబూనదము; జాంఘికానామ్ = పిక్క బలము చూపి వేగముగా దూఁకువారి కంటెను; జంఘాలమ్ = శీఘ్రమైన దూఁకుఁడు గలది; జలధిజఠరతః = సముద్రగర్భమునుండి; జగత్యామ్ = లోకములో; జృంభమాణమ్ = విజృంభించునది; జనానామ్ = జనులకు; జీవ + ఆధానమ్ = ప్రాణచైతన్యము నుంచునది; అథ = (తరువాత) మఱియును; జీవ + జైవాతృక + ఆదేః = బృహస్పతి, చంద్రుఁడు మొదలగు గ్రహములయొక్క;

జీవ ఆఙ్గిరసో వాచస్పతిశ్చిత్రశిఖండిజః ।
అబ్జో జైవాతృకః సోమో గ్లౌర్మృగాంకః కళానిధిః ॥ అని యుభయత్ర యమరము.

రుచః + అపి = కాంతులకుఁ గూడ; జనకమ్ = ఉత్పత్తి స్థానమైనది యగు; జలజహితకృతః = పద్మముల కిష్టమును గూర్చు సూర్యునియొక్క; జాజ్వల్యమానమ్

= మిక్కిలి ప్రకాశించు; జ్యోతిః = తేజస్సు; వః = మీకు; జయాయ = జయము కొఱకు; జాయతామ్ = ప్రభవించుఁ గాక!

**తాత్పర్యము :** దేహమునకు జడత్వము, బుద్ధికి మందత్వము మొదలగు శారీరక మానసిక రోగములచేఁ బీడింపఁబడు రోగులకు స్వస్థత చేకూర్చు జీవనౌషధమైనది, పుటము పెట్టిన బంగారువన్నెతోఁ బ్రకాశించునది, శీఘ్రప్రయాణములచే సమాచారము లందించుచు జీవించు జాంఘికుల కంటెను మిక్కిలి వేగముగా దూరముగాఁ బ్రయాణించునది, సముద్రమధ్యభాగమునుండి భూమిపైకి విజృంభించునది, లోకమునందలి సకల జనులకుఁ బ్రాణపోషకమైనది, బృహస్పతి, చంద్రుఁడు మొదలగు నితరగ్రహముల కాంతులకుఁ గూడ జన్మస్థానమైనది, యెక్కువగాఁ బ్రకాశించునది, దేదీప్యమానమైనది యగు సూర్యుని జ్యోతిస్సు మీకు జయమును బుట్టించునదగుఁగాక!

జాంఘికుఁడు : జంఘలపై జీవించువాఁడు.

వేతనాదిభ్యో జీవతి (4–4–12) అను సూత్రముచే జంఘాశబ్దముపై 'ఠక్' ప్రత్యయము; ఠస్యేకః (7–3–50) అను సూత్రముచే నికాగమము వచ్చి **'జాంఘిక'** యని యగును.

జంఘాలుఁడు : 'సిధ్మాదిభ్యశ్చ' (5–2–97) అను సూత్రముచే జంఘా శబ్దముపై 'లచ్' ప్రత్యయము చేరి **జంఘాలు**ఁడని యగును. వడివడిగా నడుచువాఁడు.

జాజ్వల్యమాన: 'జ్వల–దీప్తౌ' అను ధాతువుపై 'యఙ్ – శానచ్' ప్రత్యయములు చేరుటచే నైన రూపము. ఎక్కువగాఁ బ్రకాశించునది యని యర్థము.

ఈ శ్లోకమందంతట జకారానుప్రాసము. ఇది యీ క్రింది సూర్యశతక శ్లోకమున కనుకరణము.

శ్లో॥ భూత్వా జమ్భస్య భేత్తుః కకుభి పరిభవారమ్భభూః శుభ్రభానో–
ర్బిభ్రాణా బభ్రుభావమ్ ప్రసభమభినవామ్భోజజృమ్భాప్రగల్భా ।
భూషా భూయిష్ఠశోభా త్రిభువనభవనస్యాస్య వైభాకరీ ప్రాగ్
విభ్రాన్తి భ్రాజమానా విభవతు విభవోద్భూతయే సా విభా వః ॥ (33)

దీనిలో 29 భకారములు గలవు. జగన్నాథుని శ్లోకములో 24 జకారములు గలవు. సూర్యశతకశ్లోకములో **నోజోగుణము, గౌడీరీతి** గలవు. సుధాలహరీ శ్లోకములోఁ **బ్రసాదగుణము, వైదర్భీరీతి** గలవు. మయూరభట్టు ప్రౌఢకవి. జగన్నాథశర్మ సుకుమారకవి.

## 19

**అవతారిక :** ఇప్పుడు సూర్యకిరణములను గోవులుగా వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥** **ప్రాతర్నిర్గత్య గోభిః సహ రుచివిషయే సఞ్చరన్త్యోఽహ్ని తాభిః**
**సాయం సాయం నికాయమ్ ప్రతి పునరపి యాః సమ్ప్రయాతుం త్వరన్తే ।**
**యాసాం దివ్యప్రభావస్త్రిజగదఘవనశ్రేణిదాహైకదావః**
**క్షేమం తన్వన్తు తా వః శివమయవపుషో వాసరేశస్య గావః ॥** ౧౯

**ప్రతిపదార్థము :** ప్రాతః = వేఁకువజామునందు; గోభిః సహ = ఆవులతోఁగూడి; నిర్గత్య = బయటకు వెడలి; రుచివిషయే = తాము (కిరణములు) సంచరించు ప్రదేశములందు; ఆవులకు రుచించు ప్రదేశములందు. 'విషయో గోచరే దేశే తథా జనపదేఽపి చ' – అని మేదినీ విశ్వకోశములు. అహ్ని = పగటివేళ; సంచరంత్యః = తిరుగునవి; తాభిః = మఱల నా యావులతోడనే కలిసి; సాయం సాయమ్ = ప్రతి సాయంత్రము; నికాయమ్ ప్రతి = నివాసమును; పునః + అపి = మఱల; సంప్రయాతుమ్ = వచ్చుటకు; యాః = ఏ కిరణములు; త్వరంతే = త్వరపడుచున్నవో; యాసామ్ = వేనియొక్క; దివ్యప్రభావః = దైవికమైన శక్తి; త్రిజగత్ = ముల్లోకములందలి; అఘ = పాపమను; వనశ్రేణి = అడవుల పంక్తిని; దాహ = తగులఁబెట్టుటలో; ఏకదావః = ఒకే దావాగ్నియయిన; శివమయవపుషః = మంగళములతో నిండిన దేహముగల; వాసర + ఈశస్య = దినపతియైన సూర్యునియొక్క; తాః = ఆ; గావః = కిరణములు; వః = మీకు; క్షేమమ్ = కుశలమును; తన్వంతు = విస్తరింపఁ జేయుఁగాక!

**తాత్పర్యము :** ప్రభాతసమయమునం దాలమందలతోఁ గూడి రుచిమంతములగు గోసంచార ప్రదేశములందు సంచరించునవి, ప్రతి సాయంకాలము నాగోవుల తోడనే కూడి తమ నివాసములకు మరలివచ్చుటకుఁ దొందరపడునవి, తమ యసాధారణ దైవికశక్తివలన మూఁడు లోకములందలి జనులు చేసిన పాపములనెడి యడవి పంక్తులకు దావాగ్ని వంటివియైన సూర్యునియొక్క కిరణముల మీ కెక్కువ క్షేమమును గల్గఁజేయుఁగాక! అగ్నులు మూఁడు విధములు. అడవిలోఁ బుట్టునది **దావాగ్ని**, సముద్రములోఁ బుట్టునది **బడబాగ్ని**, కడుపులో నున్నది **జఠరాగ్ని**. రుచి = కాంతి, చవి.

సీ॥ తరుణార్క కబళనోద్ధతిఁజూపె నెవ్వాఁడు
రుచులచే ఫలమోహరుచులచేత. (వసు. 1-8)

అని రెండర్థములందును రామరాజభూషణుని ప్రయోగము.

'అభిష్వంగే స్పృహాయాం చ గభస్తౌ చ రుచిః స్త్రియామ్' - అని యమరము.

విషయము : అంశము, గోవులు సంచరించు ప్రదేశము.

గోవు = కిరణము, ఆవు.

ఈ విధముగా రెండర్థములు గల శబ్దములను ప్రయోగించుటచే శ్లేషాలంకారము. సూర్యకిరణములు నిత్యము గోవులతోఁ గలిసి సంచరించుచున్నవని వర్ణించుటచే సహోక్తియలంకారము.

శ్లో॥ సహోక్తిః సహభావశ్చేద్భాసతే జనరంజనః । (5-60) అని చంద్రాలోకము.

అఘములయందు వనశ్రేణిత్వము, ప్రభావమునందు దావత్వము నారోపించుటచే రూపకాలంకారము.

'సాయం సాయం నికాయమ్' - అనుచోట వృత్త్యనుప్రాసము.

'భావః - దావః - తావః - గావః' - అనుచోట నంత్యానుప్రాసము. ఈ విధముగా శబ్దార్థాలంకారములకు సంసృష్టి.

ఈ శ్లోకము మయూరుని సూర్యశతకమునందలి యీ క్రింది శ్లోకమున కనుకరణము.

శ్లో॥ దత్తానందాః ప్రజానాం సముచితసమయాకృష్టసృష్టైః పయోభిః
పూర్వాహ్ణే విప్రకీర్ణా దిశిదిశి విరమత్యహ్ని సంహారభాజః ।
దీప్తాంశోర్దీర్ఘదుఃఖప్రభవభవభయోదన్వదుత్తారనావో
గావో వః పావనానామ్ పరమపరిమితామ్ ప్రీతిముత్పాదయంతు॥

(సూ.శ. 9)

## 20

**అవతారిక :** ఇప్పుడు సూర్యబింబమును బ్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ బృన్దైర్బృన్దారకాణాం దనుతనుజనుషాం రక్షసాం చ క్షపాన్తే**
**గన్ధర్వాణాం ధురీణైః ప్రణతమహివరైః కిన్నరైర్యన్నరైశ్చ ।**
**విద్యాం హృద్యాం నిజేభ్యో వితరదవిరతం దీప్తిభిర్దీపయద్ ద్యా-**
**మద్యాదాద్యామవిద్యామిదముదయగిరేరుద్యదర్కస్య బిమ్బమ్ ॥ ౨౦**

**ప్రతిపదార్థము :** బృందారకాణామ్ = దేవతలయొక్క; బృందైః = సమూహములచేత; 'బృందారకాదైవతాని' 'స్త్రియాం తు సంహతిర్బృందం నికురుంబం కదంబకమ్' – అని యుభయత్ర యమరము. దనుతనుజనుషామ్ = దనువను స్త్రీయొక్క దేహమునుండి జన్మము నొందిన, రక్షసామ్ = రాక్షసుల; బృందైః = సమూహములచేత; 'దనుజతనుజుషామ్' అని పాఠాంతరము. అప్పుడు దనుజదేహము నొందినవారి యని యర్థము. గంధర్వాణాం ధురీణైః = గంధర్వముఖ్యులచేత; అహివరైః = నాగ శ్రేష్ఠులచేత; కిన్నరైః = కిన్నరులచేత; నరైః + చ = మనుష్యులచేత; క్షపా + అంతే = రాత్రి చివరిభాగమున (తెల్లవాఱువేళ); యత్ = ఏది; ప్రణతమ్ = వంగి నమస్కరింపఁ బడుచున్నదో; నిజేభ్యః = తన భక్తజనులకు; హృద్యామ్ = హృదయమునకు హితమైన; విద్యామ్ = జ్ఞానమును; అవిరతమ్ = ఎడతెగకుండ; వితరత్ = ఇచ్చుచున్నదో; దీప్తిభిః = కాంతులచేత; ద్యామ్ = ఆకాశమును; దీపయత్ = ప్రకాశింపఁ జేయునదో; ఉదయగిరేః = తూర్పుకొండనుండి; ఉద్యత్ = ఉదయించుచున్న; తత్ = ఆ; 'యత్తదోర్నిత్యసంబంధః' యచ్ఛబ్దముచేఁ దచ్ఛబ్దమును గ్రహింపవలెను. అర్కస్య బింబమ్ = సూర్యుని బింబము; ఆద్యామ్ = మొదటినుండి యున్న; అవిద్యామ్ = అజ్ఞానమును; అద్యాత్ = నశింపఁజేయుఁగాక!

**తాత్పర్యము :** దేవతల, రాక్షసుల బృందములచే; గంధర్వముఖ్యులచే, నాగశ్రేష్ఠులచేఁ, గిన్నరులచే, నరులచే, వేఁకువజామున నమస్కరింపఁ బడునది, నిజభక్తుల కవిరళముగా జ్ఞానోపదేశము చేయునది, యుదయాచలమునుండి యుదయించునది యగు సూర్యబింబము మనలో ననాదిగా నున్న యజ్ఞానమును దొలఁగించుఁగాక!

**విశేషము :**

కశ్యపప్రజాపతి కరువది మంది భార్యలు గలరు. వారిలో దితికిఁ బుట్టిన వారు దైత్యులు. దనువునకుఁ బుట్టినవారు దానవులు.

అశ్వదేహము, మనుష్యముఖము గలవారు **గంధర్వులు.**

అశ్వముఖము, మనుష్యదేహము గలవారు **కిన్నరులు.**

దేవతలు, రాక్షసులు, గంధర్వులు, కిన్నరులు, నాగులు, నరులు మొదలగు వారందఱు ప్రాతస్సంధ్యయం దుదయించు సూర్యునకు నమస్కరింతురు. భక్తజనుల కెల్లప్పుడు జ్ఞానముపదేశించువాఁడు సూర్యుఁడు. జీవులయం దనాదిగా నున్న యజ్ఞానమును బాఱఁద్రోలువాఁడు సూర్యుఁడు. కావున మనము నిత్యము సూర్యోపాసనము చేయవలయునని కవి భావము.

## 21

**శ్లో॥ ఆపాథోజాసనాయుః క్షణలవఘటికాద్యాత్మకం కాలచక్రమ్**
**ప్రాహుః పూర్వే పురాణాగమవిషయవిదో యస్య లీలావిలాసమ్ ।**
**భావానాం షడ్వికారానథ ఖలు గతిభిర్యశ్చ నిత్యమ్ ప్రసూతే**
**స ప్రాతః పౌరుహూతే పరిలసతి హరిన్మణ్డలే చణ్డభానుః ॥** ౨౧

**ప్రతిపదార్థము :** పాథః = నీరు; 'కబంధముదకమ్ పాథః' – అని యమరము. పాథః + జ = నీటినుండి పుట్టినది పద్మము. పాథో జాసనః = పద్మమాసనముగాఁ గలవాఁడు బ్రహ్మ; ఆపాథోజాసనాయుః = ఆ బ్రహ్మదేవుని యాయుస్సుదాఁక నున్న; క్షణలవ ఘటికా + ఆది = క్షణము, లవము, గడియ మొదలుగా నున్న; క్షణ = 30 కళల కాలము; లవ = త్రుటి; ఘటికా = ముహూర్తకాలము; ఆది + ఆత్మకమ్ = మొదలుగాఁ గాలమానస్వరూపమైన; కాలచక్రమ్ = సమయవలయమును; పూర్వే = ప్రాచీనులయిన; పురాణ + ఆగమవిషయవిదః = పురాణములందు, శాస్త్రములందు, వేదములందు నున్న యంశములను బాగుగాఁ దెలిపిన పండితులు; యస్య = ఏ సూర్యునియొక్క; లీలావిలాసమ్ = క్రీడావైభవమని; ప్రాహుః = చెప్పిరో; అథ = ఇంకను; భావానామ్ = భావపదార్థములయొక్క; షడ్ + వికారాన్ = ఆఱువిధములైన వికృతులను; ఖలు = నిశ్చయముగా; యః చ = ఎవఁడు; గతిభిః = తనయొక్క గమనములచే; నిత్యమ్ = ప్రతిదినము; ప్రసూతే = పుట్టించుచున్నాఁడో; సః = ఆ; చండభానుః = తీక్ష్ణమైన కిరణములు గల సూర్యుఁడు; ప్రాతః = ప్రభాతకాలమునందు; పౌరుహూతే = ఇంద్రునకు సంబంధించిన; హరిత్ + మండలే = దిగ్వలయమునందు; (తూర్పు దిక్కునందు); పరిలసతి = బాగుగాఁ బ్రకాశించుచున్నాఁడు.

**తాత్పర్యము :** క్షణము, లవము, గడియ మొదలుకొని బ్రహ్మ యాయుర్దాయ పర్యంతము గల యీ కాలచక్ర మేసూర్యుని క్రీడావిశేషమని ప్రాచీనులైన పురాణ – శాస్త్ర – వేద పండితులు వక్కాణించుచున్నారో, యా చండభానుఁడు తూర్పుదిక్కునందు సంపూర్ణముగాఁ బ్రకాశించుచున్నాఁడు.

**బ్రహ్మ యాయుఃప్రమాణము**

ఆ చ సత్యలోకాదాచావీచేర్జ్ఞాయస్వ్రమియస్వేతి విపరివర్తమానం క్షణ ముహూర్తయామాహో రాత్రార్ధమాసమాసర్త్వయనవత్సర యుగచతుర్యుగ మన్వంతర ప్రలయ మహాప్రలయ మహాసర్గావాంతరసర్గ సంసారసాగరోర్మిభిరనిశముహ్యమానం తాపత్రయపరీతమాత్మానం జీవలోకం చావలోక్య – అని షడ్దర్శనచక్రవర్తులగు **శ్రీవాచస్పతి మిశ్రుల బ్రహ్మసూత్ర శ్రీశంకరభాష్య – భామతి.**

1 కనురెప్పపాటు కాలము = 1 నిమేషము

18 నిమేషములు = 1 కాష్ఠ

30 కాష్ఠలు = 1 కళ

30 కళలు = 1 క్షణము

12 క్షణములు = 1 ముహూర్తము

30 ముహూర్తములు = 1 దినము

2 1/2 నిమేషములు = 1 విగడియ

60 విగడియలు = 1 గడియ

30 గడియలు = 1 పూఁట

60 గడియలు = 1 దినము

15 దినములు = 1 పక్షము

2 పక్షములు = 1 మాసము

2 మాసములు = 1 ఋతువు

3 ఋతువులు = 1 అయనము

2 అయనములు = 1 సంవత్సరము

360 మానవ సంవత్సరములు = 1 దేవ వత్సరము

కృతయుగము = 1728000 మానవ సంవత్సరములు

త్రేతాయుగము = 1296000 మానవ సంవత్సరములు

ద్వాపరయుగము = 864000 మానవ సంవత్సరములు
కలియుగము = 432000 మానవ సంవత్సరములు
మహాయుగము = 4,32,20,000 మానవ సంవత్సరములు

1 మహాయుగములో 12000 దేవ వత్సరములు 4,32,20,000 మానవ వత్సరములు నుండును. 1000 మహాయుగములు = బ్రహ్మకు 1 దినము. దీనికే కల్పమని పేరు. 1 కల్పములో 43,22,00,00,000 మానవ వత్సరములుండును.

30 బ్రహ్మదినములు = 30,000 మహాయుగములు – 1 బ్రహ్మమాసము.

12 బ్రహ్మమాసములు = 3,60,000 మహాయుగములు – 1 బ్రహ్మసంవత్సరము.

ఇటువంటి 100 సంవత్సరములు బ్రహ్మసంపూర్ణాయుఃప్రమాణము. బ్రహ్మదేవుని 100 సంవత్సరముల యాయువులో మొదటి 50 సంవత్సరములకుఁ బ్రథమపరార్ధమని, తక్కిన 50 సంవత్సరములకు ద్వితీయ పరార్ధమని పేరు. బ్రహ్మకుఁ బ్రథమపరార్ధము గతించినది. ద్వితీయ పరార్ధములో మొదటి సంవత్సరములో మొదటి దినము ప్రస్తుతము నడుచుచున్నది. బ్రహ్మయాయుఃప్రమాణము దాఁక నున్న యీ కాలచక్రమంతయు సూర్యగమనమువల్లనే యేర్పడుచున్నది.

## షడ్భావవికారములు

భావపదార్థముల కన్నింటికి 6 వికారములుండును.

(1) జాయతే = పుట్టుట (2) అస్తి = ఉండుట (3) వర్ధతే = వృద్ధి పొందుట (4) విపరిణమతే = విపరిణామమును బొందుట (5) అపచీయతే = క్షీణించుట (6) నశ్యతి = నశించుట – యివి షడ్భావ వికారములని యాస్కాచార్యులు నిరుక్తములోఁ జెప్పినారు. పదార్థములకీ యాఱు విధములగు మార్పులు కూడ సూర్యగమనము వల్లనే కల్గుచున్నవి.

## 22

**అవతారిక :** ఇప్పుడు మఱల సూర్యకిరణములనే ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ అజ్ఞాని బ్రాహ్మణానాముషసి హిమభరాసజ్జతో భఙ్గురాణి**
**వ్యాలక్ష్య ద్రాక్ ప్రయాతా రిపుజనితరుషేవాఽరుణా వాసవాశామ్ ।**

ధర్మధ్వంసోద్ధురుణామఖిలమపి కులం జక్షతః శోభితక్ష్మా
యక్ష్మాణమ్ మే హరన్తు త్వరితమఘభిదో భానవశ్చణ్డభానోః ॥ ౨౨

**ప్రతిపదార్థము :** బ్రాహ్మణానామ్ = బ్రాహ్మణులయొక్క; అంగాని = దేహములు లేక శరీరావయవములు; ఉషసి = వేఁకువవేళ; హిమభర = మంచుభారముయొక్క; ఆసంగతః = కూడికవలన; భంగురాణి = కొంకరలై నశించుచున్నవని; వ్యాలక్ష్య = బాగుగా నాలోచించి; రిపు = శత్రువైన మంచుపై; జనిత = పుట్టిన; రుషా + ఇవ = కోపముచేత వలె; అరుణాః = ఎఱ్ఱఁబడినవై; వాసవ + ఆశామ్ = ఇంద్రుని దిక్కైన తూర్పునకు; ప్రయాతాః = ప్రయాణమై పోవునవి; ధర్మ = ధర్మమును; ధ్వంస = నాశనము చేయుటలో; ఉద్ధురుణామ్ = దిట్టలైన వారియొక్క; అఖిలమ్ = సమస్తమైన; కులమ్ + అపి = వంశమును గూడ; జక్షతః = భక్షించునవి; 'జక్ష – భక్షహసనయోః' – అదాది ధాతువు. శోభితక్ష్మాః = శోభతో నింపిన భూమండలముగలవి, 'క్ష్మాऽవనిర్మేదినీ మహీ' – అని యమరము. అఘభిదః = పాపములను భేదించినవియగు; లేక అఘభిదః = పాపమును భేదించువానియొక్క; యని సూర్యునకు విశేషణముగాఁ గూడఁ జెప్పుకొనవచ్చును. చండభానోః = సూర్యునియొక్క; భానవః = కిరణములు; మే = నాయొక్క; యక్ష్మాణమ్ = క్షయరోగమును; హరంతు = హరించుఁగాక! పోఁగొట్టుఁ గాక! 'పుమాన్ యక్ష్మా క్షయః శోషః' – అని యమరము.

**తాత్పర్యము :** బ్రాహ్మణులు తెల్లవాఱుజామునందే లేచి స్నానము చేసి ప్రాతఃసంధ్యా వందనము చేయుదురు. వేఁకువవేళ మంచెక్కువగాఁ గురియుచుండును. దట్టముగాఁ గురియు మంచుధారలకు బ్రాహ్మణుల దేహములు, శరీరావయవములు కొంకరలై చచ్చుపడిపోవును. మంచు సూర్యునకు సహజశత్రువు. బ్రాహ్మణులను బీడింపఁ జేయుచున్న తనకు సహజశత్రువైన మంచుపైఁ గోపించినవేమో యన్నట్లుగా నెఱ్ఱనైన సూర్యకిరణములు తూర్పుదిక్కునకుఁ బ్రయాణించుచున్నవి. ధర్మమును ధ్వంసము చేయువారిని సూర్యకిరణములు ధ్వంసము చేయుచున్నవి. పాపములను భేదించు చున్నవి. అట్టి సూర్యుని కిరణములు నా శరీరమును శుష్కింపఁ జేయు రోగములను నాశనము చేయుఁగాక!

ఇక్కడ శత్రువైన మంచుపైఁ గోపించుటచే సూర్యకిరణము లెఱ్ఱఁబడినవని కవి యూహించుటచే నుత్ప్రేక్షాలంకారము.

## 23

**అవతారిక :** ఇప్పుడు మంగళమిమ్మని సూర్యునిఁ బ్రార్థించుచున్నాఁడు -

**శ్లో॥ విశ్రాన్తిమ్ బ్రాహ్మణానాం సుఖమతిశయితం కామినాం స్థాయిలీలా-**
**మమ్భోజానామ్ ప్రబోధం కుసుమపరిషదాం యశ్చికీర్షన్ దయార్ద్రః।**
**నిర్యాత్యన్తస్సముద్రం సకలమపి నృణామ్ భారమాధాయ వహ్నౌ**
**వహ్నీయాహ్నామధీశః స భవతు భవతామ్ భూయసే మఙ్గళాయ ॥** ౨౩

**ప్రతిపదార్థము :** బ్రాహ్మణానామ్ = బ్రాహ్మణులకు; విశ్రాంతిమ్ = ఊఱటను; కామినామ్ = కోరికలు గలవారికి; అతిశయితమ్ = ఎక్కువయైన; సుఖమ్ = ఆనందమును; అంభోజానామ్ = పద్మములకు; స్థాయిలీలామ్ = స్థిరవిలాసమును; కుసుమపరిషదామ్ = పూవుల సంఘములకు; ప్రబోధమ్ = మేలుకొలుపును; యః = ఎవఁడు; దయా + ఆర్ద్రః = కృపతోఁ జెమర్చిన దేహము కలవాఁడై; చికీర్షన్ = కోరుచున్నాఁడో; నృణామ్ = మనుష్యులయొక్క; సకలమ్ = సమస్తమైన; భారమ్ = బరువును; అపి = కూడ; వహ్నౌ = అగ్నియందు; ఆధాయ = ఉంచి; అంతస్సముద్రమ్ = సముద్రము లోపలినుండి; నిర్యాతి = బయటకు వెలువడు చున్నాఁడో; సః = ఆ; అహ్నామ్ + అధి + ఈశః = పగటివేళలకుఁ బ్రభువైన సూర్యుడు; భవతామ్ = మీకు; భూయసే = ఎక్కువగా; మంగళాయ = భద్రము కొఱకు; భవతు = అగుఁగాక!

**తాత్పర్యము :** బ్రాహ్మణులకు విశ్రాంతిని; అర్థుల కతిశయించిన సౌఖ్యమును; పద్మములకు స్థిరమైన వికాసమును; పూవుల పరిషత్తులకు మేలుకొల్పులను - దయార్ద్రబుద్ధితో నెవఁడు కోరుచున్నాఁడో; సమస్తజీవకోటియొక్క బరువు నంతటి నగ్నిదేవుని యందుంచి సముద్రగర్భమునుండి బయటి కెవ్వఁడు వచ్చుచున్నాఁడో యట్టి దినపతియగు సూర్యుఁడు మీ కెక్కువ మంగళ మిచ్చువాఁడగుఁ గాక!

**విశేషము :** 'అగ్నింవావాదిత్యః సాయమనుప్రవిశతి। ఉద్యంతం వావాదిత్యమగ్నిరను సమారోహతి ॥'

సాయంసంధ్య యందు సూర్యకాంతు లగ్నిలోఁ బ్రవేశించును. మరలఁ బ్రాతఃకాలము నం దుదయించెడు సూర్యునియందా యగ్నికాంతులు ప్రవేశించునని వేదము చెప్పుచున్నది. అందువలనఁ బగటివేళ జీవకోటి భారమును సూర్యుఁడు

వహించుచున్నాఁడు. రాత్రవేళఁ బ్రాణికోటి బరువును మోయుటకు సూర్యుఁడు తన తేజస్సు నగ్ని యందుంచుచున్నాఁడని వర్ణించినాఁడు.

**24**

**శ్లో॥ ద్రాగాహత్య ప్రభాతే రజని హిమవతః కౌముదీః కౌతుకేన**
**ప్రోద్యత్ప్రౌఢానుకమ్పాః పునరపి ఖలు యే సాయముజ్జీవయన్తి ।**
**ఆరుణ్యే పల్లవానామథ గురుచరణాః శక్రగోపావలీనాం**
**తే యుష్మద్భావలీనాం దినకరకిరణాః క్లాన్తిమున్మూలయన్తు ॥** ౨౪

**ప్రతిపదార్థము :** ప్రభాతే = ప్రాతఃకాలమునందు; రజని హిమవతః = రాత్రి కురియు మంచు గల చంద్రునియొక్క; కౌముదీః = వెన్నెలను; కౌతుకేన = కుతూహలముతో; 'కౌతూహలం కౌతుకంచ కుతుకం చ కుతూహలమ్' – అని యమరము. ద్రాక్ = శీఘ్రముగా; ఆహత్య = పోఁగొట్టి; పునః + అపి = మఱల; ప్ర + ఉద్యత్ = ఉదయించుచున్న; ప్రౌఢ + అనుకంపాః = ఎక్కువ దయతోఁ గూడినవై; యే = ఏ సూర్యకిరణములు; ఖలు = నిశ్చయముగా; సాయమ్ = సాయంత్రమునందు; ఉత్ + జీవయంతి = బాగుగా జీవింపఁజేయుచున్నవి; పల్లవానామ్ = చిగుళ్ళకు; అథ = పూర్తిగా; శక్రగోప + ఆవలీనామ్ = ఆరుద్రపురుగుల పంక్తులకు; ఆరుణ్యే = ఎఱ్ఱని రంగుతో నొప్పుటలో; గురుచరణాః = ఆచార్య పాదులైనవియగు; తే = ఆ; దినకరకిరణాః = సూర్యుని వెలుఁగులు; యుష్మత్ = మీయొక్క; భావ = మనస్సులో; లీనామ్ = అంతర్గతముగా నున్న; క్లాంతిమ్ = బడలికను; ఉన్మూలయంతు = వ్రేళ్ళతోఁ బైకిఁ బెకలించి వేయుఁగాక!

**తాత్పర్యము :** ప్రాతఃకాలమునందు సూర్యుఁడుదయించుట, సాయంకాలమునందుఁ జంద్రుఁడుదయించుట, చిగుళ్ళు, నారుద్రపురుగులు నెఱ్ఱగా నుండుట ప్రకృతిసిద్ధమైన విషయములు.

ప్రాతఃకాలమునందు సూర్యునియొక్క కిరణములు చంద్రునియొక్క వెన్నెలను సంహరించుచున్నవి. మఱల నా సూర్యకిరణములే యుప్పొంగుచున్న దయతో సాయంత్రము చంద్రునియందు వెన్నెలలను బ్రతికించుచున్నవి. ఎఱ్ఱగా నుండుటలోఁ జిగుళ్ళకు నారుద్రపురుగులకు నాచార్యకత్వము వహించుచున్నవి. అట్టి సూర్య కిరణములు మీ హృదయముల లోపలనున్న శోకమును బూర్తిగా రూపుమాపుఁ గాక!

ఇక్కడ 'లీనాం లీనామ్' అని రెండు హల్లులర్థ భేదముతో రెండు మాఱులు వచ్చుటచే ఛేకానుప్రాసము. ఛేకులు = విదగ్ధులు (నేర్పరులు)

చిగుళ్ళకు నారుద్రపురుగులకు నెఱ్ఱతనములో గురువులైనవని చెప్పుటచే సూర్యకిరణముల రంగు వానికి సంక్రమించుచున్నదని యర్థము స్ఫురించుటచేఁ దద్గుణాలంకారధ్వని.

**విశేషము :** పాదశబ్దము, చరణశబ్దము పెద్దవారికిఁ జివర బహువచనముతోఁ జేర్చుట గౌరవసూచకమై పూజ్యభావమును వెల్లడించును. గురుచరణులనఁగాఁ బూజింపఁదగిన పాదములు గల గురువులని యర్థము. భగవత్పాదులు, తాతపాదులు మొదలగునవి యిట్టివే.

శ్లో॥ జీవత్సు తాతపాదేషు నూతనే దారసంగ్రహే ।
భ్రాతృభిశ్చింత్యమానానాం తే హి నో దివసా గతాః ॥ (ఉత్తర-1-19)

అను భవభూతి శ్లోకములోఁ 'దాతపాదులనఁగాఁ బూజింపఁ దగిన తండ్రి గారు (దశరథుఁడు) అని యర్థము. "తాతపాదేషు - పితరీత్యర్థః। పూజాయామ్ పాదశబ్దో బహువచనే। ఉత్తమానాం స్వరూపం తు పాదశబ్దేన భణ్యతే॥" అని వీరరాఘవాచార్యుల 'తలస్పర్శినీ' వ్యాఖ్య. జీవత్తాతపాదుండు (పాండు. 3-6) అను తెనాలి రామకృష్ణ కవి పద్యములో జీవించుచున్న తండ్రిగారు కలవాఁడని యర్థము. ఇచ్చట నేకవచనము నిగమశర్మకుఁ జెందునుగాని తండ్రిగారికిఁ జెందదు.

## 25

**అవతారిక :** ఇప్పుడు సూర్యబింబమును స్తుతించుచున్నాఁడు -

**శ్లో॥ ద్రాగద్వైతం వితన్వత్ త్రిభువనమభితః కౌఙ్కుమీనాం ద్యుతీనాం
న్యక్కుర్వన్ మాన్ద్యముద్రామథ రజనిరుజాం కోకసీమన్తినీనామ్ ।
తన్ద్రాన్ధానాన్ధ్యసిన్ధోరిహ వితతతరైరుద్ధధానం కరాగ్రైః
స్వాన్తధ్వాన్తం ధునీతాముదయగిరిశిరశ్చుమ్బి మార్తాణ్డబిమ్బమ్॥** ౨౫

**ప్రతిపదార్థము :** త్రిభువనమ్ = స్వర్గము, మర్త్యము, పాతాళము నను మూఁడు లోకములందు; అభితః = అంతట; 'సమీపోభయతః శీఘ్రసాకల్యాభిముఖే౽భితః' - అని యమరము. కౌంకుమీనామ్ = కుంకుమమునకు సంబంధించిన యెఱ్ఱని;

ద్యుతీనామ్ = కాంతులకు; అద్వైతమ్ = ఏకత్వమును; వితన్వత్ = విస్తరించునది; అథ = తరువాత; రజనిరుజామ్ = రాత్రులందుఁ బ్రియ విరహముచే మనోవ్యాధి నొందిన; కోకసీమంతినీనామ్ = జక్కువపిట్టలయొక్క; మాంద్యముద్రామ్ = మందత్వముచే ముడిఁగి యుండుటను; న్యక్కుర్వత్ = ధిక్కరించునదియు; తంద్రా = నిద్రచే; అంధాన్ = గ్రుడ్డితనము పొందినవారిని; ఆంధ్యసింధోః = అంధత్వమనెడు సముద్రము నుండి; వితతతరైః = పొడవుగా వ్యాపించిన; కర + అగ్రైః = కిరణముల కొనలచే; ఉత్ + దధానమ్ = పైకి లేవనెత్తునది; ఉదయగిరి = తూర్పుకొండయొక్క; శిరః = శిఖరభాగమును; చుంబి = ముద్దుపెట్టుకొనునదియగు; మార్తాండబింబమ్= సూర్యబింబము; (నః = మాయొక్క యని యధ్యాహారము చేసికొనవలయును); స్వాంతధ్వాంతమ్ = మనస్సులో నున్న చీఁకటిని (అజ్ఞానమును); ధునీతామ్ = కదలించివేయుఁగాక! పోఁగొట్టుఁ గాక!

**తాత్పర్యము :** మూఁడు లోకములందు సంపూర్ణముగాఁ గుంకుమ కాంతులను నింపునది; చక్రవాక స్త్రీల విరహవ్యథా రోగమును రూపుమాపునది, నిద్రచేఁ గునికిపాట్లు పడుచు గ్రుడ్డితనము నొందిన వారి నంధత్వసముద్రమునుండి పొడవైన చేతులవంటి కిరణములతో నుద్ధరించునది, పూర్వాచలశిఖరమును ముద్దాడునదియు నగు సూర్యబింబము హృదయాంధకారమును నశింపఁ జేయుఁగాక!

కర = చేయి, కిరణమునని రెండర్థములుండుటచే శ్లేషము.

**విశేషము :** ఇక్కడ నన్ని ప్రతులయందు 'వితన్వంస్త్రిభువన' యను పాఠమే కలదు. బింబ శబ్దము నపుంసకలింగ మగుటచే 'వితన్వన్' 'న్యక్కుర్వన్' అను రూపములుండవు. 'వితన్వత్' 'న్యక్కుర్వత్' అనునవి సాధువులు.

కాఁబట్టి 'వితన్వత్ త్రిభువన' అనునది సాధుపాఠము. చంద్రప్రభాకర్తలగు భువనేశ్వరకరశర్మగారీ పాఠమునే స్వీకరించినారు.

**26**

**అవతారిక :** ఇప్పుడు సూర్యుఁడు కల్పవృక్షమని రూపించుచున్నాఁడు –

**శ్లో॥ శుద్ధమ్ బ్రహ్మలవాలమ్ ప్రకృతిశబలితం యస్య మూలం కరాస్తద్**
**ద్రాఘిష్ఠస్వర్ణశాఖా వికసదరుణిమా పల్లవానాం విలాసః ।**

**నీలం వ్యోమాలిమాలా సురసఫలభరో ధర్మకామార్థమోక్షా-**
**స్స శ్రీమాన్ వాఞ్ఛితార్థం వితరతు సతతం సూర్యకల్పద్రుమో వః ॥ ౨౬**

**ప్రతిపదార్థము :** యస్య = ఎవనికి (దేనికి); శుద్ధమ్ బ్రహ్మ = నిర్గుణమైన పరబ్రహ్మము; ఆలవాలమ్ = పాదు; ప్రకృతిశబలితమ్ = ప్రకృతిచేఁ జిత్రితమైన బ్రహ్మము; తత్ = ఆ; మూలమ్ = వేరు; శుద్ధబ్రహ్మమాలవాలమని, శబలబ్రహ్మము మూలమని భావము. కరాః = కిరణములు; ద్రాఘిష్ఠస్వర్ణశాఖాః = పొడవైన బంగారు కొమ్మలు; వికసత్ + అరుణిమా = వికసించుచున్న యెఱుపురంగే; పల్లవానామ్ = చిగుళ్ళయొక్క; విలాసః = వైభవము, నీలమ్ = నల్లని, వ్యోమ = ఆకాశము; అళిమాలా = తుమ్మెదల పంక్తి; ధర్మకామ + అర్థమోక్షాః = ధర్మము, కామము, అర్థము, మోక్షము నను చతుర్విధ పురుషార్థములు; సురసఫలభరః = మంచి రసముతో నిండిన పండ్ల భారము; సః = అట్టి; శ్రీమాన్ = శ్రీమంతుఁడైన (శ్రీమంతమైన); సూర్యకల్పద్రుమః = సూర్యుఁడను కల్పవృక్షము; సతతమ్ = ఎల్లప్పుడు; వః = మీకు; వాంఛితార్థమ్ = కోరిన యర్థమును; వితరతు = ఇచ్చుఁగాక!

**తాత్పర్యము :** నిర్గుణమైన బ్రహ్మమే చెట్టు మొదలిపాదు. చిత్రవర్ణమైన ప్రకృతియే వేరు. కిరణములే పొడవైన బంగారు కొమ్మలు. ఎఱుపు రంగే చిగురుటాకుల విలాసము. నల్లని యాకాశమే తుమ్మెదల గుంపు. ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థములే మంచి రసముతో నిండిన పండ్లు. అటువంటి శ్రీమంతమైన సూర్యుఁడనెడు కల్పవృక్షము మీ కోరిన కోరికలు తీర్చుఁగాక!

ఈ శ్లోకములో సూర్యునియందుఁ గల్పద్రుమత్వము నారోపించుటచే రూపకాలంకారము.

## 27

**అవతారిక :** ఇప్పుడు సూర్యకిరణములు మన ప్రయాసములను బోఁగొట్టుఁగాక! యని ప్రార్థించుచున్నాఁడు -

శ్లో॥ **నీహారం నిమ్నగాభ్యో నిఖిలనయనతో నీరజేభ్యశ్చ నిద్రాం**
**నీడేభ్యో నీడజానాం నికరముషసి యే నిత్యముద్వాసయన్తి ।**
**సాయం తేష్వేవ తేషామ్ పునరపి ఘృణయా కల్పయన్తే చ వాసం**
**తే వః సన్తు ప్రయాసం ఘృణిఘన ఘృణయో హన్తుమాబద్ధకక్షాః॥ ౨౭**

**ప్రతిపదార్థము :** నిమ్నగాభ్యః = నదులనుండి; 'స్రవంతీ నిమ్నగాఽఽపగా' – అని యమరము. నీహారమ్ = మంచును; 'అవశ్యాయస్తు నీహారస్తుషారస్తుహినం హిమమ్' – అని యమరము. నిఖిలనయనతః = సకల ప్రాణుల కన్నులనుండి; చ = మఱియు; నీరజేభ్యః = పద్మములనుండి; నిద్రామ్ = నిద్రను; నీడేభ్యః = గూండ్లనుండి; 'కులాయో నీడమస్త్రియామ్' – అని యమరము. నీడజానామ్ = పక్షులయొక్క; నికరమ్ = సమూహమును; ఉషసి = ప్రాతఃకాలములో; నిత్యమ్ = ప్రతిదినము; యే = ఏ సూర్యకిరణములు; ఉద్వాసయంతి = వెళ్ళఁగొట్టుచున్నవో; పునః + అపి = మఱల నింకను; సాయమ్ = సాయంకాలమునందు; తేషు + ఏవ = వానియందే యనఁగా నదులందు, కన్నులందు, పద్మములయందు, గూండ్లయందు; తేషామ్ = వానియొక్క, యనఁగా మంచును, నిద్రను, పక్షులను; వాసమ్ = నివాసమును; ఘృణయా = దయతో; 'కారుణ్యం కరుణా ఘృణా కృపా దయానుకంపా స్యాత్' – అని యమరము. కల్పయంతే చ = కల్పించుచున్నవో; తే = ఆ; ఘృణిఘున = సూర్యునియొక్క; ఘృణయః = కిరణములు; వః = మీయొక్క; ప్రయాసమ్ = కష్టమును; హంతుమ్ = చంపుటకు; ఆబద్ధకక్షాః = బిగించిన కచ్చ గలవి; సంతు = అగుఁగాక!

**తాత్పర్యము :** నదులనుండి మంచును, జీవుల కన్నుల నుండియుఁ బద్మముల నుండియు నిద్రను, గూండ్లనుండి పక్షులను నేవి యుద్వాసము చేయుచున్నవో, మరల సాయంకాలమునందు దయతో నదులయందు మంచును, నేత్రములందుఁ బద్మములందును నిద్రను, గూండ్ల యందుఁ బక్షులను నిలుపుచున్నవో యా సూర్యుని కిరణములు మీయొక్క కష్టములను బోఁగొట్టుటకు గోఁచులను బిగించుఁ గాక!

మంచు తగ్గుటకుఁ గురియుటకు, ప్రాణులు నిద్రించుటకు మేలుకొనుటకు, పద్మములు వికసించుటకు, ముడుచుకొనుటకు, పక్షులు గూండ్లనుండి వెలువడుటకుఁ జేరుకొనుటకు సూర్యకిరణములే కారణమని భావము.

ఇక్కడఁ బూర్వార్ధమునందలి శబ్దములు నీకారముతో నారంభమగుటచే నను్ప్రాసమువలన సొగసువచ్చినది. మంచు, నిద్ర, పక్షులు నను మూఁడు వస్తువులకు నుద్వాసనము చేయుట, కల్పించుటయను నేకక్రియతో నన్వయము చెప్పుటచేఁ దుల్యయోగితాలంకారము.

శ్లో॥ 'వర్ణ్యానామితరేషాం చ ధర్మైక్యం తుల్యయోగితా' (కువలయా–44) అని కువలయానందము.

**విశేషము :** 'ఘృణి' శబ్దమునకుఁ గిరణమని యొక యర్థమే కాని భానుశబ్దమువలె సూర్యుఁడు, కిరణమునను రెండర్థములు లేవు. కాఁబట్టి ఘృణి = సూర్యునియొక్క; ఘనఘృణయః = గొప్ప కిరణములని యర్థము చెప్పఁగూడదు.

> కిరణోఽస్రమయూఖాంశుగభస్తిఘృణిఘృష్టయః ।
> భానుః కరో మరీచిః స్త్రీపుంసయోర్దీధితిః పుమాన్ ॥ అని యమరము.

ఘృణిర్జ్వాలాంశువీచీషు – అని వైజయంతి.

ప్రద్యోతగభస్తిరశ్మిఘృణికిరణాః – అని యభిధానరత్నమాల.

విశ్వ–మేదినీ – నానార్థరత్నమాలాది నానార్థకోశములలో 'ఘృణి' శబ్దమే లేదు. కాఁబట్టి ఘృణిభిః ఘనః = ఘృణిఘనః = ఘృణులచే ఘనుఁడైనవాఁడు సూర్యుఁడని యర్థము చెప్పుకొనవలెను.

## 28

**అవతారిక :** సూర్యకిరణములు తన మానసికవ్యాధిని సంహరింపవలయునని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ సంహృత్య ద్రాగ్ బహిఃస్థం తిమిరకులమథాభ్యన్తరం హర్తుకామా**
**రన్ధ్రాళీభిర్గృహాణాముదరమనుదినం యేఽవిశఙ్కం విశన్తి ।**
**భానోస్తేఽమీ హృషీకాణ్యఖిలతనుభృతాం హర్షయన్తో హితేహా**
**హృద్రోగం సంహరన్తాం హిమమహిమహృతో హేమహృద్యాః కరా నః ॥** ౨౮

**ప్రతిపదార్థము :** బహిఃస్థమ్ = బైటనున్న; తిమిరకులమ్ = చీఁకటుల వంశమును; 'అంధకారోఽస్త్రియాం ధ్వాంతం తమిస్రం తిమిరం తమః' – అని యమరకోశము. ద్రాక్ = వెంటనే; సంహృత్య = సంహరించి; అథ = తరువాత; అభ్యంతరమ్ = లోపలనున్న చీఁకటిని; హర్తుకామాః = హరింపఁ గోరినవై; అనుదినమ్ = ప్రతిదినము; రంధ్ర + ఆలీభిః = ఇంటి కప్పు కన్నముల వరుసల నుండి; 'వీథ్యాలిరావలిః పంక్తిశ్రేణీ లేఖాస్తు రాజయః' – అని యమరము. గృహాణామ్ = ఇండ్లయొక్క; ఉదరమ్ = గర్భమును; యే = ఏ సూర్యకిరణములు; విశంకమ్ = సందేహము లేకుండ; విశంతి = ప్రవేశించుచున్నవో; అఖిలతనుభృతామ్ = ఎల్ల శరీరధారుల (ఇది 'హితేహాః' తోఁగూడ నన్వయించును); హృషీకాణి = ఇంద్రియములను; 'హృషీకం

విషయీంద్రియమ్' – అని యమరము. హర్షయంతః = సంతోషింపఁజేయునవి; హిత + ఈహాః = హితవును గోరునవి; 'ఇచ్ఛా కాంక్షా స్పృహేహాతృడ్ వాంఛా లిప్సా మనోరథః' – అని యమరము; హిమ = మంచుయొక్క; మహిమ = గొప్పతనమును; హృతః = హరించునవి; హేమహృద్యాః = బంగారమువలె మనోహరములైనవి యగు; తే = ఆ; అమీ = ఈ; భానోః కరాః = సూర్యుని కిరణములు; నః = మాయొక్క; హృత్ + రోగమ్ = మానసిక రోగమును (ఆధిని); సంహరంతామ్ = సంహరించుఁగాక! పోఁగొట్టుఁ గాక!

**తాత్పర్యము :** బైటనున్న చీఁకట్ల సమూహమును వెంటనే సంహరించి లోపలనున్న చీఁకటిని సంహరింపఁ గోరినవై యింటి రంధ్రములనుండి గర్భగృహములలోనికి శంక లేకుండఁ బ్రవేశించునవి, సకల జీవకోటుల యింద్రియములను హర్షింపఁ జేయునవి, సకల ప్రాణుల హితమును గోరునవి, మంచు మహిమను హరించునవి, బంగారు తీఁగెలవలె మనోజ్ఞములైనవి యగు నా సూర్యుని కిరణములు మాయొక్క హృదయములందలి రోగములను నశింపఁజేయుఁగాక!

మనస్సునందుఁ బుట్టు రోగములు 'ఆధులు'. దేహమునందుఁ బుట్టు రోగములు వ్యాధులు. 'పుంస్యాధి ర్మానసీ వ్యథా' 'రోగవ్యాధిగదామయాః' అని యుభయత్ర యమరము.

ఈ శ్లోకమునందలి యుత్తరార్ధములోని శబ్దములు హకారముతో నారంభమై పద్యసౌందర్యమును హెచ్చించుచున్నవి.

హర్తుకామః – 'హర్తుమ్ + కామః' అని యుండఁగా 'లుంపేదవశ్యమః కృత్యే తుం కామ మనసో రపి' అను వచనముచే తుమున్నంతమునకుఁ గామ శబ్దము పరమైనప్పుడు మకారలోపము గలిగి **'హర్తుకామ'** యని యగును. 'హర్తుకామాః' బహువచనరూపము.

## 29

**అవతారిక :** ఇప్పుడు సూర్యకిరణములు పాండురోగమును ఖండించుఁగాక! యని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ బ్రహ్మాణ్డమ్ మణ్డయన్తో వియతి వలయినో మణ్డలైరణ్డజానామ్**
**పాషణ్డాన్ దణ్డయన్తో దనుతనుజనుషః శోభితాఖణ్డలాశాః ।**

**యే షణ్డాన్ పౌణ్డరీకాన్ విదలయితుమథోద్దణ్డపాణ్డిత్యభాజ**
**స్తే చణ్డాంశోరచణ్డాస్త్వరితమిహ కరాః పాణ్డుతాం ఖణ్డయన్తు॥ ౨౯**

**ప్రతిపదార్థము :** యే = ఏవి; బ్రహ్మాండమ్ = సమస్తవిశ్వమును; మండయంతః = అలంకరించుచున్నవో; వియతి = ఆకాశమునందు; 'వియద్విష్ణుపదం వా తు పుంస్యాకాశ విహాయసీ' – అని యమరము; అండజానామ్ = పక్షులయొక్క; మండలైః = గుంపులచేత; వలయినః = గుండ్రముగాఁ గంగణాకారముతో నున్నవో; పాషండాన్= వేదధర్మవిరోధులైన; దనుతనుజనుషః = దనువు దేహమునుండి పుట్టిన రాక్షసులను; దండయంతః = దండించుచున్నవో; శోభిత = ప్రకాశింపఁబడిన; ఆఖండల + ఆశాః = ఇంద్రుని దిక్కైన తూర్పు గలవో; 'ఆఖండలః సహస్రాక్షః', 'దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చ తాః' – అని యుభయత్ర యమరము; అథ = ఇంకను; పౌండరీకాన్ = పద్మసంబంధములైన; షండాన్ = సమూహములను; 'పుండరీకం సితాంభోజమ్' 'అబ్జాది కదంబే షండమస్త్రియామ్' – అని యుభయత్ర యమరము. విదలయితుమ్ = వికసింపఁజేయుట యను; ఉద్దండ పాండిత్యభాజః = అధిక విద్వత్త్వము కలవియో; తే = ఆ; చండాంశోః = సూర్యునియొక్క; అచండాః = వేఁకువ సమయములోఁ గోమలములైన; కరాః = కిరణములు; ఇహ = ఇక్కడ; త్వరితమ్ = వేగముగా; పాండుతామ్ = పాండురోగమును; ఖండయంతు = ఖండించుఁగాక!

**తాత్పర్యము :** విశ్వమున కలంకారములైనవి, ఆకాశములో మండలాకారముగా నెగురుచున్న పక్షుల వలయములు గలవి, పాషండులైన దానవులను దండించునవి, తూర్పుదిక్కును శోభింపఁజేయునవి, పద్మముల సమూహములను వికసింపఁ జేయుటలో నుద్దండ పాండిత్యము (ఎక్కువ నైపుణ్యము) గలవి, ప్రాతఃకాలమునందుఁ గఠినముగాఁ గాక మృదులములుగా నున్నవి యగు సూర్యుని కిరణములు పాండురోగమును ఖండించుఁగాక! మిట్టమధ్యాహ్నవేళ యందున్నట్లుగా నుదయకాలమునందు సూర్యకిరణములు వాఁడిగా వేఁడిగా నుండవు.

శ్లోకము నందంతట 'ణ్డ' కారముతో ననుప్రాసము. చండాంశుని యచండ కరములన్నచోట విరోధాభాసము.

శ్లో॥ ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే ।
వినాపి తన్వి! హారేణ వక్షోజౌ తవ హారిణౌ ॥ (కువలయా–76)

విరోధము లేకుండ విరోధమున్నట్లు కనిపించినచో విరోధాభాసము. ఓ సుందరీ! హారములు లేకపోయినను నీ కుచములు హారులే - యందమైనవే - అని కువలయానందము.

**విశేషము :** 'పాఖండాన్ దండయంతః' 'తే ఖండాన్ పౌండరీకాన్' - అని ముద్రిత పాఠములు. 'పాషండ - పాఖండ' - 'షండ - ఖండ' రూపాంతరములు. ఔత్తరాహులలోఁ గొందఱు షకారమునకు బదులు ఖకారమునుచ్చరింతురు.

## 30

**అవతారిక :** ఇప్పుడు ఛాందోగ్యోపనిషత్తు ననుసరించి సూర్యభగవానుని సర్వాంతరాత్మునిగా నుపాసించుచు స్తోత్రమును ముగించుచున్నాఁడు -

**శ్లో॥ ఊర్ధ్వమ్ పాపావలిభ్యః స్థిత ఇతి జగదే యస్య వేదైరుదాఖ్యా**
**నిన్యుః కప్యాసనాభం ఖలు సహచరతాం నేత్రయోః పుణ్డరీకమ్ ।**
**గేష్ణావృక్సామ యస్య ద్రుతకనకనిభశ్మశ్రుకేశాఖిలాఙ్గః**
**సోఽయం సర్వాన్తరాత్మా తవ దిశతుతరాం వాసరేశః శివాని ॥ ౩౦**

**ప్రతిపదార్థము :** పాప + ఆవలిభ్యః = పాపముల వరుసలకు; ఊర్ధ్వమ్ = పైఁగా; స్థితః = ఉన్నాఁడని; యస్య = ఏ సూర్యునియొక్క; ఉత్ + ఆఖ్యా = 'ఉత్' అను పేరుగా; వేదైః = వేదములచే; జగదే = చెప్పఁబడినదో; నేత్రయోః = కన్నులకు; సహచరతామ్ = సాహచర్యమును బొందిన (పోలిన); పుండరీకమ్ = ఎఱ్ఱ తామరపూవును; కపి = పండుకోఁతి యొక్క; ఆసన = పిఱుఁదుతో; ఆభమ్ = సమానమైన కాంతి గలదిగా; నిన్యుః = తీసికొనిరో (కోఁతి పిఱ్ఱల మామిడి మొదలగునవి లోకములో సుప్రసిద్ధములే); యస్య = ఏ సూర్యునకు; ఋక్సామ = ఋగ్వేదమును, సామవేదమును; గేష్ణౌ = గానము చేయునవియో; ద్రుత = కరఁగించిన; కనక = బంగారముతో; నిభ = సమానమైన; శ్మశ్రు = మీసములు; కేశ = జుట్టు; అఖిల = సమస్తమైన; అంగః = అవయవములు గలవాఁ డెవ్వఁడో; సః = ఆ; అయమ్ = ఈ; సర్వ + అంతరాత్మా = సకల జీవులకు నంతరాత్మగా నున్న; వాసర + ఈశః = సూర్యుఁడు (దినపతి); తవ = నీకు; శివాని = శుభములను; దిశతు తరామ్ = బాగుగా నిచ్చుఁ గాక!

**తాత్పర్యము :** పాపశ్రేణుల కతీతముగా నూర్ధ్వములో నున్నాఁడని – 'ఉత్తను' గొప్ప పేరుతో వేదము లెవ్వనిఁ జెప్పుచున్నవో; ఎవ్వని కన్నులతోఁ బోలిన పుండరీకమును మర్కట పృష్ఠముతో సాహచర్యము గలదానిగా వేదవేత్తలు చెప్పుచున్నారో; ఋగ్వేద – సామవేదము లెవ్వని గానము చేయుచుండునో, కరఁగించిన బంగారముతో సమానముగా నెవ్వని మీసములు, కేశములు, సకలాంగములు నుండునో యట్టి సర్వాంతరాత్ముఁడైన సూర్యుఁడు నీకు మంగళము లెక్కువగా నిచ్చుఁగాక!

ఈ శ్లోకములోఁ బరమాత్ముని కన్నులు పుండరీకమును బోలినవి. ఆ పుండరీకము కప్యాసనమును బోలినదని వర్ణించుటచే నుపమితోపమాలంకారము.

ఈ శ్లోకమునకు మూలమీ ఛాందోగ్యోపనిషన్మంత్రము –

య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రు ర్హిరణ్యకేశ ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః । తస్య యథా కప్యాసమ్ పుణ్డరీకమేవమక్షిణీ తస్యోదితి నామ స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదిత ఉదేతి హవై సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద॥

తస్యర్చ్చ సామ చ గేష్ణౌ తస్మాదుద్గీథ స్తస్మాత్త్వేవోద్గాతైతస్య హి గాతా స ఏష మే చాముష్మాత్ పరాఞ్చో లోకాస్తేషాం చేష్టే దేవకామానాం చేత్యధిదైవతమ్ ॥

సూర్యమండలములో నేపురుషుఁడు కనఁబడుచున్నాఁడో యతఁడు బంగారు కాంతి గలవాఁడు. బంగారు మీసములు, బంగారు కేశములు గలవాఁడు. నఖాగ్ర పర్యంతము పూర్తిగా సువర్ణస్వరూపుఁడే. ఆ పురుషునకుఁ గప్యాసము, పుండరీకము వంటి రెండు కన్నులు గలవు. అతఁడు సర్వపాపముల నుండి విముక్తుఁడగుటచే 'ఉత్' అను పేరు గలిగియున్నాఁడు. ఆ పురుషుని ఋగ్వేదము, సామవేదము గానము చేయుట వల్లనే ఋత్విక్కు 'ఉద్గాత' యని పిలువఁబడుచున్నాఁడు. ఉద్గీథుఁడని చెప్పఁబడు దేవుఁడే సర్వలోకనియామకుఁడు. ఆ పురుషు నుపాసించుటయే యధిదైవతోపాసన – యని దీని యర్థము.

సూర్యమండల మందున్న పురుషుఁడు విష్ణుమూర్తి.

శ్లో॥ ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ
నారాయణః సరసిజాసనసన్నివిష్టః ॥

నారాయణుఁడు సూర్యచంద్రులు కన్నులుగాఁ గలవాఁడు. ఒక కన్ను కప్యాసమువలె మఱొక కన్ను పుండరీకమువలె నుండునని యథాశ్రుతార్థము.

శ్రీ శంకర భగవత్పాదాచార్యులీ ఛాందోగ్య శ్రుతికర్థము చెప్పుచు – తస్యైవం సర్వతః సువర్ణవర్ణస్యాప్యక్ష్ణోర్విశేషః। కథం? తస్య యథా కపే ర్మర్కటస్యాసః కప్యాసః। ఆసేరుపవేశనార్థస్య కరణే ఘఞ్। కపి పృష్ఠాన్తో యేనోపవిశతి। కప్యాసమివ పుణ్డరీకమత్యన్తతేజస్వి। ఏవమస్య దేవస్యాక్షిణీ। ఉపమితోపమానత్వాన్న హీనోపమా॥ ఆ సువర్ణవర్ణుఁడగు పురుషునకు రెండు కన్నులు గలవు. కపి పృష్ఠమువలె నత్యంత కాంతిమంతమైన పుండరీకమువంటి కన్నులు. ఇక్కడఁ గన్నుల కుపమానము పుండరీకము. పుండరీకమున కుపమానము కప్యాసము. ఇది యుపమితోపమ. కాఁబట్టి హీనోపమా దోషము లేదని భాష్యము వ్రాసినారు.

ఈ శంకరభాష్యము ననుసరించి జగన్నాథ మహాకవి యాదిత్యపురుషుని నేత్రములకు సహచరత్వము గల పుండరీకమును గప్యాసనాభముగా సందేహము లేకుండ వర్ణించినాఁడు.

శ్రీ బెల్లంకొండ రామరాయకవి వేదాంతముక్తావళిలో 'రక్తాంభోరుహపుండరీక– నయనమ్' – భగవంతునకొక కన్ను సూర్యుఁడు, నొకకన్ను చంద్రుఁడు గావున నెఱ్ఱని పద్మము, తెల్లని పద్మము వంటి కన్నులు గలవాఁడని వర్ణించిరి. శ్రీ బెల్లంకొండవారు శ్రీశంకరమతానుయాయులు గావున నిక్కడ – 'కప్యాసోజ్జ్వలపుండరీక నయనమ్' అని పఠింపవచ్చును.

వేదాంతశాస్త్రమునందలి యంతరధికరణములో నీ యాదిత్య పురుషుని గూర్చి విచారింపఁబడినది. శ్రీశంకర – రామానుజ – శ్రీకంఠాది బ్రహ్మసూత్ర భాష్యకారులందఱు నీ ఛాందోగ్యోపనిషత్తునే విషయవాక్యముగా నిక్కడఁ గైకొనినారు.

## కప్యాస శ్రుత్యర్థచర్చ

కప్యాస శబ్దమున కర్థము చెప్పుటలో నద్వైతాచార్యులకు, విశిష్టాద్వైతాచార్యులకు మధ్య విశేష చర్చ గలదు. దీనికొక చిన్న కథ గలదు.

శ్రీరామానుజులు బాల్యములో యాదవప్రకాశయతికి శిష్యులు. గురువులను శుశ్రూషించుచు వేదాంతము నభ్యసించెడివారు. ఒకనాఁడు యాదవప్రకాశయతి

ఛాందోగ్యోపనిషత్తును బాఠము చెప్పుచుఁ గప్యాసమనఁగా మర్కటపృష్ఠమని శ్రీశంకర భాష్యానుసారముగా నర్థము చెప్పిరి. అది వినఁగానే రామానుజుల కన్నులనుండి నీళ్ళు బొటబొట కారినవి. అదిచూచి యాదవప్రకాశయతి యేల యేడ్చుచుంటివని శిష్యునిఁ బ్రశ్నించెను. శ్రుతికశ్లీలార్థము చెప్పుటవిని దుఃఖించుచుంటినని శిష్యుఁడు సమాధానము చెప్పెను. అయినచో నీ శబ్దమునకు సరియగు నర్థమేమని గురువులు ప్రశ్నించిరి. అప్పుడు రామానుజులు కప్యాసనయనుఁడనఁగాఁ బద్మనయనుఁ డని కపి యనఁగా ఁబద్మనాళమని, కప్యాసమనఁగా ఁబద్మమని యర్థము చెప్పిరి. ఈ క్రొత్తయర్థమును గురువు మెచ్చుకొని యంతవఱకు నద్వైతిగానున్న యాదవప్రకాశయతి రామానుజుల శిష్యుఁడై విశిష్టాద్వైతమతమును స్వీకరించెను. వెంటనే రామానుజులు యాదవప్రకాశగురువులకు నామముపెట్టి వైష్ణవమతస్థులుగా మార్చిరి. అప్పటినుండి యాదవప్రకాశులు వైష్ణవులయిరి. శ్రీవైష్ణవుల గోష్ఠిలో నీ కథను గొప్పగాఁ జెప్పుకొందురు.

భగవద్రామానుజాచార్యులు వేదార్థసంగ్రహములో –'గంభీరాంభస్సముద్భూత–సుమృష్టనాళరవికరవికసితపుండరీకదళామలాయతేక్షణః' – లోఁతైన నీళ్ళనుండి పుట్టి యేపుగాఁ బెరిఁగిన నాళమునందు సూర్యకిరణములచే వికసింపఁబడిన పుండరీకముయొక్క దళములవలె నిర్మలమైన విశాలమైన నేత్రములు గలవాఁ డాదిత్యాంతర్గత పురుషుఁడని యర్థము చెప్పిరి.

అద్వైతానంద సరస్వతి బ్రహ్మవిద్యాభరణము నందలి యంతరధికరణములో శ్రీ శంకరభగవత్పాదుల కంటెఁ బ్రాచీనులైన వాక్యకారులు కప్యాసశబ్దమున కనేకార్థములు చెప్పినట్లు పేర్కొనినారు –

(1) కమ్ పిబతీతి కపిః । నీటినిఁ ద్రాగువాఁడు కాఁబట్టి కపియనఁగా సూర్యుఁడు. సూర్యునిచే వికసింపఁబడినది కప్యాసము – పద్మము.

(2) కమ్ పిబతీతి – కపిః । నీటిని ద్రాగునది కపి = పద్మనాళము. దానియం దుండునది పద్మము.

(3)కమ్ = నీటిని, పిబతీతి = త్రాగునది కపాః । కపి (సప్తమి) దానియందుండునది కప్యాసము = పద్మము.

(4) కే అప్యాస్తే ఇతి కప్యాసమ్ = నీటియందుండునది కప్యాసము. ఈ విధముగా

వాక్యకారులనేకార్థములను జెప్పినను ఛాందోగ్యభాష్యములో శ్రీభగవత్పాదులు 'కపేః = కోఁతియొక్క; ఆసః = పృష్ఠము' – అనుదానిని పుండరీకమునకు విశేషణముగా స్వీకరించిరి.

భగవద్రామానుజుల శ్రీభాష్యమునకు వ్యాఖ్యయైన శ్రుతిప్రకాశికలో సుదర్శనాచార్యులచే వాక్యకారులు చెప్పిన యాఱర్థములు పేర్కొనఁబడినవి.

(1) కపిః = సూర్యుఁడు. 'కపి చలనే' యను ధాతువునుండి కపి శబ్దము పుట్టినది. 'కమ్ పిబతీతి చ' = నీళ్ళు త్రాగువాఁడు సూర్యుఁడు. 'కపిర్బిభర్తి తేజసమ్' – అని వైదిక ప్రయోగము. ఆ సూర్యుని యాసము = మండలము కప్యాసము.

(2) కపిః = కోఁతి. ఆసః = దాని యాసము జఘనప్రదేశము. మర్కట పృష్ఠము చెప్పఁబడినది.

(3) కప్యాసమ్ = కొంచెము వికసించినదని మఱియొక యర్థము. అట్టిది పుండరీకము.

ఈ మూఁడర్థములు పూర్వపక్షములుగా గ్రహింపఁబడినవి.

(4) కమ్ = నీటిని; పిబతి = త్రాగువాఁడు కపి = సూర్యుఁడు. వానిచే వికసింపఁ బడునది కప్యాసము.

(5) కమ్ = జలమును; పిబతి = సర్వరంధ్రములతోఁ ద్రాగునది. పద్మనాళము. దానిపై నుండునది కప్యాసము. కోసిన పద్మము కంటెఁ దామర తూఁడుపై నున్న పద్మమునకు శోభ యెక్కువగా నుండును.

(6) కమ్ = జలము. 'ఆస – ఉపవేశనే' అను ధాతువు నపిపూర్వకముగా గ్రహింపవలెను.

'వష్టి భాగురిరల్లోపమవాప్యోరుపసర్గయోః'

భాగురి మతములో 'అపి' శబ్దములోని 'అ'కారము లోపించి 'పి'వర్ణము మిగిలి 'కపి' యని యగును. 'కప్యాసమ్ పుండరీకమ్' అనఁగా నీళ్ళలోనున్న పద్మమని యర్థము. ఈ మూఁడు వ్యుత్పత్తులు శ్రీరామానుజులచే సిద్ధాంతముగా స్వీకరింపఁబడినవి.

భగవద్రామానుజాచార్యులు భగవద్గీతకు, బ్రహ్మసూత్రములకు భాష్యములు రచించిరి తప్ప యుపనిషత్తులకు భాష్యములు రచింపలేదు. వేదార్థసంగ్రహములో నుపనిషద్విషయములను గ్రోడీకరించిరి.

రంగరామానుజాచార్యు లుపనిషత్తులకు విశిష్టాద్వైతపరముగా వ్యాఖ్యలు రచించిరి. వీరు శంకరాచార్యులు చెప్పిన యర్థములో నశ్లీల మున్నట్టుట్టంకించిరి.

ఈ విషయములనన్నింటిని సమీకరించి శ్రీ పోలహం రామశాస్త్రిగారు **ద్రవిడాత్రేయదర్శనములో** వేద పురాణాదుల కశ్లీలదోషము లేదని యీ క్రింది వేదవాక్యమును శ్రీమద్రామాయణశ్లోకము నుదాహరించిరి.

శ్లో॥ గాఢమాలింగ మచ్చిత్త! యోషా జారమివ ప్రియమ్ ।

అనురక్తురాలైన స్త్రీ జారుఁడైన ప్రియునిఁ గౌఁగిలించుకొనునట్లుగా నో మనసా! భగవంతునిఁ గౌఁగిలించుకొనుము.

శ్లో॥ వరాహరుధిరాభేణ శుచినా చ సుగంధినా ।
అనులిప్తమ్ పరార్థ్యేన చందనేన పరంతపమ్ ॥ (వా.రా. 2-16-9)

పంది రక్తమువంటి చందనమును శ్రీరాముఁడు పూసికొనినట్లు వాల్మీకి వర్ణించినాఁడు.

కాఁబట్టి 'కప్యాసమ్ = మర్కట పృష్ఠము' అనుచోట నశ్లీలత్వాది దోషముల నారోపింపఁగూడదు.

ఇక్కడ నింకొక శంక :- పుండరీకమనఁగా శ్వేతపద్మము. 'పుండరీకం సితాంభోజమ్' - అని యమరము. తెల్లనిపద్మమున కుపమానముగా నెఱ్ఱని మర్కట పృష్ఠమును గ్రహించుట యెట్లు? దీనికి **శివార్కమణిదీపికలో** - నన్వమరకోశే 'పుండరీకం సితాంభోజ' మిత్యనుశిష్టమ్ । తత్ర కథం కప్యాస విశేషణోపనీతం లౌహిత్యమన్వేతు? సత్యమ్ । తదనుశాసనం నాభియుక్తసమ్మతమ్ ॥ యతః శబరస్వామినా నవమాధ్యాయే 'మౌద్గం చరుం నిర్వపేచ్ఛ్రియై శ్రీకామ' ఇతి విహితాయామిష్టౌ పుండరీకాణి బర్హీంషి భవంతీతి స్తరణార్థత్వేన విహితేషు పుండరీకే ష్వతిదేశప్రాప్తస్య 'దర్భైస్తృణీతహరితైః' ఇతి మంత్రస్య దర్భపదస్థానే పుండరీకపదమివ హరితపదస్థానే రక్తపదమూహితవ్య మిత్యుక్తమ్ । పార్థసారథిమిశ్రప్రభృతిరపి రక్తపదోహవిధిస్తథైవోక్తః । వాక్యకారేణాప్యత్రైవ విషయవాక్యే పుండరీకవిశేషణం కప్యాసపదమ్ మర్కటజఘనపరతయా వ్యాఖ్యాతమ్॥

పూర్వమీమాంస యందలి తొమ్మిదవ యధ్యాయములో శ్రీకాముఁడు చేయవలసిన యిష్టి యందుఁ బుండరీకములే హరితదర్భలగు చున్నవి యనుచోట దర్భపద స్థానమునందుఁ బుండరీకమును, హరితపద స్థానమునందు రక్తపదము

నూహింపవలెనని శ్రీశబరస్వామి, పార్థసారథి మిశ్రులు కూడఁ జెప్పిరి. అనఁగా నిష్టిలో హరిత దర్భలుండవలసిన చోట శ్రీకామేష్టిలో రక్తపుండరీముల నుంచవలెనని భావము. దీనినిబట్టి పుండరీకమనఁగా రక్తపద్మమను నర్థమున్నట్లు తెలినది. అందువల్లనే ఛాందోగ్యవాక్యకారులు పుండరీకవిశేషణమైన **కప్యాస**పదమును **మర్కటజఘన** పరముగా వ్యాఖ్యానించిరి – అని శ్రీమదప్పయ్యదీక్షితేంద్రులు సమన్వయము చేసినారు. శ్రీరంగరామానుజాచార్యులు కూడ ఛాందోగ్యభాష్యములో శ్రీ దీక్షితుల వాక్యములనే యథాతథముగా ననువదించినారు.

సూర్యమండలమునందలి పురుషుఁడు 'పరమాత్మ' యని శ్రీశంకర భగవత్పాదులు; 'విష్ణుమూర్తి' యని భగవద్రామానుజాచార్యులు; 'పరమశివుఁ'డని శ్రీ నీలకంఠారాధ్యపాదులు ప్రతిపాదించిరి. జగన్నాథమహాకవి సూర్యస్తోత్ర ప్రధానమైన యీ కావ్యశ్లోకములో నాదిత్యమండలాంతర్గతుఁడైన పురుషుఁడు సూర్యభగవానుఁడే యని వక్కాణించినాఁడు. శ్రీశంకరభాష్యానుసారముగాఁ గప్యాస శబ్దమునకు మర్కట పృష్ఠమని యర్థము వచ్చునట్లుగాఁ 'గప్యాసనాభమ్' అని ప్రయోగించినాఁడు.

'కప్యాసనాభమ్' అను దానికి బదులుగా 'కేఌప్యాసనార్థమ్' అనియు, 'గేష్ణావృక్సామ' యనుదానికి బదులుగా 'ఓష్ఠావృక్సామ' యనియుఁ బాఠాంతరములు గలవు.

శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారి ప్రతిలోఁ 'గప్యాసమర్చాః' అను దానినిఁ బ్రధాన పాఠముగాఁ దీసికొని 'కప్యాసనాభమ్' అను దానినిఁ బాఠాంతరముగాఁ జూపినారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రతియం దార్యేంద్ర శర్మగారు, కాశీ చౌఖాంబా ప్రతి యందు బాలక్రీడాకారులగు శ్రీమధుసూదనశాస్త్రిగారు; పావనీ వ్యాఖ్యాతలగు నీమని వెంకట సత్యనారాయణమూర్తి గారు 'కప్యాసనాభమ్', 'గేష్ణావృక్సామ' యను పాఠములనే స్వీకరించిరి. ఛాందోగ్యోపనిషన్మంత్రముల కీపాఠములే యనుకూలములు.

ఋక్సామ : ఋక్చ సామ చ ఋక్సామ – ఋక్సామమనియే యగును. అచతుర విచతుర సుచతుర స్త్రీపుంసధేన్వనుడహర్క్సామ వాఙ్మనసాక్షిభ్రువ దారగవోర్వష్ఠీవ పదష్ఠీవ నక్తన్దివరాత్రిన్దివాహర్దివ సరజసనిః శ్రేయస పురుషాయుషద్వ్యాయుషత్ర్యాయుషర్గ్య జుష జాతోక్షమహోక్ష వృద్ధోక్షోపశునగోష్ఠశ్వాః (5–4–77) అను సూత్రములో నజంతముగా నిపతంపఁ బడినది.

దిశతుతరామ్ : అతిశయార్థములోఁ 'దరప్' ప్రత్యయము. తరప్తమపౌఘః (1-1-22) అను సూత్రముచే ఘసంజ్ఞ.

కిమేత్తిఙవ్యయ ఘాదామ్వద్రవ్యప్రకర్షే (5-4-11) అనుసూత్రముచే 'ఆము' ప్రత్యయము. దిశతు + తర + ఆమ్ = 'దిశతు తరామ్' అని యయినది.

మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే...

అను మహాభాష్యకారుల వచనము ననుసరించి యీ స్తోత్రకావ్యము నుల్లాస శబ్దముతో నారంభించి శివశబ్దముతో మంగళాంతముగా ముగించుట మిక్కిలి రమణీయము.

తే॥గీ॥ పుష్పగిరి శంకరాచార్య పూజ్యపాద
దత్తవిద్యావిభూషణోద్దండ బిరుద
ధారి గరిమెళ్ళ శర్మ సుధాలహరికి
నమృతధారాఖ్యటీక నాంధ్రమునఁ జెప్పె.

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు

శ్రీః

శ్రీశార్వరీ భాద్రపద శుక్లైకాదశీ స్థిరవారము.

29-08-2020

ప్రత్యక్షదైవమైన సూర్యభగవానుఁడు విశ్వవ్యాప్తముగా నున్న కరోనా వ్యాధిని రూపుమాపి సకలజనులను నారోగ్యవంతులుగాఁ జేయుఁగాక!

మంగళమ్ మహత్

శ్రీశ్రీశ్రీ